


ఖర | భారతి | సంపుటము 28
ఆశ్వయుజము | | సంచిక 10


# పూలలో జ్వాలలు

శ్రీ దాశరథి






నన్ను రమ్మని పిలుచుకొన్నావు నాడు
వద్దు పొమ్మని నేడు కోపపడినావు
నవ్వుకొన్నాను నేను ఆనాడుకూడ
నవ్వుచున్నాను నేను ఈనాడుకూడ.

నాడు నీ యింటి వెనుక పున్నాగ పూచె,
నేడు నీ యింటిముందు కన్నెర్ర జేసె
సార చారు శృంగార మందార సుమము.
అరుణ తరుణప్రభాత భాస్కరసమమ్ము

అంత చల్లని నీ గుండె యందదేల
కోప మగ్నికీలామాలికోపమమ్ము?
ఇంత చల్లని ఈ పూల చెంత ఏల
వెలివచ్చు వహ్నిజాల వెచ్చదనము?

నీవు విడచిన చీర పన్నినది ఉచ్చు ;
నీవు ముడిచిన కొప్పులో నిఖిల జగము
కట్టువడిపోయె ; కట్టినబట్ట విడచి
ఉంచుకొనె దేల అజ్ఞాన కంచుకమ్ము.

ఘోర కారాగృహమ్ములు కూలఁద్రోచి
బయలు వెడలిన రాక్షస ప్రకృతి వాని
కదలనీకుండ బంధించ గలుగు - నీదు
కోమల భుజా భుజంగోపగూహనమ్ము

నగ్న జీవికి నాకు నీవగ్ని చేల
నర్పణము చేసి కట్టుకొమ్మందు వేల ?
చల్ల చల్లని పూలలో జ్వాలలెగసి
ఎప్పుడో చుట్టుకొన్నవి ఈ జగమ్ము.

కనుపడిన 'తెల్ల' యెల్ల శృంగారమనుచు
కనబడిన 'నల్ల' యెల్ల వికార మనుచు
మాల్గులో కాన కెవ్వడు వెల్గుచూపు
నీ సితాసిత లోచనాంతికము గాక !



# నేటి కాంగ్రెస్




★

'కౌటిల్య'

కాంగ్రెస్ సంస్థ అంటే దేశానికి గాంధీ నెహ్రూల నాయకత్వంకింద స్వాతంత్ర్యం తెచ్చిపెట్టే సంస్థ అని పాతికేళ్లు పైగా భారతీయుల భావన. స్వాతంత్ర్యం లభించినతరవాత అది దేశంలో ప్రజలకు సుక్షేమం చేకూర్చగల జాతీయ రాజకీయ సంస్థ అనేభావం ఏర్పడింది. స్వాతంత్ర్యసమరమే ప్రధానలక్ష్యంగా ఉద్యమం నిర్వహించినంత కాలమూ కాంగ్రెస్ సంస్థలో సోషలిస్టులకు కూడా తావుండేది. సమాజజీవనాన్ని ఏరీతిగా సంస్కరించి ఎలా తీర్చి దిద్దాలి అనే సమస్యకు భిన్న పరిష్కార విధానాలను అనువర్తింప చేయగోరే భిన్నవ్యక్తులకు తావుండేది. స్వాతంత్ర్యసిద్ధి అనంతరం సోషలిస్టులు కాంగ్రెస్‌నుంచి విడిపోయినప్పటికీ, తదితరులందరూ కాంగ్రెస్ సంస్థపట్లనే విశ్వాసంతో, తమతమ లక్ష్యాల సాధనకు పరికరమిదొక్కటేననే నమ్మకంతో ఆ సంస్థనే అంటిపెట్టుకుని తమ రాజకీయజీవితం నెరపుకుంటున్నారు.

దేశానికి ఆర్థికప్రగతినీ, ప్రజలకు సుఖసమాజ జీవనాన్నీ సమకూర్చాలంటే ఆర్థిక రాజకీయ సిద్ధాంతసమన్వితమైన పరివర్తన, లేక విప్లవం ప్రధానమని భావించే సోషలిస్టులు, కమ్యూనిస్టులు మాత్రం కాంగ్రెస్ ఇంక ఎంతమాత్రమూ దేశ సమస్యల్ని పరిష్కరించజాలదనే భావంతో కాంగ్రెసుసంస్థనుండి నిష్క్రమించారు. ఆర్థిక విప్లవం కాని రాజకీయ విప్లవం కాని హితవుకాని రాజకీయ వాదులందరూ (హిందూసభ మొదలైన మత ప్రధాన రాజకీయవాదులు మినహా) కాంగ్రెసు ద్వారానే దేశసమస్యల్ని పరిష్కరించాలనే విశ్వాసంతో సంస్థలో ఉండిపోయారు. జస్టిస్ పార్టీ వారూ మరికొందరూ కూడా, క్రొత్తగా చేరారు. అయితే దేశసమస్యల పరిష్కారవిధానంగురించీ, సుపరిపాలనానిర్వహణగురించీ అభిప్రాయభేదాలు వీరిలో విరివిగా ఉన్నాయి.

ద్వితీయ ప్రపంచ యుద్ధఫలితంగా ఇతర దేశాలలోవలెనే భారతదేశంలో కూడా ఏర్పడిన ఆర్థిక దుర్భిక్షంవల్లనూ, దేశవిభజన ఫలితంగా సంభవించిన ప్రత్యేక ఆర్థికసమస్యలూ, అల్పసంఖ్యాకవర్గ సమస్య, పాకిస్తాన్ వైరంవల్లనూ భారతరిపబ్లిక్ స్వాతంత్ర్య సంరక్షణార్థం కాంగ్రెస్‌వంటి జాతీయరాజకీయ సంస్థ అవసరమని గాంధీ నెహ్రూలు అభిప్రాయపడ్డారు. అంతేకాదు, అనేక శతాబ్దాలలో భారతదేశమంతా రిపబ్లిక్ వ్యవస్థలో మొట్టమొదటిసారిగా ఇప్పటికి ఐక్యమయింది. ప్రజాస్వామ్యవ్యవస్థ అనేది క్రమక్రమంగా అలవడవలసినదనీ, రాజ్యాంగ నిబంధనలపట్ల విధేయత, శాసననిర్మాణం, పరిపాలనాది వ్యవహారాలు, రాజకీయోద్యమాలు మొదలైన విషయాలలో సత్సంప్రదాయాలను అలవరచడానికి సకల రాజకీయపక్షాల నాయకులూ కృషిచేయకపోతే, సుస్థిరమైన ఈ రాజకీయ స్వాతంత్ర్యమూ, ప్రజాస్వామ్యమూ వ్యర్థమైపోగలవనీ కాంగ్రెస్ అగ్రనాయకులు భావించారు.

అయితే గాంధీ మహాత్ముడు పూర్వ కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమనిర్వహణ నిమిత్తం రాజకీయ పక్షాలతో ప్రమేయంలేని లోకసేవాసంఘమొకటి స్థాపించబడాలని కూడా సూచించారు. స్వాతంత్ర్యం సిద్ధించినతరువాత కాంగ్రెస్ సంస్థ అక్కర తీరిపోయిందనీ, ఇంక కాంగ్రెస్ సంస్థను ఉపసంహరించి విస్పష్టరాజకీయ పరిపాలనాది ప్రణాళికలననుసరించగల క్రొత్త రాజకీయ పక్షాలను స్థాపించాలనీ అనేకులు సూచించారు. కాని స్వాతంత్ర్యం లభించినతరువాత కూడా ఆ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకోడానికీ, ప్రజాస్వామ్యవిధుల నిర్వహణకు సత్సంప్రదాయాలను నెలకొల్పడానికీ నిస్వార్థ రాజకీయ నియమాల ననుష్ఠించగల సంస్థగా కాంగ్రెస్ తెన్నుచూపవలసిన అగత్యం ఇంకా ఉందని నెహ్రూ అభిప్రాయం.

ఈ లక్ష్యంతోనే కాంగ్రెస్‌సంస్థను రాజకీయ సంస్థగా మాత్రమే కాక జాతీయసంస్థగాకూడా కర్తవ్యవిధుల నేర్పరచి పండిట్ నెహ్రూ నాయకత్వంక్రింద కాంగ్రెస్ నాయకులు దేశమంతటా పరిపాలనాది కార్యకలాపాలనూ, రాజకీయ ప్రచారోద్యమాలనూ సాగిస్తూ వచ్చారు. ఆర్థిక ఆహారాది సమస్యలూ, శాంతిసంరక్షణసమస్యా, విదేశాంగ వ్యవహార సమస్యల పరిష్కార యత్నంలో కాంగ్రెస్ ప్రభుత్వాలు పూర్తిగా నిమగ్నమైనాయి. ఈ సమస్యల నెంతవరకు ప్రభుత్వాలు పరిష్కరించగలిగినాయని అంచనా వెయ్యడం ఇప్పుడు సాహసమే నని చెప్పాలి. ఏ కార్యక్రమాన్నైనా ఎంతవరకు నిర్వహించగలిగారనే అంచనాపైనే ఆయా ప్రభు

త్వాల సమర్థతను పరిగణించవలసివస్తుంది. పాకిస్తాన్ రాష్ట్రాలనుంచి వచ్చిన శరణార్థులకు భారత ప్రభుత్వం చేసిన సహాయం అపారం. అయినా శరణార్థుల పునరుద్ధరణ సమస్యను ప్రభుత్వం పరిష్కరించ లేకపోయింది. ఇదే రీతిగా పరిపాలనలో లోపాలు అనివార్యం.

స్వాతంత్ర్యం లభించిన తరువాత కాంగ్రెస్ సంస్థలో అనేకులు లక్షలకొద్దీ కొత్తగా చేరారు. వివిధ సమస్యలను గురించి కాంగ్రెస్‌లోనే భిన్న అభిప్రాయాలుకూడా ఉన్నాయి. అయినప్పటికీ కాంగ్రెస్ వాదులందరూ ఏకకంఠంతో పండిట్ నెహ్రూ పరిపాలనా విధానాన్ని ఆమోదిస్తున్నారు. అయితే పరిపాలనలో వచ్చిన లోపాలవల్లనూ, పరిష్కరించబడని సమస్యలవల్లనూ ప్రజలలోనే కాక కాంగ్రెస్ వాదులలోకూడా కాంగ్రెస్ ప్రభుత్వాల పట్ల అసంతృప్తి వ్యాపించింది. దేశంలో, ప్రభుత్వోద్యోగులలో, వ్యాపారంలో అవినీతి ప్రబలంగా వృద్ధిచెందిన మాటకూడా నిజమే. అయితే దీనికి హేతువు నెహ్రూ నాయకత్వంక్రింద ప్రభుత్వాలు అనుసరిస్తున్న పరిపాలనావిధానాలు కావనీ, పరిపాలకుల అసమర్థత, ఆ విధానాలను అర్ధమనస్కంగా అనుసరించడం మొదలైనవనీ కాంగ్రెస్ వాదులుకూడా భావిస్తున్నారు.

క్రమంగా కాంగ్రెస్ ప్రభుత్వాలకూ, పరిపాలనా కర్తవ్యానికి దూరంగా ఉన్న కాంగ్రెస్ సంఘాలకూ మధ్య సంఘర్షణ ప్రారంభమయింది. అనేక రాష్ట్రాలలో ఈసంఘర్షణ వ్యక్తిగత వైరాలకు దారితీసింది. క్రమంగా ఇది కేంద్రప్రభుత్వానికీ, కేంద్ర కాంగ్రెస్ కార్య వర్గానికీ మధ్య వైమనస్యాలకు దారితీసింది.

ఈ పరిస్థితి కాంగ్రెస్ నాయకులలో అందరికీ కలవరహేతువయింది. కాంగ్రెస్ అధ్యక్షులు టాండన్ గారు నిర్మించిన కార్యవర్గంపట్ల అసమ్మతి సూచకంగా కార్యవర్గ సభ్యత్వానికి నెహ్రూ రాజీనామా నివ్వడంతో, అంతవరకూ అంతర్నిహితమై ఉన్న సమస్య గుప్పునలేచి కాంగ్రెస్ సంస్థనంతటినీ కల్లోలంలో ముంచివేసింది. అంతతో కాంగ్రెస్ నాయకులలో ఆత్మసంశోధన ప్రారంభమయింది. సమస్య స్వరూపాన్ని స్పష్టంగా అర్థం చేసుకోడానికి యత్నించిన వారు రెండువిధాల నిర్వచనలుచేశారు. 1. కాంగ్రెస్ ప్రభుత్వానికీ, కాంగ్రెస్ కార్యవర్గానికీ మధ్య వ్యవహారాలు ఏరీతిగా ఉండాలో నిర్దిష్టంగా నిర్ణయం కాకపోవడం ఈ సమస్యకు హేతువు. 2. కాంగ్రెస్ సంస్థలలో అధికారవాంఛ, అవినీతి మొదలైనవి ప్రవేశించినందువల్ల ఈసమస్య ఉత్పన్నమయింది.

## ప్రభుత్వాలు, కాంగ్రెస్ కార్యవర్గం

ఆచార్య జె. బి. కృపలానీ ౧౯౪౬ నవంబరులో కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామానిస్తూ ఇలా అన్నారు:

"నేను అధ్యక్షునిగా ఎన్నికైనది మొదలు నన్నొక సమస్య బాధిస్తూ వచ్చింది. కేంద్రంలో ప్రభుత్వానికీ, కేంద్రకాంగ్రెస్ కార్యవర్గానికీ మధ్య సంబంధబాంధవ్య లేరీతిగా ఉండాలి?... ఈసమస్య స్పష్టంగా తేలనందువల్ల ఇప్పటికీ కాంగ్రెస్ వాదులు, ప్రజలూ కలవరపడుతున్నారు. ఏ సమస్యలో ఏ నిర్ణయం జరిగినా, లేక ఏ సమస్యాపరిష్కారానికి నిర్ణయం జరగకపోయినా, దీనికి బాధ్యు లెవరని భావించాలో ఎవరికీ బోధపడ్డం లేదు.

జాతిజీవనానికి సంబంధించిన ముఖ్యసమస్యల గురించి కాంగ్రెస్ అధిష్ఠానవర్గాన్ని కాని, ఎన్నుకోబడిన కాంగ్రెస్ అధ్యక్షునిగాని సంప్రదించకుండా ప్రభుత్వం నిర్ణయాలుచేస్తే, కాంగ్రెస్ సంస్థ ప్రభుత్వాలకు ఎలా సహకారమివ్వగలుగుతుంది? ఈనాడు కాంగ్రెస్ ప్రభుత్వాలకూ, కాంగ్రెస్ సంఘాలకూ మధ్య సహకారం లేనందువల్లనే అనేకులు విభ్రాంతులై తెన్ను తెలియక చూస్తున్నారు. ఈ కల్లోలపరిస్థితిని గురించి కార్యవర్గంలోని నా మిత్రులను సంప్రదించాను. గాంధీమహాత్ముని సలహా అడిగాను. ప్రభుత్వానికీ కాంగ్రెస్‌కీ మధ్య సహకారం అత్యవసరమని ప్రతివారూ గమనించారు. కాని అట్టి సహకారాన్ని ఎలా సాధించాలో తెలియడంలేదు. అందరూ ఈ అవసరాన్ని గుర్తించారు కాని క్రియలో ఇది కానరావడంలేదని కూడా గమనించారు. దీనికి ప్రధానసిద్ధాంతాలలోనే ఏకాభిప్రాయం లేకపోవడం కారణం కావచ్చును. లేదా ఈ సంస్థకు అధ్యక్షునిగా ఉన్న నాపట్ల కేంద్రమంత్రివర్గంలోఉన్న నా మిత్రులకు విశ్వాసం లోపించి ఉండవచ్చును... ఈ విషయమై నేను గాంధీజీసలహా కోరాను. నేను రాజీనామా నివ్వడం న్యాయమేనని వా రన్నారు...అయితే కాంగ్రెస్ ప్రభుత్వానికీ, కాంగ్రెస్ కార్యవర్గానికీ మధ్య వ్యవహారా లేరీతిగా ఉండాలో తేల్చుకోకపోతే, క్రమేణా ప్రభుత్వమూ, కాంగ్రెస్ సంస్థా కూడా బలహీనపడగలవు."

చిరకాలంగా ప్రజాస్వామ్యపరిపాలన అనుభవంకల పాశ్చాత్యదేశాలలో కూడా ఇట్టి సంఘర్షణ ఈనాటికీ తప్పలేదు. అమెరికాలో ఇట్టి సంఘర్షణలో పార్టీ బలహీనపడిపోతే, బ్రిటన్‌లో ప్రభుత్వంకంటె పార్టీ అధికంగా బలపడింది. అయితే ఏదేశానికి అనుకూలమైన సంప్రదాయాలను ఆదేశం అలవరుచుకున్నందువల్ల పరిపాలనకు గాని, పార్టీల

కార్యక్రమవిధాన నిర్ణయాలకుగాని ఈసంఘర్షణ ఆటంకాలు కలిగించడంలేదు. అదే రీతిగా భారతదేశంలోకూడా మన పరిస్థితులనుబట్టీ, మన రాజకీయాల స్వరూపాన్నిబట్టీ మనకు అనుకూలమైన సంప్రదాయాలను స్థాపించుకుని, ఈ సంఘర్షణ దేశవ్యవహారాలకు ఆటంకప్రాయం కాకుండా కాపాడుకోవాలి. ఇట్టి సంప్రదాయా లన్నిటికీ ముఖ్యోద్దేశం, ఎన్నికోబడే ప్రభుత్వ యంత్రాంగానికీ, ఎన్నుకునే వోటర్లకూ మధ్య సన్నిహితభావం సాధించడం.

ఇక్కడ మరొక ముఖ్యవిషయాన్ని గమనించవలసిన అవసరం ఉంది. ఈ సంప్రదాయాలు క్రమంగా అలవడవలసినవి. నేటి పరిస్థితినిమాత్రమే గమనించి దానిప్రకారం సంప్రదాయం నెలకొల్పడం వల్ల ఉత్తరోత్తరా అనేక క్లిష్టసమస్యలు ఉత్పన్నం కాగలవు. నేడు కాంగ్రెస్‌లో వర్తిల్లుతున్న స్థితిని సామాన్యమైనదిగా పరిగణించకూడదు. పండిట్ నెహ్రూ ప్రభుత్వనాయకుడుగా ఉన్నారు. అఖిల భారత కాంగ్రెస్ సంఘంలో కాని కేంద్రకాంగ్రెస్ కార్యవర్గంలో కాని పరిపాలనకు సంబంధించిన తీర్మానాలూ, నిర్వచించబడే విధానాలూ, ప్రకటించబడే కార్యక్రమాలూ పూర్తిగా పండిట్ నెహ్రూ అభిమతాన్ని అనుసరించినవేనని మరిచిపోరాదు. కాంగ్రెస్ సంస్థకు కృపలానీగారు అధ్యక్షులుగా ఉన్నా, పట్టాభిగారు అధ్యక్షులుగా వున్నా లేక టాండన్ గారు అధ్యక్షులుగాఉన్నా, పరిపాలనకు సంబంధించినంతవరకు సర్వ వ్యవహారాలూ పండిట్ నెహ్రూ నాయకత్వం క్రిందనే నిర్ణయించబడుతూ వచ్చాయి. ఇందుకు కృపలానీ అధ్యక్షత క్రింద మీరట్ కాంగ్రెస్ చేసిన తీర్మానాలూ, పట్టాభిగారి అధ్యక్షతక్రింద జయపూర్ కాంగ్రెస్ చేసినతీర్మానాలూ, టాండన్ గారి అధ్యక్షతక్రింద నాసిక కాంగ్రెస్ చేసిన తీర్మానాలూ నెహ్రూ పరిపాలనా విధానాన్నే బలపరచడం తార్కాణం. ఇండో పాకిస్తాన్ వ్యవహారాలు, విదేశాంగవిధానంలో ఉభయరాజ్యకూటాలమధ్య తటస్థవిధానం, వ్యాపార విషయాలపై కంట్రోల్సు, ఆహారసమస్యా పరిష్కార విధానం మొదలైనవన్నీ నెహ్రూ నిర్వచించినరీతినే ఆమోదించబడినాయి.

నాసిక్ కాంగ్రెస్ సమావేశంలో శరణార్థులకు సంబంధించిన సమస్యపట్ల వివాదం వస్తుందని మొదట కొందరనుమానించారు. శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ అధ్యక్షులుగా ఎన్నికోబడగానే, ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ పాకిస్తాన్ రాష్ట్రాలనుంచి పారిపోయిన శరణార్థులకు ప్రభుత్వమిప్పుడిస్తున్న సహాయం చాలదనీ, వీరి సహాయంనిమిత్తం ధనం సేకరించడానికి ప్రభుత్వం ప్రజలవద్ద ప్రత్యేక సుంకం వసూలుచేయాలనీ సూచించారు. తిరిగి శ్రీ టాండన్ గారు తమ అధ్యక్షోపన్యాసంలో ఇదే సూచించారు. కాని కాంగ్రెస్ కార్యవర్గం ఈ సూచనను గమనించనైనా లేదు. పండిట్ నెహ్రూ ఇట్టి సుంకం విధించడానికి ప్రతికూలభావం ప్రకటించారు. ఇదేరీతిగా వ్యాపారంలో అవినీతికీ, బ్లాక్‌మార్కెటింగ్‌కీ, కరువులకీ కంట్రోల్సు హేతువని టాండన్ ఉపన్యాసాలిచ్చేవారు. కాని కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికైనాక కంట్రోల్సు అవసరం లేకపోలేదని అధ్యక్షోపన్యాసంలో చెప్పారు.

దీనినిబట్టి అధ్యక్షపదవి కాంగ్రెస్‌లో ఎవరికి లభించినప్పటికీ, వాస్తవంగా కాంగ్రెస్ సంస్థకు ఈనాడు పండిట్ నెహ్రూ యేకైక నాయకుడుగా పరిగణించబడుతున్నారని తెలుస్తుంది. పండిట్ నెహ్రూ అభిప్రాయాలను దాదాపు కాంగ్రెస్ వాదులందరూ శిరసా వహిస్తున్నారు. అందువల్లనే కాంగ్రెస సంస్థకు ఈవరకైనా బలమూ, ప్రజలలో పరపతీ, కాంగ్రెస్ వాదులలో కాంగ్రెస్ సంస్థపట్ల విశ్వాసమూ ఉన్నాయనీ, నెహ్రూ ప్రభావం లోపించినట్లయితే సంస్థ విచ్ఛిన్నమైపోయేదనీ టాండన్ మొదలైన నాయకులే అనేకులు భావిస్తున్నారు.

ప్రభుత్వానికి గాని, కాంగ్రెస కార్యవర్గానికి గాని నెహ్రూ నాయకత్వం వహించనప్పుడు, ఇతర నాయకులు ఆ పదవులను ఆక్రమించినట్లయితే, అప్పుడు పరిస్థితి ఏరీతిగా ఉంటుందో యోచించి, ఆప్రకారం కార్యవర్గానికీ ప్రభుత్వానికీ మధ్య ఉండవలసిన వ్యవహార విధానాన్ని నిర్ణయించవలసిన అవసరం కలుగుతున్నది. నెహ్రూ నాయకుడుగా ఉన్నంతవరకూ ఉభయకార్యసంఘాలకూ నాయకత్వం వహించడంతో ఈ సమస్య తీరిపోవచ్చును. కాని ఇది తాత్కాలిక చికిత్సమాత్రమే.

ప్రజాస్వామ్యానికి పేరుపొందిన దేశాలలో కూడా ఆదిలోనో తరువాతనో అబ్రహాంలింకన్, డిజ్రేలీవంటి నాయకుల కృషివల్లనే సత్సంప్రదాయాలు నెలకొల్పబడినాయి. అదేరీతి పండిట్ నెహ్రూనాయకత్వంలోనే మనదేశంలో కూడా సత్సంప్రదాయాలను నెలకొల్పవలసిన అగత్యం కలుగుతున్నది. భారత దేశానికి కాంగ్రెస్ నెరవేర్చవలసిన ముఖ్య కర్తవ్యాలలో ఇదొకటి అని నెహ్రూ అభిప్రాయం.

కాంగ్రెస్‌వాదులలో పూర్వత్యాగదీక్ష లోపించిందనీ, అధికారవాంఛ ప్రబలమైనదనీ, కాంగ్రెస్ సంస్థను నిర్దిష్ట రాజకీయాలనుంచి మేలుకొల్పి, కశం

కాల్చి హోమం చెయ్యవలసిన సమయం ఆసన్నమయిందనీ పండిట్ నెహ్రూ అన్నారు. ఇందుకోసమే కాంగ్రెస్ కార్యవర్గంనుంచి రాజీనామా నిచ్చినట్లు ప్రకటించారు.

అయితే ఈ సమస్య, పైన వివరించబడిన సమస్య, వేరు వేరని పండిట్ నెహ్రూ చెప్పారు. నెహ్రూ వివరణప్రకారం తన రాజీనామాకు కారణం కేవలం కాంగ్రెస్ సంస్థకు సంబంధించిన సమస్య. కాంగ్రెస్ ప్రభుత్వాలకూ, కాంగ్రెస్ కార్యవర్గానికీ వ్యవహారా లెలా ఉండాలో వారికి స్పష్టంగా తెలుసును. వారి అభిప్రాయం ప్రకారం కాంగ్రెస్ ప్రభుత్వాలు అనుసరించవలసిన విధానాలను నిర్ణయించవలసినది అఖిలభారత కాంగ్రెస్ కమిటీ. కాంగ్రెస్ కార్యవర్గ ఆదేశాలను కాంగ్రెస్ ప్రభుత్వం శిరసా వహించవలసిందే. అయితే పరిపాలనలో వివరాలకు సంబంధించి నంతవరకు కార్యవర్గం జోక్యం చేసుకోరాదు. ఇంక నెహ్రూ అభిప్రాయంలో కాంగ్రెసకి సంబంధించిన సమస్యవల్ల నే నేడు ప్రజలకు కాంగ్రెస్ దూరమయింది.

## నెహ్రూ-టాండన్ విభేదాలు

కాంగ్రెస్ వాదులలో అనేక వర్గాలు బయలుదేరినా, ఆ వర్గాలను సిద్ధాంతాల ప్రాతిపదికపైన గాని, నాయకులను బట్టి గాని స్పష్టంగా విభజించి చెప్పడం కష్టం. క్రమక్రమంగా ఆయా నాయకుల ననుసరించే వర్గాలు స్పష్టపడుతూ వచ్చినమాట నిజమే. స్థూలంగా తాత్కాలికావసరాల నిమిత్తం అప్పుడప్పుడు ఈ వర్గాల వైఖరులు స్పష్టపడుతూ వస్తున్నాయి.

౧౯౫౧ లో జరిగిన కాంగ్రెస్ ఎన్నికలలో కాంగ్రెస్ సంఘాలను చేజిక్కించుకోడానికి మంత్రివర్గ పక్షాలవారూ, మంత్రివర్గ పక్షాల వారికి కాంగ్రెస్ సంఘాలలో తావు లేకుండా చెయ్యడానికి ప్రత్యర్థులూ విశేషకృషి చేశారు. ఎవరివర్గాన్ని వారు బలపరుచుకోడానికి అనేకమంది కొత్త సభ్యులను లక్షలకొద్దీ చేర్చుకున్నారు. ఈ సమయంలో కాంగ్రెస్‌లో రెండువర్గాల విభజన స్పష్టంగా కనపడుతుంది. నియమాల నతిక్రమించారని, అక్రమాలకు దిగారని ఏ ఒక్క వర్గాన్ని నిందించడానికి వీలు లేని పరిస్థితి ఏర్పడింది. పోటీలో ఉభయవర్గాలవారు సమానంగా పాల్గొన్నారు. ఈ పోటీ ఫలితంగా దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ కాంగ్రెసుసంఘాలు ఏక వర్గాల పరమైనాయి. ప్రత్యర్థివర్గాలకు బలం నశించింది. ఇక పైన కాంగ్రెసు సంఘాలు ఏకాగ్రతతో కృషి చెయ్యడానికి దీనివల్ల అవకాశ మేర్పడినప్పటికీ, క్షీణించిన ఇతర వర్గాలవారికీ, సంఘాలను చేజిక్కించుకున్న వర్గాలవారికీ మధ్య వైరం మితిమీరింది. (అనేక రాష్ట్రాలలో మంత్రివర్గాలవారు కాంగ్రెసు సంఘాలను చేజిక్కించుకున్నారు కూడా)

ఉభయవర్గాలవారూ బహిరంగంగా పరస్పరం ఆరోపించుకున్న నిందలకు "కాంగ్రెస్ వాదుల అధికారవాంఛ" "స్వార్థపూరిత రాజకీయాలు" వంతపాట లైనాయి.

ముఖ్యంగా ౧౯౫౦ కాంగ్రెసు ఎన్నికల ఫలితంగా కాంగ్రెసుసంస్థలోని అనైక్యత, దౌర్బల్యమూ పరిస్ఫుటమైనాయి. ప్రజలలోనే కాక కాంగ్రెసు వాదులలో కూడా కాంగ్రెస్‌నాయకుల రాజకీయ జీవనంలో నియమ రహితప్రవర్తన ప్రబలిందనే అభిప్రాయం ఏర్పడింది. కాంగ్రెస్‌సంస్థలో అనైక్యతవల్లనూ కక్షలవల్లనూ, సంస్థ బలహీన పడింది. కాంగ్రెస్‌సంఘాలలో పూర్తిగా బలం పోగొట్టుకున్న వర్గాలవారిలో కొందరు ఇంక కాంగ్రెస్‌లో ఉన్నందువల్ల తమ రాజకీయజీవనం అంతం కాగలదనే శంకతోనూ, మరికొందరు కాంగ్రెస్ సంస్థలో ప్రవేశించిన అవినీతి మితిమీరి సంస్కరణకు అసాధ్యమయిందనే అభిప్రాయంతోనూ కాంగ్రెసుసంస్థనుంచి నిష్క్రమించ నారంభించారు. ఉత్తర ప్రదేశ్‌లో త్రిలోకసింగ్ వర్గమూ (పీపుల్స్ కాంగ్రెస్), పశ్చిమ బెంగాల్‌లో డా॥ ప్రఫుల్ల చంద్రఘోష్‌వర్గమూ, కాంగ్రెస్‌సంస్థనుంచి నిష్క్రమించాయి. నాసిక్ కాంగ్రెస్ సమావేశసమయంలో ఆచార్య కృపలానీగారు కాంగ్రెస్‌సంస్థలోనే కాంగ్రెస్ డెమొక్రటిక్ ఫ్రంట్ అనే ప్రత్యేక వర్గాన్ని స్థాపించారు. తరువాత ఫ్రంట్‌ను రద్దుపరిచి క్రమేణా కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీని స్థాపించారు. చెన్నరాష్ట్రంలో ప్రకాశం, రంగాగార్ల వర్గాలవారు నిష్క్రమించి కృపలానీగారి పార్టీలో చేరారు. ఆ తరువాత రంగాగారి వర్గం ఈ పార్టీనుంచికూడా విడివడి వేరేపార్టీ స్థాపించుకున్నారు. ఈరీతిగా అనైక్యతవల్ల నేమి, వైషమ్యాలవల్లనైతే నేమి అవినీతిపట్ల అసమ్మతిసూచకంగా నేమి కాంగ్రెస్‌లో చిరకాలం సేవచేసి ఖ్యాతి తెచ్చుకున్న నాయకులుకూడా నిష్క్రమించడంతో, కాంగ్రెస్ సంస్థ విచ్ఛిన్నమై పోయే ప్రమాదం పొడచూపింది.

స్థూలంగా ఏర్పడిన రెండు ప్రత్యర్థి వర్గాలనూ, ప్రస్తుతానికి నెహ్రూవర్గమనీ, టాండన్‌వర్గమనీ వ్యవహరించవచ్చును. కాంగ్రెస్ సంస్థలో అవినీతిప్రవేశించిందనీ, కాంగ్రెస్‌నాయకుల సేవాదీక్ష, త్యాగశీలమూ క్షీణించినాయని ఉభయవర్గాలవారూ అంగీకరిస్తూనే ఉన్నారు. అయితే ఈ పరి

స్థితికి హేతువులేవి, చికిత్సావిధాన మేమిటి అనే ప్రశ్నలకు ఉభయవర్గాలవారూ చెప్పే సమాధానాలలో వ్యత్యాసం, కొంత వైరుధ్యం కూడా కనిపిస్తాయి. కాంగ్రెస్‌లో అవినీతి ప్రవేశించడమూ సేవాదీక్ష లోపించడమూ నిజమేనని అంగీకరిస్తూ, శ్రీ యస్. కె. పాటిల్ గారు ౧౯౫౦ సెప్టెంబరులో ఒక ఉపన్యాసంలో ఈపరిస్థితికి కాంగ్రెస్ వాదులు నిందార్హులు కారని అన్నారు. అవినీతి స్వార్థపరత్వాలను గురించి ప్రచారం అత్యధికంగా జరుగుతున్నదనీ నేటి స్థితికి కాంగ్రెసువాదులను దూషించడంకంటె జాలిపడాలనీ అన్నారు. పాటిల్ గారు చెప్పేవది సరికాదని పండిట్ నెహ్రూ నాసిక్ సమావేశ విషయ నిర్ణయసభలో సవాలుచేశారు. "కాంగ్రెస్ వాదులే నిజాయితీ పరులైతే, అల్పసంఖ్యాక వర్గాలపట్ల కాంగ్రెస్‌వారు న్యాయంగా ప్రవర్తించిఉన్నట్లయితే, మతద్వేషాలను ప్రోత్సహించేవారినీ, వారి మనస్తత్వాన్నీ గర్హిస్తూ జయపూర్ కాంగ్రెస్ నిందాపూర్వకంగా ఎందుకు తీర్మానం చెయ్యవలసి వచ్చింది ?" అని పండిట్ నెహ్రూ ప్రత్యర్థివర్గాన్ని ప్రశ్నించారు. "కాంగ్రెస్‌వాదులు అవినీతిపరులూ, అసత్యవాదులూ కానట్లయితే, నియమవర్తన గురించీ సంఘసేవకులుగా వారి కర్తవ్యాన్ని గురించీ బోధిస్తూ జయపూర్ కాంగ్రెస్ ప్రత్యేక తీర్మానం ఎందుకు చెయ్యవలసి వచ్చింది ? నిజంగా కాంగ్రెస్‌వాదులలో ఈ దుర్వర్తన ప్రబలినందువల్లనే ఇటువంటి తీర్మానాలు చెయ్యవలసిన అగత్యం కలిగింది. అంతే కాదు. కాంగ్రెస్‌లో దుష్టశక్తులు నానాటికీ ప్రబలమౌతున్నాయి కూడా" అన్నారు పండిట్ నెహ్రూ. కాంగ్రెస్ సంస్థ కట్టిలోపం లేదని కాంగ్రెస్ వాదులు ఆత్మవంచన చేసుకుంటే అది ఆత్మహాని అని నెహ్రూ హెచ్చరించారు. కాంగ్రెస్‌వాదులు తమ వర్తనగురించి తామే తృప్తిపడితే ప్రయోజనం లేదు. ప్రజలు కాంగ్రెస్‌వారినిగురించి ఏ రీతిగా భావిస్తున్నారో గమనించి, తదనుకారం తమ వర్తనను దిద్దుకోవాలన్నారు. నెహ్రూ అభిప్రాయానికి భిన్నంగా సర్దార్ పటేల్ మరొక అభిప్రాయం ప్రకటించారు. నాసిక్ సమావేశానికి ప్రత్యేక సందేశం పంపుతూ, "నేడు కాంగ్రెస్‌సంస్థ విచ్ఛిన్నమైపోయే ప్రమాదం ఆసన్నమౌతున్నది. దీనికి మూలకారణం కొందరు కాంగ్రెస్‌వాదులలో ఏర్పడిన 'వర్గ వైషమ్యాలు'. అధికార వాంఛతోనూ, స్వార్థలాభాశయంతోనూ కొందరీ వర్గ వైషమ్యాలను సృష్టిస్తున్నారు" అని చెప్పారు. టాండన్‌గారు ఈ అభిప్రాయంతో ఏకీభవించారు. నాసిక్ సమావేశ సమయంలో కాంగ్రెస్ డెమోక్రటిక్ ఫ్రంట్‌ను స్థాపించిన కృపలానీగారు ప్రత్యేక వర్గాలను స్థాపించడం అవసర మన్నారు. కాంగ్రెస్ సంస్థనూ ప్రభుత్వాలనూ చేజిక్కించుకొన్నవారు కాంగ్రెస్ మూలసిద్ధాంతాలను వదిలారనీ, ఆ సిద్ధాంతాలను అమలుజరపగోరేవారు కాంగ్రెస్‌లో ప్రత్యేకవర్గాన్ని స్థాపించవచ్చునని కృపలానీ వాదించారు.

అయితే ఈ విభిన్న అభిప్రాయాలు పరిపాలనకు ఆటంకప్రాయం కాకూడదనే భావంతో పండిట్ నెహ్రూ ఎప్పటికప్పుడు తన పరిపాలనా విధానాలపట్ల కాంగ్రెస్ సమావేశాల ఆమోదం పొందుతూవచ్చారు. ఉభయవర్గాలవారూ నెహ్రూ, పటేల్ గార్ల నాయకత్వాన్ని తమ కార్యకలాపాలను నడుపుకుంటున్నంతవరకూ వైషమ్యాలు విషమించలేదు. పరిపాలనకు గాని కాంగ్రెస్ తీర్మానాల అనుష్ఠానానికి గాని ఆటంకం కలగలేదు. సర్దార్ పటేల్ ౧౯౫౦ డిసెంబర్ ౧౫ వ తేదీని స్వర్గస్థులవడంతో కాంగ్రెస్‌కి తీరనిలోటు సంభవించింది. రెండు వర్గాలూ నెహ్రూ పటేల్ గార్ల అదుపులో ఉన్నంతవరకూ సహకారం కొనసాగుతూ వచ్చింది. కాంగ్రెస్ డెమోక్రటిక్ ఫ్రంట్ అనే ప్రత్యేకవర్గం స్థాపించబడినందుకు కాంగ్రెస్ కార్యవర్గం ౧౯౫౦ డిసెంబరు ౨౫ వ తేదీని అసమ్మతి ప్రకటించినప్పటికీ ఆ వర్గానికి చెందినవారిపైన క్రమశిక్షణచర్య తీసుకోకుండా సహనభావం ప్రదర్శించింది. కాంగ్రెస్ కార్యవర్గ నిర్మాణంలోకూడా ఇదేరీతిగా తాత్కాలికసమ్మతి కుదిరింది. మొదట కార్యవర్గ సభ్యత్వానికి సమ్మతించని పండిట్ నెహ్రూ తరవాత సమ్మతించారు.

౧౯౫౦ డిసెంబరు ౧౫ వ తేదీని సర్దార్ పటేల్ మృతిచెందడంతో పరిస్థితి తారుమారయింది. ౧౯౫౦ జనవరి మాసాంతంలో అఖిలభారత కాంగ్రెస్ సంఘం అహమ్మదాబాద్ సమావేశం కాంగ్రెస్ వాదులమధ్య ఐక్యతా భావం సామరస్యభావాల అగత్యాన్ని సూచిస్తూ ఒక తీర్మానం చేసింది. కాంగ్రెస్‌వాదులు ప్రత్యేకవర్గాలలో కాని ఇతర పార్టీలలో కాని చేరకూడదని తీర్మానం చేసింది. ప్రత్యేకవర్గాలు రద్దు కావాలని ఆదేశ మిచ్చింది. ఈ సందర్భంలో పండిట్ నెహ్రూ కాంగ్రెస్‌లో ప్రవేశించిన అవినీతిని గర్హిస్తూ ఉపన్యాస మిచ్చారు. "అధిక సంఖ్యాకులైనవారు చేసిన నియమాలను అల్పసంఖ్యాకులైనవారు పాటించడం అవసరమే. అయితే, అల్ప సంఖ్యాకులైనవారిని వెళ్లగొట్టడానికి అధిక సంఖ్యాకులైనవారు తమ బలాన్ని వినియోగపరచడం న్యాయంకాదు, నీతీకాదు." అని పండిట్ నెహ్రూ అన్నారు. అంటే కృపలానీవర్గానికి చెందినవారికి కాంగ్రెస్ అధిష్ఠానవర్గంలో తగినంత బల మివ్వబడాలని నెహ్రూవాదం. కాంగ్రెస్

కార్యవర్గంలోనూ ఎన్నికల సంఘంలోనూ కృపలానీ వర్గానికి అర్హమైనన్ని స్థానాల నివ్వలేదని నెహ్రూ అభిప్రాయపడ్డారు. (అధ్యక్ష ఎన్నికలో టాండన్ గారికి ౧౩౦౬ వోట్లు, కృపలానీ గారికి ౧౦౯౨ వోట్లు వచ్చాయి. ఈ సమస్యను పరిష్కరించడానికి ౧౯౫౧ ఫిబ్రవరి మూడవ వారంలో టాండన్, కృపలానీ, డా. ఘోష్‌గార్ల మధ్య సమాలోచనలు జరిగినా విఫలమైనాయి. తిరిగి డెమొక్రటిక్ ఫ్రంట్ స్థాపనను నిరసిస్తూ కాంగ్రెస్ కార్యవర్గం ౧౯౫౧ ఫిబ్రవరి ౨౫ వ తేదీని తీర్మానించింది, ౧౯౫౧ మే ౩ వ తేదీని కాంగ్రెస్ డెమొక్రటిక్ ఫ్రంట్ సమావేశానికి నెహ్రూ, ఆజాద్ గార్లు, వచ్చి ఫ్రంట్‌ను రద్దుపరచవలసిందని విజ్ఞప్తి చేశారు. ఆ సమావేశంలో ఫ్రంట్ రద్దయింది. అయితే కృపలానీగారు ఈ ప్రత్యేకవర్గాన్ని రద్దుపరిచి నందువల్ల ప్రత్యర్థి వర్గాలు కాంగ్రెస్‌ను విడిచి పోవలసివస్తున్నదని ప్రకటించారు. మే ౧౮ వ తేదీని కాంగ్రెస్ సభ్యత్వానికి కృపలానీ రాజీనామా నిచ్చారు. కాంగ్రెస్ ఎన్నికలలో జరిగిన అక్రమాలను విచారింప చెయ్యడానికి టాండన్ గారు నిరాకరించినందువల్లనూ, పాక్షిక బుద్ధితో ప్రవర్తించేవారిని కాంగ్రెస్ కార్యదర్శులనుగా ఉంచారన్న ఆరోపణను టాండన్ గారు ఆమోదించనందువల్లనూ, కాంగ్రెస్‌నుంచి నిష్క్రమిస్తున్నట్లు కృపలానీ చెప్పారు. అహమ్మదాబాదులో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ చేసిన ఐకమత్య తీర్మానాన్ని టాండన్ వర్గంవారు అమలు జరపకపోగా, ప్రత్యర్థులను కాంగ్రెస్‌నుంచి వెళ్లగొట్టడానికి యత్నిస్తున్నారని కృపలానీ ఆరోపించారు. జూన్ మూడవ వారంలో పాట్నాలో స్థాపించబడిన కృపలానీగారి ప్రజాపార్టీ కార్యవర్గంలో కిద్వాయ్‌గారు సభ్యులుగా ఆహ్వానించబడ్డారు. బెంగుళూరు అఖిల భారత కాంగ్రెస్‌కమిటీ సమావేశం (జూలై ౧౩, ౧౪, ౧౫) తిరిగి కాంగ్రెస్‌వాదులలో ఐక్యతా భావం అవసరమని హెచ్చరిస్తూ, కాంగ్రెస్ నుంచి నిష్క్రమించిన వారిని కాంగ్రెస్‌లో చేరవలసిందని విజ్ఞప్తి చేస్తూ ఒక తీర్మానం చేసింది. పండిట్ నెహ్రూ కాంగ్రెస్ కార్యవర్గాన్ని పునర్నిర్మించాలని పట్టుబట్టారు. ఈ సందర్భంలో నాయకుల మధ్య జరిగిన రాయబారాలు విఫలమైనాయి. నెహ్రూ కాంగ్రెస్ కార్యవర్గ సభ్యత్వానికి రాజీనామా నిస్తారని బెదిరించారు. అయితే చివరికి నెహ్రూ పట్టుదల మానుకున్నారు.

బెంగుళూరు తీర్మానంతో తృప్తి చెందక కేంద్ర ప్రభుత్వంలో తంతితపాలాశాఖామంత్రిగా నున్న రఫీ అహ్మద్ కిద్వాయ్, శరణార్థులశాఖ స్టేట్ మంత్రి అజిత్ ప్రసాద్ జైన్‌గార్లు జూలై ౧౮ వ తేదీన తమ మంత్రిత్వాలకూ, కాంగ్రెస్ సభ్యత్వాలకూ రాజీనామా లిచ్చారు. దేశంలో క్లిష్టపరిస్థితి ఏర్పడినందువల్ల కాంగ్రెస్‌వాదులలో సహనభావమూ, ఐకమత్యమూ అవసరమని ఉద్బోధిస్తూ, వారిద్దరినీ రాజీనామాలను ఉపసంహరించుకోవలసిందని పండిట్ నెహ్రూ విజ్ఞప్తి చేశారు. నెహ్రూ విజ్ఞప్తిని పాటించి కిద్వాయ్, జైన్ గార్లు మంత్రిత్వ పదవులకు రాజీనామాలను ఉపసంహరించుకున్నారు కాని కాంగ్రెస్‌లో మాత్రం చేరలేదు. జైన్‌గారు ఏ పార్టీలోనూ చేరలేదు. కిద్వాయ్‌గారు ప్రజా పార్టీలో చేరారు. మరొక పార్టీలో చేరి కాంగ్రెసుకు ప్రతికూలంగా ప్రచారంచేసే నాయకులకు కాంగ్రెస్ ప్రభుత్వంలో తావుండడం ఆక్షేపణీయమని టాండన్ గారన్నారు. దీనికి ఫలితంగా కిద్వాయ్‌గారు ఆగస్టు ౨౫ తేదీని మంత్రిత్వానికి రాజీనామానిచ్చారు. ఆగస్టు ౮ వ తేదీని ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ కార్యవర్గం సమావేశమై, కాంగ్రెస్‌సంస్థను విడిచిపెట్టిన వారందరూ శాసనసభ సభ్యత్వాలకు రాజీనామా నివ్వాలని హెచ్చరిస్తూ తీర్మానం చేసింది. ఈ సమావేశంలో కాంగ్రెస్‌అధ్యక్షులు టాండన్ గారూ, కార్యదర్శి మోహన్లాల్ గౌతమ్‌గారూ కూడా పాల్గొన్నారు. ఈ విషయాన్ని చర్చించాలని కేంద్ర కాంగ్రెస్ కార్యవర్గం చర్యనీయాంశాలలో చేర్చి, కార్యవర్గ సభ్యులందరికీ కాంగ్రెస్ కార్యదర్శి తెలియపరిచారు.

పండిట్ నెహ్రూ కార్యవర్గసభ్యత్వానికి రాజీనామా పంపడానికి (ఆగస్టు ౧౦, ఢిల్లీ) ఇదే తక్షణ కారణమని కొందరి అభిప్రాయం. పండిట్ నెహ్రూ రాజీనామా లేఖను అధ్యక్షునకు పంపారు. దానితో కాంగ్రెస్ కార్యవర్గం (ఆగస్టు ౧౩ వ తేదీ) ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ కార్యవర్గతీర్మానాన్ని చర్చించడం మానివేసి, నెహ్రూ టాండన్ లిద్దరూ సామరస్యం సాధించడానికి కృషిచేయాలని తీర్మానించింది. కాని ఉభయుల మధ్యనూ జరిగిన సమాలోచనలు విఫలమైనాయి. డా॥ బి. సి. రాయ్, పండిట్ గోవింద వల్లభ పంత్, ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ జుగల్ కిశోర్ మొదలైనవారు నెహ్రూ టాండన్‌లమధ్య సామరస్యం సాధించడానికి కృషిచేసి విఫలులైనారు.

పండిట్ నెహ్రూ తన రాజీనామాకు గల హేతువుల్ని పార్లమెంటరీ కాంగ్రెస్ పార్టీ సమావేశంలో (ఆగస్టు ౨౧) వివరించారు. నాసిక్, అహమ్మదాబాద్, బెంగుళూరు తీర్మానాలను కాంగ్రెస్ వాదులు అమలు జరపడం లేదని నెహ్రూ ఆరోపించారు. తీర్మానాలొక రీతిగా ఉంటే కాంగ్రెస్ వాదులు తద్భిన్నంగా ప్రవర్తిస్తున్నారన్నారు.

కాంగ్రెస్‌లో ఐక్యత సాధించడానికి తానెంతో కృషి చేసి విఫలమై పోతున్నట్లు తనకు అనుభవ మౌతున్న దన్నారు. "ఇవన్నీ నెహ్రూ చాదస్తాలు. ఆయనకి హితవైన తీర్మానాలు చేసినందువల్ల పెద్ద ముప్పేమీ లేదు" అని కాంగ్రెస్ వాదులు భావించి, తీర్మానాలు చేసి, ఆపైన తన వెనుక వారు నవ్వుకొంటున్నారని నెహ్రూ అన్నారు. కాంగ్రెస్ సంస్థ నానాటికీ ప్రజలకు దూరమైపోతున్న దంటే దీనికి కారణం కాంగ్రెస్ వాదుల పార్టీ వైఖరేననీ, కాంగ్రెస్‌లో ప్రవేశించిన నియమ రహిత వర్తనమనీ నెహ్రూ అభిప్రాయపడ్డారు. కాంగ్రెస్ సంస్థను కాపాడాలంటే ఈ వైఖరిని కాంగ్రెసు వాదులు మానుకోవాలనీ, ఐక్యతను సాధించడానికి అన్ని వర్గాలవారూ చిత్తశుద్ధితో కృషి చేయాలనీ నెహ్రూ కోరిక. అది సాధ్యమవాలంటే అట్టి మార్పుకు అనుగుణంగా కాంగ్రెస్ కార్యవర్గాన్ని పునర్నిర్మించడం తప్పదని నెహ్రూ చెప్పారు. తనపై భారతీయులు పెట్టుకున్న ఆశలను భంగపరచకుండా ఉండాలంటే కాంగ్రెసును సంస్కరించవలసిన బాధ్యత తనపై పడుతున్నదనీ, ఈ మార్పుయొక్క అవసరాన్ని గుర్తింపచేసి కాంగ్రెస్‌ను మేలుకొల్పడానికే తను కార్యవర్గసభ్యత్వానికి రాజీనామా నిచ్చినట్లు నెహ్రూ చెప్పారు. కాంగ్రెసును నిద్రావస్థనుంచి విచలింపచేయుటం తన ఉద్దేశమైనట్లు నెహ్రూ తెలిపారు. పార్లమెంటరీ కాంగ్రెస్ పార్టీ నెహ్రూ నాయకత్వంపట్ల పరిపూర్ణ విశ్వాసం ప్రకటిస్తూ తీర్మానం చేసింది.

కాని కార్యవర్గాన్ని పునర్నిర్మించడానికి అధ్యక్షుడు టాండన్ గారు సమ్మతించలేదు. పది మాసాలుగా సక్రమంగా కార్యకలాపాలను నిర్వహిస్తున్న కాంగ్రెస్ కార్యవర్గాన్ని నిర్మించడం అవసరమని చెప్పి, పరిస్థితి అత్యంత క్లిష్టంగా ఉన్నదన్న మాట. కాని ఈ కాంగ్రెస్ కార్యవర్గంవల్ల అట్టి క్లిష్టస్థితి ఏర్పడిందంటే టాండన్ గారికి అంగీకారం కాలేదు. కార్యవర్గాన్ని నియమించే అధికారం అధ్యక్షుని దైవప్వకు ఇతరులు (నెహ్రూ) ఈ విషయమై జోక్యం చేసుకుంటే అధ్యక్షుడుగా తా నంగీకరింపజాలరని టాండన్ అన్నారు. పార్లమెంటరీ పార్టీ తీర్మానంపైన వ్యాఖ్యానిస్తూ, ప్రధాన మంత్రి కూడా కాంగ్రెసు సంస్థ ఆదేశాలకు విధేయుడు కావలసిందేనని టాండన్ అన్నారు. ఈ వాదానికి పండిట్ నెహ్రూ పత్రికా సమావేశంలో (ఆగస్టు ౨౮) సమాధాన మిచ్చారు. పార్టీ ఆదేశాలను ప్రభుత్వాలు శిరసావహించవలసిందే. పరిపాలనా క్రమం పార్టీ ఆదేశించిన ప్రకారం నిర్వహించవలసిందే, కాని పరిపాలనా వ్యాసంగంలోని వివరాలలో పార్టీ జోక్యం చేసుకోరాదు. పరిపాలనావిధానం పార్టీకి తృప్తి కలిగించకపోతే ప్రభుత్వాన్ని తొలగించే హక్కు పార్టీకి ఉంటుంది. కాని పరిపాలనా విషయాల నెలా నిర్వర్తించాలో చెప్పే బాధ్యతగాని హక్కుగాని పార్టీ కార్యవర్గానికి లేదు.

కార్యవర్గాన్ని పునర్నిర్మించడానికి టాండన్ గారు నిరాకరించడంతో పరిస్థితి క్లిష్టతరమయింది. కార్యవర్గ పునర్నిర్మాణానికి అవకాశం కల్పించే ఉద్దేశంతో కార్యవర్గ సభ్యులందరూ సెప్టెంబరు ౯వ తేదీని రాజీనామా నిచ్చారు. అయినా పునర్నిర్మాణానికి సమ్మతించక టాండన్ గారు సెప్టెంబరు ౮వ తేదీ అఖిలభారత కాంగ్రెస్ కమిటీ (ఢిల్లీ) సమావేశంలో తన అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చారు. వెంటనే కాంగ్రెస్‌కమిటీ పండిట్ నెహ్రూను అధ్యక్షునిగా ఎన్నుకుంది.

కాంగ్రెస్ సంస్థలో మార్పు తేవలసిన అవసరాన్ని టాండన్ గారు కూడా గుర్తించారు. కాని ఆ మార్పు తేవడానికి నెహ్రూ అవలంబించిన పద్ధతి వల్ల కాంగ్రెస్ మరింత బలహీనపడిందని టాండన్ గారన్నారు. కాని పండిట్ నెహ్రూ ఈ నూతనావకాశంవల్ల కాంగ్రెస్ బలపడిం దన్నారు.

కాంగ్రెస్ సంస్థను సంస్కరించవలసిన అవసరాన్ని గాని, సంస్కరణ విధానాన్ని గాని, ప్రస్తుతం తేబడిన మార్పువల్ల కలుగబోయే ఫలితాలనుగాని నిర్దిష్టంగా అర్థం చేసుకోవాలంటే రెండు ముఖ్య అంశాలను ముందుగా గమనించవలసిన అవసరముంది.
1. దేశంలో ప్రజల అసంతృప్తికీ కాంగ్రెస్ వాదుల అసంతృప్తికీ మూలహేతువు లేవి? దీనికి బాధ్యులెవరు? 2. ఎందులో మార్పు రావాలి? ఎక్కడ?

'పీపుల్' అనే పత్రిక ఇలా వ్రాసింది: "కాంగ్రెస్ సంస్థకు పట్టిన రోగ. మేమిటి? జాతి అభిమానాన్ని తిరిగి పొందాలంటే మనం (కాంగ్రెస్) ఏం చెయ్యాలి?.........ఆహార సమస్యనే తీసుకుందాం. కాంగ్రెస్ వాదుల నాయకత్వం కింద, కాంగ్రెస్ వారి అదుపులో నిర్వహించబడు తున్న కేంద్రప్రభుత్వం రేషన్లను తగ్గిస్తూ ఆహార పదార్థాల ధరలనుకూడా హెచ్చించవలసి వచ్చింది. ఇట్టి నిర్ణయానికి వచ్చేముందు వందలకొద్దీ నెలకొన్న పార్టీ కేంద్రాలనుంచి విరివిగా ప్రచారం జరిపి, హితవు లేకపోయినా అనివార్యమైనట్టి ఈ చర్యకు ముందు ప్రజల్ని సంసిద్ధపరచవలసి ఉంది. కాని ముఖ్య కాంగ్రెసు నాయకులు గాని, కాంగ్రెస్ కమిటీలు గాని ఒక్కరూ ప్రచారం చెయ్యలేకపోయినారు. బహిరంగసభలు జరుగలేదు. కరపత్రాలను

పంచలేదు. ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో ప్రజలు కష్టాలను భరించవలసిన అవసరాన్ని గుర్తింపచేయలేదు. ఇంక ప్రతిపక్షివర్గాలుమాత్రం కాంగ్రెస్‌వారిపట్ల ఉదారబుద్ధితో ఉండగలరని ఎవరూ భావించలేరు కదా!

"అసలు సమస్య స్వరూపాన్ని పరిశీలిద్దాం. వచ్చిన మార్పు ఏమిటి? పూర్వ జాతీయోద్యమ కేంద్రమైన సంస్థతో పోల్చిచూస్తే, ఈనాడు కాంగ్రెస్ విభిన్న రాజకీయపక్షాలలో ఒకటి మాత్రంగా మిగిలింది. ఆనాడు పత్రికాప్రపంచమంతా కాంగ్రెస్‌కి అండగా నిలబడింది ఈనాడా అండ పోయింది. పత్రికలతో కాంగ్రెస్ సమరసభావం ఏర్పరుచుకోవలసిన అగత్యం ఉంది.

"వ్యాపార పారిశ్రామిక రంగాలలోనివారందరూ ఆనాడు కాంగ్రెస్‌కు అండగా నిలిచారు. కాని ఈనాడు వారు తమ భవిష్యత్తునుగురించిన శంకతో జవకాడుచున్నారు.(నిజానికి వారు సహాయనిరాకరణ సాగిస్తున్నారనాలి—సచ) విద్యార్థులను ఈనాడు నిర్లక్ష్యంతో చూస్తున్నాం. వారిని సంఘటితపరచడంలేదు.........మన రైతులు అనుభవమౌతున్న బ్రహ్మాండమైన మనఃపరివర్తనను మనం (కాంగ్రెస్) గ్రహించడంలేదు. రైతులలో విద్య పొందిన కొద్దిమందీ ఈనాడు నాయకత్వం కోసం తహతహ లాడుతున్నారు. వారిని కాంగ్రెస్ వినియోగపరుచుకోలేనిపక్షంలో, ఆత్రుతతో నిరీక్షిస్తున్న ఇతర పార్టీలు వారి నాకర్షించగలవు.

"ప్రభుత్వోద్యోగుల బృందానికి నైతికబలాన్ని మనం క్షీణింపచేస్తున్నాం...."

దీనినిబట్టి చూస్తే కాంగ్రెస్‌కీ ప్రజలకూ మధ్య సన్నిహితభావం నశించడానికి ప్రభుత్వాలూ, కాంగ్రెస్ సంఘాలూ సమాన బాధ్యత వహించక తప్పదని తెలుస్తుంది. పరిపాలనపట్ల ప్రజలు అసంతృప్తి చెందినమాట నిజమే.

అయితే దీనికి పరిపాలనలో లోపాలూ, పరిపాలకుల అసమర్థతా హేతువులని కొందరు, కాంగ్రెస్ సంస్థకు సంబంధించిన సమస్య అని ఇతరులూ వాదిస్తున్నారు. దేశంలో ప్రభుత్వం పరిష్కరించవలసిన సమస్యలు అతిక్లిష్టమైనవీ, ప్రమాదభరితమైనవీ అయినందువల్ల పరిపాలనలో దోషాలుండడం సహజమేననీ, ఈ సమస్యల పరిష్కారానికి నాలుగేళ్లు చాలవనీ ప్రభుత్వవర్గాలవారి అభిప్రాయం. కాబట్టి కాంగ్రెస్‌సంస్థను బలపరిచి సంస్థలోని దోషాలను నివారించినట్లయితే పరిపాలనా సమస్యలను త్వరలో మరింత సులువుగా పరిష్కరించవచ్చునని వీరి వాదం.

పండిట్ నెహ్రూ అధ్యక్షతను స్వీకరించగానే ఎన్నికల కార్యక్రమంలో పార్టీ వ్యవహారాలకు సంబంధించిన కార్యకలాపాలను నిర్వహిస్తున్న పద్ధతిని గమనిస్తే వారు పై వాదాన్ని అంగీకరిస్తున్నట్లు బోధపడుతుంది. కొత్త కార్యవర్గాన్ని నియమించి ఎన్నికల సంఘాలకు ఎప్పటికప్పుడు తాఖీదు లిస్తున్నారు. ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థుల నెంచడంలో, వ్యక్తిశీలాన్నీ, సమర్థతనూ గమనించాలని నెహ్రూ నొక్కి చెప్తున్నారు.

రెండో వర్గంవారు కాంగ్రెస్‌ను సంస్కరించవలసిన విధానం ఇది కాదనీ, పాక్షిక మనస్తత్వాలు గలవారికి కాంగ్రెసులో తావులేకుండా చేస్తే, ప్రభుత్వాలను కాంగ్రెసు కార్యవర్గం అదుపులో ఉంచితే, కాంగ్రెస్‌కీ ప్రభుత్వాలకూ మధ్య సహకారం సాధ్యపడుతుందనీ, అప్పుడు ప్రభుత్వాలు సమర్థతతో పరిపాలనా సమస్యలను పరిష్కరించగలుగుతాయనీ వాదిస్తున్నారు. ఉభయుల వాదాలలో ఏది సత్యమో భవిష్యత్తే నిర్ణయించాలి. నేడు పండిట్ నెహ్రూ అధ్యక్షత స్వీకరించడంతో ఎన్నికలు పూర్తయేవరకూ ప్రభుత్వాలకూ కాంగ్రెస్ కమిటీలకూ మధ్య సంఘర్షణ అంతరించిపోయినట్లే. నెహ్రూ తెచ్చిన పరివర్తనవల్ల కాంగ్రెస్ ఎంతవరకూ సంస్కరించబడిందో, కాంగ్రెస్ వాదులలో హృదయపరివర్తన ఎంతవరకూ వచ్చిందో ఇప్పుడప్పుడే తెలియడం కష్టం. ఎన్నికల నిమిత్తం అభ్యర్థుల నెంచిన తరువాత వారినిబట్టి కొంతవరకూ బోధపడవచ్చును. పండిట్ నెహ్రూ వాదం ఎంతవరకూ సమర్థనీయమో మున్ముందు ఎన్నికల అనంతరం అయితేగాని పరిపాలనావిధానం నిర్ణయించగలదు.



# అంకితం



శ్రీ రావూరి వెంకటసత్యనారాయణ

సందె కాబోతున్నది. ఆకాశం కారుమేఘాలతో నిండివుంది. మేడమీద కిటికీలో కూర్చుని వున్నది రేణుక. చాలా అందగత్తె. ఐశ్వర్యవంతుని బిడ్డ. ఆ కుబేరవంశంలో బంగారు నాణాల చప్పుళ్ళకు శ్రుతి కలుపుకొంటూ చిందులు త్రొక్కే పడుచు.

కాని ముఖంలో సంతోషమేమీ కనిపించటం లేదు. ఆ సందె వేళ కిటికీలో అలాగే కూర్చుని ప్రకృతి నవలోకిస్తోంది. సందె గడిచిపోయింది. వెన్నెల షికారు బయలుదేరవలసిన చంద్రుడు, మబ్బులకు భయపడి కాబోలు రాలేదు. అందువల్ల దివ్యజ్యోత్స్నలో తాన మాడవలసిన ప్రకృతి మబ్బుల ముసుగు కప్పుకొంది. రేణుక హృదయాకాశంలో కూడ అలాటి మబ్బులే క్రమ్ముకొన్నాయి కాబోలు, సౌందర్యమంతా విషాదచ్ఛాయలతో నిండిపోయింది. కురులు ముడి వేయకుండా వదిలింది. పిల్లగాలుల కవి మెల్లగా ఊగుతున్నాయి. చూపులు పురిపిడి దారాలుగా తెగిపోతున్నాయి.

రేణుక చేతిలో కొన్ని గేయాలు గల వ్రాతప్రతి ఒకటి వున్నది. ఆమె దానివంక చూడటం లేదు. ఆకాశంవంకనే చూస్తున్నది. కళ్ల వెంట అశ్రువులు రాలుతున్నాయి. బయట చీకటికి తోడు చిన్న చిన్న తుంపరలు ప్రారంభమైనాయి. దూరంగా తోటపైన అంతవరకూ కనిపించిన ఇంద్రధనస్సు చీకటిలో అదృశ్యమైంది. "అతడు ప్రేమించాడు; గౌరవించాడు; మన్నించాడు; ఆనందించాడు, ప్రార్థించాడు, విలపించాడు, మరణించాడు" అన్న భావాలామె మనస్సులోకి వచ్చినాయి. ఆ వివిధభావాలు ఇంద్రధనస్సులాగ వొళ్ళు విరుచుకున్నా యామెలో. కన్నీరు చేతిలోవున్న గ్రంథంమీద పడుతున్నది.

అప్పుడొకసారి గ్రంథంవంక చూచింది. అట్టమీద అంకితం అని వ్రాసివుంది. అవి అతని అక్షరాలే! ఎంత భక్తితో వ్రాశాడో! ఈ గ్రంథంలో ఎన్ని నిట్టూర్పులు, ఎంత వైరాగ్యంమూట గట్టాడో! ప్రేమించి జయించలేని ఆ హృదయం బాధనంతా ఒక్కసారిగా వెల్లి గ్రక్కి, ఆ వేడి పొగలు పీలుస్తూ 'ప్రేయసీ! ఈ కావ్యం చదువుతూ కృశించి నశించు' అని శపించి మరణించాడు కాబోలు: కాదు, కాదు, అతడు శపించడు; అలాటి కాఠిన్యత అతని మనస్సులో లేదు. తుదిఘడియ వరకూ పూజిస్తూనే వున్నాడు. తనను తానే శపించుకొన్నాడు. తనే ప్రేయసికొరకు కృశించి నశించాడు.

కవి హృదయం ఒకరిని శపిస్తుందా? పరుల కోసం ఆహుతి అవుతుందిగాని. ఆ కవి ప్రేయసి కోసం అలా ఆహుతి అయ్యాడు. కాదు ఆమె అతణ్ణి ఆహుతి చేసుకొన్నది. కవిని చంపిన పాపం!—మహాపాపం—'అబ్బా' అని రేణుక తలపట్టుకొంది. ఆమె మనస్సూ బయట ఆకాశం ఫెళ ఫెళా వురిమినాయి ఒక్కసారి. తలను అదిమి పట్టుకొని రోదిస్తున్నది. కన్నీటిజల్లు కురుస్తున్నది.

అంకితం అనేమాట మాత్రం ఆ చీకటి మనస్సులో మెరుపులాగా దూసుకు పోతున్నది. ఎరిగి నంతవరకూ కవి జీవితాన్ని మనస్సు నెమరు వేస్తున్నది. ఆ బాధ సహించలేక, ఒకసారి కళ్లు తెరిచింది. చూపులా గ్రంథంమీద పడ్డాయి. కానివాటికి కన్నీటిహార లడ్డుపడ్డాయి. వాటిని తుడిచి వేసుకో లేకుండా వున్నది. ఆమె బ్రతుకే ఒక అశ్రుకణంగా మారి పోయింది. ఆ నీటి పొరలలోనుంచి గ్రంథంకూడ తెల్లటి మంచు రేకుగా కనిపిస్తోంది. ఆమె దానివంకనే చూస్తున్నది. మనస్సు మాత్రం మళ్లీ వెనుకటి కథను మొదటినుంచి జ్ఞాపకం చేస్తున్నది.

తెల్లగా కనిపించే ఆ అట్టమీద ఒక పూరిగుడిసె బొమ్మ కనిపించిందామె కనులకు. అది వెన్నెల రాత్రి. ఒక కారువచ్చి ఆగుడిసె ముందు ఆగింది. ఒక పడుచు, స్నేహితురాల్ని వెంటబెట్టుకుని లోపలికి వెళ్లింది. రేణుక ఆదృశ్యాన్ని చూడలేక వెంటనే అట్టను త్రిప్పి వేసింది. అట్టవెనుక భాగంలో, గుడిసె లోపలిభాగం కనిపించింది. ఒక కుక్కిమంచంలో కూర్చుని వున్నాడు కవి. చింపిరి దుస్తులు, జీబుజుట్టు, పాపిరి కళ్ళు, కొడిగట్టిన దీపం, వడివడిగా నడిచే కలం. ఇదీ ఆయన వర్ణన. పడుచులు రావటంచూచి ఆశ్చర్య

పడుకుతూ లేచాడు. 'రండి, రండి' అని వారిని కూర్చోమనడానికి ఏమి వున్నదా అని దిక్కులు చూశాడు. ఏమీ కనిపించలేదు. చిన్న దేవదారు పెట్టెవున్నది మూల. చాలా సిగ్గుపడుతూ దాన్ని తెచ్చి వేశాడు. 'ఒకరు దీనిమీద కూర్చోండి' అన్నాడు. రెండో సీటుకోసం వెతుకుతున్నాడు. ఆ ఇద్దరిలో అందగత్తె అన్నది "ఫరవాలేదు. ఇద్దరం దీనిమీద కూర్చుంటాం లెండి" అని. అతను లోలోపల 'అమ్మయ్య' అనుకొన్నాడు. ఆపడుచు అన్నది— "మీకు ధన్యవాదా లర్పించడానికి వచ్చాం. మీరు 'అవంతి' పత్రికలో 'జ్యోత్స్న' అనే శీర్షికతో వ్రాసిన గేయం చదివాం మహాకవులు మీరు, మీ దర్శనం చెయ్యాలని వచ్చాం."

"మీరు సరస్వతీ మూర్తులలాగా వున్నారు. లేకపోతే ఈ బీద కుటీరాన్ని వెతుక్కుంటూ ఎందుకు వస్తారు? నా జీవితానికి కోజా పండుక. కాని ఈకవి బీదతనానికి క్షమించాలి మీరు. మీకుతగిన స్వాగతం, ఆతిథ్యం ఇవ్వలేను" అన్నాడాకవి.

ఆ పడుచు చిరునవ్వు నవ్వుతూ, కొనగోటితో, అక్కడ కొడిగట్టివున్న దీపాన్ని దులుపుతూ అన్నది" అలా అనకండి, మీరు మహాకవులు. మీ కవితామృత వాహిని ద్వారా ఎలాటి స్వాగతాలిస్తున్నారు ప్రాణులకు? అమర కవిత్వాన్ని మించిన ఆతిథ్యంవున్నదా?

అతడు కొంచెం సంతృప్తి చెందాడు. ఆమె వంక చూడకుండా చూపులు వాల్చుకొని ఇలా అన్నాడు. "మీకు కవిత పైనగల అభిమానం అలాటిది. కాని నా కవిత వేరు, నేను వేరు అయినాం. కవితను జీవితంలో ప్రతిబింబింప చెయ్యలేక పోయాను. అయినా ఒక ధైర్యం మాత్రం వున్నది. పంకిలంలో నుంచిగాని పంకజం వికసించదు చీకటి అంచుల్లోగాని విద్యుత్తు మెఱియదు. అందువల్ల ఈ దారిద్ర్యం నా కవసర మేనని పిస్తున్నది" అన్నాడు.

"మీరు చెప్పింది నిజమే. కాని కవి దైవం, మహానుభావుడు ద్రష్ట. అలాటి వారికి అవసరమైన సౌఖ్యాల నందించలేక పోవడం ప్రజల లోపం, మీరు ఓర్పు వహించవచ్చు; మిమ్మ చూచి ప్రజలు వోర్చడంలో అర్థంలేదు" అన్నదామె. "సుఖాలు ఈ జీవితంలో అడుగు పెడితే ఈ తపస్సు, ఈ ఆరాధన ఏమైపోతాయో నన్న భయంకూడా వుంది నాకు. అందువల్లనే దేనికీ అఱ్ఱులు చాచడంలేదు. ఈ కుటీరంలోనే ఇలా కుదించుకొని కూర్చున్నాను"

ఆమె అన్నది "ఇలాటి కుటీరాలే జాతికి వెన్నెల దేరాలు. ప్రజలకు తీర్థయాత్రలు. వీటిని మించిన వేమున్నాయి?

అతను పకపక నవ్వి "సరస్వతి వాకంటిలో వెన్నెలవత్తులువేసి, నాఇంట జేగంటలు మ్రోగిస్తున్న దివ్యాంగి. మీకు సానవ్య వాదాలు. మీ రెవరో తెలియ చెయ్యండి, జీవించివుండగా మిమ్మల్ని మరవను. మీ పేరేమిటి!—

"పేరు దేనికిలెండి. మీ శిష్యురాల్ని. ఈమె నా స్నేహితురాలు. నేను ... గారి కుమార్తెను. మాకు కవిత్వమంటె ఎంతో అభిమానం. మా జీవితాలకు కవిత్వం కానుకగా అందకపోయినా కవులనుదర్శించి పూజించాలనే ఆశతో జీవిస్తున్నాం. మీ వంటి వారి అనుగ్రహం...

"నీ పేరు చెప్పలేదు. కాని నిన్ను నేను 'కవిత' అని పిలుస్తున్నాను. కవి ప్రజలకూ, దైవానికి భృత్యులు. ప్రజాభీష్టం కోసం, ప్రజాభ్యుదయం కోసం జీవితాన్ని తపస్సుగా మార్చుకొని శాంతి సందేశాలను కవిత్వ వలయాలుగా లోకానికి కానుక అందించడానికే జన్మించిన జీవి కవి. నా అనుగ్రహమంటున్నారా మీరు?—

'మీ ఆశయానికి ధన్యవాదలు. అమృతవాక్కులు వినిపించారు. వాటితో మమ్మల్ని ఐశ్వర్యవంతులుగా మార్చారు. అప్పుడప్పుడు మీదర్శనం చేసే అవకాశం ఇవ్వండి తరిస్తాం...

'ఈ కవి హృదయం, ఈ కుటీరపు తలుపు ఎప్పుడూ వోలవాకిలిగానే వుంటాయి. కవితలో ఆహ్వానం, స్వాగతం వున్నాయని నీవే అన్నావుగా కవితా!

'మీకవిత నమస్కరిస్తున్నది. ఈ జీవితానికి నాంది వాక్యాలు పలికారు, నామకరణం చేశారు. అమూల్యమైన మీ కాలాన్ని వ్యర్థపరిచాం స్వార్థంతో కాని..."

"చెప్పవమ్మా భయందేనికి?—

"మీనోట ఒక్క గేయం వినందే, వెళ్ళడానికి మనస్సు వొప్పడంలేదు. నాలుగు పంక్తులు...

'ఇదేనా? కవిత ఇతరులకోసం కాకపోతే దాచుకోవడానికి టమ్మా!—వినిపిస్తాను.

"ఈవీణతీగలను
ఏరాణి మీటెనో
ఆత్మలన్నిటిలోన
అమృతవాహిను లుబికి
అలలుగా ప్రవహించె
అలరులై వికసించె ॥ఈ॥

కవిత విసిరివేసిన పూలమాలలాగా వచ్చి కవీంద్రుల పాదాలపైన వ్రాలింది.

'స్వామీ ధన్యురాల్ని' అని ప్రార్థించింది. అతడు పాట ఆపివేశాడు. 'ఇదేమిటి నా పాదాలపైన వ్రాలావు? వాణి పాదాల సమ్ముఖమున మ్రోయించ వలసింది. వీణతీగలను వదిలి కొయ్యను గౌరవిస్తున్నావు' అన్నాడు.

'ఆ తీగలను తనలో మేళవించుకొని విశ్వమోహన గీతికలు వినిపించే కొయ్య మాత్రం వేరవుతుందా? ఈనాడు కవిరాజా పాదాలు అంటకలిగాను దీవించండి"

"వాణి దీవన లిదివరకే పొందావు. కవితవైనావు. ఇంకేమి దీవించనమ్మా"

"వెళ్లివస్తాను. ధన్యురాల్ని. తిరిగి దర్శనం చేస్తాను. మీ కాలాన్ని హరించి నందుకు క్షమించండి."

"కవి ఆశయాలను బ్రతికించావు. వెళ్లిరా."

"సెలవు, తిరిగి దర్శనం చేస్తాను."

ఆమె బయటకు వచ్చి కారులో కూర్చున్నది. అతడు కుటీరం సమ్ముఖంలో నిలబడి వున్నాడు. ఆమె విడువలేక విడువలేక వెళ్లింది. గొప్ప అనుభూతితో వెళ్లింది. జీవితంలోనుంచి మేల్కొని స్వప్నంలో నిద్రిస్తున్నట్లున్న దామెకు.

—కిటికీలో కూర్చున్న రేణుక మనస్సు ఇంతవరకూ వెనుకటి కథను స్మరించింది. ధరించలేకపోయింది. ఒక నిట్టూర్పువిడిచి, పరధ్యాన్నంగా ఒక పేజీని త్రిప్పింది గ్రంథంలో. ఆ పుటలో చక్కగా అలంకరింపబడ్డ కవి కుటీరం కనిపించింది. ముస్తాబైన కవి కనిపించాడు. మెత్తటి సోఫాలో కూర్చుని వున్నాడు. పాలకాగితపు దొంతరలున్నాయి బల్లమీద. మంచి పౌన్ టెన్ వున్నది. ప్రక్కన టీపాయ్ మీద పళ్లు, బిస్కత్తులు, ప్లాస్కులో టీ వున్నాయి. మంచి ఉలిపిరిదుస్తులు ధరించాడు. తల చక్కగా దువ్వుకొన్నాడు. కాళ్లకు సిల్కు చెప్పులున్నాయి. బిస్కత్తుముక్కలు నములుతూ, సెంటు జేబురుమాలు వాసన చూచుకొంటూ, పౌన్ టెన్ చేతపట్టి ఆలోచిస్తున్నాడు ఇంతలో బయట హారన్ మ్రోగింది... అతడు నవ్వుతూ ఎదురువెళ్లాడు. "ఇంత ఆలస్యమైందేం కవితా! నేనిందాక నే ముస్తాబై సిద్ధంగా వున్నాను నీవెంతకూ రాకపోతే 'నిరీక్షణ' అనే చిన్న గేయం వ్రాశాను.

ఆమె నవ్వుతూ ఇలా అన్నది. "సుఖదుఃఖాలు చీకటి వెలుగులు, ఆశానిరాశలు, ప్రణయ విరహాలు తపస్సులు, భోగ్యాలు, ఆహ్వానాలు, వీడ్కోలులు ఈ అన్నిటినుంచి, అన్నిటి సమ్మేళనల నుంచి కవిత్వపు పూలు పూయించి మురిపించే కవులకు నేనూ ఒక అనుభవాన్ని అందించా నన్నమాట." అన్నది. అతడు నవ్వుకొన్నాడు. ఇద్దరూ చేరి ఒక కుర్చీలో ఆసీనులైనారు. ఆ గుడిసె గోడలకు క్రొత్తగా వేసిన వెల్లకు మరింత వెల్లదనం వచ్చిందా నవ్వులతో. బీదతనపు పల్లాలలో నుంచి పైకుబికి పాలరాతి నర్తన శిలగా మారిన అతని హృదయంలో వాణి చేసే నృత్యంలాగా వినిపించినాయి వారి పకపకలు. ఆమె బిస్కత్తు ముక్క త్రుంచి అతనికి అందించింది. ఆకలి మరచిపోయిన ఆ కవి మూర్తి కా భోగానికి మాత్రం ఆశిస్తున్న వాని లాగా అందుకొన్నాడు దాన్ని. ఆమె ఫ్లాస్కులో టీ కొంచెం పోసి అందించింది. ఉత్సాహపు కొరత లేని ఆ కవి, దాని నొక ఉపాయంగా స్వీకరించాడు. ఆమె లేచి కొంచెం దూరంలో వున్న పాన్ దాన్ అందుకొని కవటాకులకు కొనగోళ్లతో సున్నం రాస్తూ 'ఏదీ నిరీక్షణ ?' అన్నది.

'సమక్షంలో నిరీక్షణ ప్రలాపమేమి తెలుస్తుంది కవితా' అన్నాడాయన. ఆకులకు ఈనెలు తీస్తు "నిరీక్షణను త్రుంచి వేసేది సమక్షంలో నేగా?' అన్నది. అతడు పకపకనవ్వాడు 'అంత బరువుగా పాడలేనుగాని భావాన్ని మాత్రం వినిపిస్తాను' అన్నాడు.

'భావం తెలిస్తే బరువూ తెలుస్తుంది" అన్నదామె ఆకులమీద కచిరిపొడి విదిలిస్తూ. అతడు ప్రారంభించాడు—

ఈపరీక్షలివేల!
ఈనిరీక్షణలేల?
ఈమూగచూపులో
ఇన్నియుగములుదొరిలి
నిట్టూర్పు కావ్యాల
సుట్ట పేర్చగ నేల?
అర చేతిలో పుసికి
ఆమనెలు కావేల?

కవిత పోకలు కత్తిరిస్తూ 'మీ కవనం అదర్శ శిఖరాలను వదిలి, అశల గూళ్లలో వ్రాలుతున్నదే వచ్చి' అన్నది. 'ఆశలే ఆశయాలవుతాయి. అనుభవానికి దూరమై ఒకప్పుడు నిరాశలవుతాయి. ఇవన్నీ జీవితపు పల్లకీ కుచ్చులేగా' అన్నాడతడు.

'కుచ్చులే క్రూరసర్పాలుగా మారవచ్చునుగా ఒకప్పుడు.' అన్నదామె; పు[illegible] అనేక తెరచే వొత్తుతూ.

'సఫలమైన ఆశయాల్లో ప్రాకరపర్వాలూ ఉచ్చులుగా ప్రేలాడుతాయి' అన్నాడతడు.

"ఆ భావానికి అగ్రతాంబూలమిస్తాను" అంటూ ఆమె తాంబూల మందించింది. అతడు సంతోషంతో తీసుకొన్నాడు. ఆమె కూడా తాంబూలం వేసుకొన్నది. 'మరి షికారు వెడదాము ఇక' అన్నది.

'నా ఆలస్యంలేదు' అంటూ లేచా డతడు. కారులోవున్న నౌకర్ని గుడిసెకు కాపలా పెట్టి వారు బయలుదేరారు. ఈ ఘట్టం కిటికీలో కూర్చునివున్న రేణుక మనస్సులో గుచ్చుకొంది కాబోలు ఉలిక్కిపడింది. గాలికి పుస్తకంలో మరోపుట తిరగబడింది. గ్రంథాన్ని మూసివేద్దామనుకొంది కాని మనస్సు కథను ముందుకు నడుపుకొంటూ పోతున్నది. ఆ పేజీలో సముద్రపుఒడ్డు, అలలు, ఇసుకదిబ్బలు కనిపించినాయి. కవి, కవితా అక్కడ కూర్చుని వున్నారు. ఆమె ముంగురులు గాలికి కదులుతున్నయి. అపారసాగర దృశ్యమామె మనస్సును పొంగిస్తున్నది. కవి సాగరం వంక చూస్తూ తిరిగి కవితపై చూపులు నిలిపాడు. ఆమె అన్నది మెల్లగా—

"నేను మౌనంగా కూర్చుంటాను. మీ భావాలను దండలు గుచ్చండి. ఎంతో ప్రశాంతంగావున్న దిక్కడ."

"ఈ జీవకవిని గౌరవించి ఆరాధిస్తున్న నా కవితకే సమర్పిస్తానా దండలు" అన్నా డతడు.

"అలా అనకండీ. అమరజీవులైన కవుల నారాధించడం, దైవాన్ని ఆరాధించడంవంటిది. అందుకే మిమ్మల్ని సేవించి తరించాలనుకొన్నాను. మీరు నన్ను పూజించడం పొరపాటు."

"ఈ కవిపైన విశ్వాసం లేదా" అన్నా డతడు కాలిమీదకు ఇసుకను త్రోసికొని పిచ్చుక గూడుగా దానిని తిరుస్తూ.

'విశ్వాసమే మీ స్నేహితురాల్ని, శిష్యురాల్ని చేసింది."

అన్ని ధర్మాలపైనా విశ్వాసాన్ని కల్పించేది కవిత్వం, అలాటి కవిత్వాన్ని వుపాసించినంత వరకూ విశ్వాసానికేమి కొరత వుంటుంది?' అని ప్రశ్నించిం దామె. 'కవిత్వాన్నీ, వ్యక్తినీ వేరు చేసి మాట్లాడు తున్నావు కాదూ.' అని అతడు కాలు లాగివేశాడు, నిర్మించే పిచ్చుక గూడు తిరిగి ఇసుకలో కలిసిపోయింది,

'కవిత్వంతో నిండిన వ్యక్తిత్వాన్ని ఎవరు వేరు చేయగలరు? ఆ విలువలోనుంచి బయటపడిన వ్యక్తిత్వాన్ని గూర్చిన ప్రశంస మన కెందుకు?" అన్నదామె.

అతడు తిరిగి సముద్రం వైపు చూస్తున్నాడు. దూరంగా ఎక్కడో ఒక తెరచాప కనిపించింది. తక్కినదంతా నీలపయోధి. పైన నీలగగనం ఉవ్వెత్తున లేచిన కెరటాలు పురుగులు పరుగులుగావచ్చి తీరాన్ని మెరుపుగా మాత్రం తాకుతున్నాయి. కవిత మాత్రం కొంచెం భయంతో కూర్చునివుంది. 'ఇంటికి వెళదామా' అన్నది. అతడు పలుకలేదు. మళ్లీ ప్రశ్నించింది. పలుకలేదు.

'నే నేమైనా అపచారం చేస్తే క్షమించండి. గురుతుల్యులు గనుక నాభావాల్ని తెలియచేశాను. అవిధేయతగా భావిస్తే క్షమించండి" అన్నది. అతడామె వైపు చూచాడు. చిరునవ్వు పెదవులపైన విచ్చింది. 'ఎందుకు క్షమించడం. భావాలలో విభేదాలువస్తే నేరమా, ఒకరి భావాల నొకరు గ్రహించడమే స్నేహం. అది కాదు నే నాలోచించేది. ఈ విశాల సాగరం గంభీరమా! నీ హృదయం గంభీరమా' అని.

"ఎందుకీ పోలిక? ఆలిచిప్పలో నీటికీ, అంబుధికీ సామ్యమా? ఉత్ప్రేక్షలు ఎదురుగా వున్నవారికి కాదు; స్వప్నసుందరులకు భావచిత్రాలకూ మాత్రమే" అన్న దామె. అతడు పకపక నవ్వాడు.

"కవితా! నే నిప్పుడొక భావాన్ని గూర్చి వ్రాసినా, ఆలోచించినా, నీకూ వినిపించందే తోచడంలేదు. అక్కడనుంచి పైకి వెళ్లలేకుండా వున్నాను కూడా. నువ్వు పిలుపుదూరంలో వుంటే ఇంకెన్ని గేయాలు వ్రాసి వినిపిస్తానో అనిపిస్తున్నది. కాని......"

"మీరు నాకు గురువులు. మా తండ్రికీ అలాటి భావమే వుంది. వారితో చెప్తాను. మా ఇంటికి వచ్చెయ్యండి. మీకు కావలసిన సౌకర్యాలు చేస్తాను. నౌకరు లుంటారు. మీరు వస్తే మా ఇంట సరస్వతి నృత్యం చేస్తుంది. అమర కావ్యాలు వెలువడుతాయి. వాటిని కళ్లకు అద్దుకొని జీవిస్తాను..."

"కవితపై నీ కెంత భక్తి త్యాగం వున్నాయి! అయితే రేపే వస్తాను. 'మునిమాపు' కావ్యం అక్కడే ప్రారంభిస్తాను" అన్నా డతడు.

"అలాగే."

ఇద్దరు తిరిగి కారులో ఎక్కారు. ఈ దృశ్యమంతా తిలకిస్తున్నది కిటికీలో కూర్చున్న రేణుక. కవిత అలా అంగీకరించడం పాపమైందా? అనుకొంటూ ఇంకొక పుటను త్రిప్పింది. కవిత మేడపైన

ఒక గదిలో కవి, కవితా కూర్చునివున్నారు. ఆమె తండ్రి కవితో ఇలా అంటున్నాడు. "మా తల్లికి కవిత్వమంటే ఎంతో ఇష్టం. బంగారు కలలు కంటుంది. మీరు మహాకవులు. మీరే మా అమ్మాయికి గురువులు. నేను ధనాన్ని సమకూర్చే తండ్రిని. మీరు విజ్ఞానాన్ని అందించే తండ్రులు" అన్నాడు.

కవి లోలోపల ఉలిక్కిపడ్డాడు. కవిత పకపక నవ్వుకొంది. తండ్రి చిరునవ్వుతో కవివంక చూచాడు. అతడు కూడా ఒక చిరునవ్వు బదులు పుచ్చుకొన్నాడు. అప్పుడిలా అన్నాడు. "మీ కుమార్తె నిజంగా వాణి. ఆమె శిష్యురాలు కావడం కంటె భాగ్యమేమున్నది! కవులను గుర్తించిన వంశం మీది. అందువల్ల నే నేనిక్కడకు రావడానికి అంగీకరించాను."

"మీ కరుణ ఇది. మీ కావ్యాలు మా ఇంట వెలువడినందువల్ల మా గృహం, మా జీవితాలు పవిత్రమవుతాయి." అని తండ్రి సెలవు తీసుకొని బయలుదేరాడు. కవివంక గౌరవంగా చూస్తూ కవిత "వస్తాను ఇప్పుడే" అని వెళ్ళిపోయింది. ఆమె వెళ్లడం కవికి ఇష్టంలేదు. వచ్చింది ఆమె సమక్షాన్ని అనుభవించడానికి. విసుగుతో అతడు లేచి పచార్లు ప్రారంభించాడు. నౌకర్లు నిముష నిముషానికీ వెళ్లి 'ఏం కావాలి' అని అడుగుతున్నారు. అతడేమీ వద్దంటున్నాడు. రాత్రి భోజనానికి తండ్రి వచ్చి పిలిచాడు. ఆకలిగా లేదని కవి అబద్ధమాడాడు. బ్రతిమాలాడు గృహస్థు. కాని కవి వినలేదు. కొంతసేపటికి కవిత వచ్చింది. 'భోజనానికి రండి, పస్తుండటమేమిటి' అన్నది. బ్రతిమాలింది. వినలేదు. పోనీ ఫలహారం తెస్తానంటూ వెళ్లింది. వద్దు వద్దు అని కవి కేకలు పెట్టాడు.

వెన్నెల వచ్చి వరండాలో పడింది. అక్కడ సోఫాలున్నాయి. బల్లమీద రోజాగుత్తులున్నాయి. మేడక్రిందనుంచి రాత్రిరాణి వాసనలువస్తున్నాయి. కవి ఈ వాతావరణాన్ని అనుభవించలేకుండా వున్నాడు. ఇంతలో కవిత ఫలహారాలను తీసుకొని వచ్చింది. ఆమెవంక చూడలేదు కవి. ఆకాశాన్ని పరికిస్తున్నాడు. కవితను పోషిస్తున్నాడనుకొంది. కొంచెంసేపు కూర్చుంది. అప్పుడు "ఫలహారం తీసుకోండి" అన్నది. "నాకేమీ ఆకలి లేదు" అన్నాడు. "ఫలహారానికేం తీసుకోండి" అన్నది. పలకలేదు. 'తప్పవుంటే క్షమించండి. మీరు కోపంగా, విషాదంగావుంటే చూడలేదీ కవిత' అన్నది.

"ఎవరు కల్పించిన విషాదమిది?" అన్నాడతడు.

"నేనా! వాళ్ల విషాదమా! చెప్పండి ఏమిటో అతిపవిత్రమైన మీ కవితకోసం, మీకోసం జీవితాన్ని అర్పిస్తాను. అందుకే మీవద్దకు వచ్చాను." అన్నదామె.

"అవును వచ్చావు. పూరిగుడిసెలో తపస్సు చేసుకొనే నన్ను తీసుకొనివచ్చావు. నేను వచ్చింది తిండికోసమని రుజువుచేస్తున్నావు" అన్నాడు చివాలున లేచి పచార్లు ప్రారంభిస్తూ.

"ఆ! ఏమంటున్నారు! మీ తపస్సు భగ్నం చేశానా? నిజమా! తిండికోసమని రుజువు చేశానా? పొరపడుతున్నారు కవీజీ. మానవజీవితాలకు అమృతదానంచేసే మీరు ఆహారంకోసం ఆశించవచ్చారని నే ననుకొంటున్నానా! కవిత హృదయాన్ని వేరుగా అర్థంచేసుకోకండి. నాన్న చెప్పారుగా మా బిడ్డవని" అన్నది.

"అవును మరి, మీ సొమ్ము తినమనీ, మిమ్మల్ని కీర్తించమనీ కాదూ ఆయన వుద్దేశ్యం! కవి బీదతనంలో వున్నాడు గదా చెవిదగ్గిర నాణాలు మ్రోగించి, మిమ్మల్ని స్తోత్రం చేయించుకోవచ్చు ననుకొన్నారు కాదూ' అన్నాడతడు.

కవిత భరించలేకపోయింది, చివాలున లేచింది. ఫలహారం పళ్లెంక్రింద పడింది. "మీరు పొరపడుతున్నారు కవీజీ! ధనంతో కాదు మిమ్మల్ని ఆహ్వానించింది—ఆత్మలతో. కవితా-కవీ; పేటిలోగల పవిత్రతను కోరి తరించాలని ఆహ్వానించాం. మీ కెందుకు అపార్థంచేశారో తెలియడం లేదు" అంటూ ఆమె వెనక నిలబడి చెప్పతున్నది. అతడు జవాబు చెప్పకుండా ఆకాశం వంక నే చూస్తున్నాడు. ఆమె తీరని బాధతో త్రొక్కిసలాడుతోంది.

ఆకాశంమీద తెలిమబ్బులు రెండు దగ్గిరికి వచ్చినట్లు వచ్చి దూరమవుతున్నాయి. ఒక నల్లమబ్బు ఎక్కడినుంచోవచ్చి చంద్రుణ్ణి ఆవరించింది. ప్రకృతి అంతా వెలవెలబోయింది. ఆ మసక వెన్నెల్లో నిలబడి కవి మనస్సును సరిచేసుకొంటున్నాడు. ఆమెవంక చూచి "కవితా! మన్నించు. ఒక తెలియని బాధతో మనస్సలా పలికింది. మధురమైన నీ హృదయాన్ని బాధపెట్టాను. నీ మేలు మరువనో కవితా! ఈ జీవితానికి నీవే ధ్రువతారవు" అన్నాడు. ఆమె రవంత శాంతించింది. తిరిగ ఫలహారం తెప్పించింది.

అతడు తింటున్నాడు "కవితా వీణమీద, 'ఏ రాణి మీ కైనో' అన్న పాటను వినిపించవు!" అని అడిగాడు. ఆమె అలాగే పాడుతున్నది. అతడు ఫలహారం చేస్తున్నాడు. పండువెన్నెల కాస్తున్నది.

—కిటికీలోవున్న రేణుక బయటికి చూచింది. చీకటి బాగా వ్యాపించింది. గాలిజోరు తగ్గి పోస్తు

న్నది. సన్నగా వీచే ఆ గాలికి పుస్తకంలో పేజీ మరొకటి తిరగబడింది.

ఆ పేజీలో ఈ దృశ్యం కనిపించింది. కవి సోఫాలో కూర్చునివున్నాడు. కవిత వచ్చింది. పాట వ్రాశా నన్నాడు. పాడండి త్వరగా నన్నది కవిత. ఆమె ఆయనవెనుక వెళ్ళి నిలబడింది. అతడు వెనుతిరిగి ఆమె కళ్ళలోకి తొంగిచూస్తూ పాడుతున్నాడు—

"పాలయలుక లేమాయెనే చెలీ
ఈ అలుక లేలనే చెలీ!
నీ వలపు వెన్నెలలు
నిండి నవ్విన మనసు
ఈ మండు టెండలో
ఎండి మ్రోడైపోవు - ॥పా॥
కమ్మనీ కౌగిటా
కరగపోదను రమ్ము

"ఆపి వెయ్యండి పాట! పవిత్రభావ సంపదల పేరిమాలలు గుచ్చే మీకలమిలాటి నీచ భావాలనందుకోవడం నా కిష్టంలేదు" అన్నదామె అక్కడనుంచి దూరంగా జరుగుతూ.

"ఇష్టం లేనివారికే ఇది అంకిత మిస్తున్నాను" అన్నాడతడు కులుకుతూ.

"ఆత్మ వలచని అంకితాన్నెవరూ అపేక్షించరు" అన్నదామె.

"అంకితం చేసే ఆత్మలే అందుకొంటాయి భావాన్ని' అన్నాడతడు.

"ఆత్మల కవిద్రోహం, అవమానం."

"ప్రణయం అవమానం కాదు.—

"కోరని ప్రణయం తీరని అవమానం

"కోరడం కూడా నేర్పే—"

"కోరిక బలవంతంతో కూడింది కాదు—

"హృదయాన్ని దాచడంకూడా పాపమే"

"అలాంటి పాపం అనుభవించేవారికి పరితాపం తప్పదు—

"పవిత్రమైన ఆత్మల్ని వేరుచెయ్యడం ధర్మం కాదు.

"పవిత్రతకు తుచ్ఛపు చీకటి కప్పడం మరీ అధర్మం."

"కవితా! నన్ను అవమానిస్తున్నావు."

"కాదు, దైవంగా భావించి పూజిస్తున్నా."

"ధిక్కరించి, వెక్కిరిస్తున్నావు."

"కాదు మహాకవులని మొక్కుతున్నాను."

"నా కోరికను..."

"కవీజీ! ఆపివెయ్యండి' అంటూ ఆమె చరాచరా క్రిందికి వెళ్ళిపోయింది. కవి వేడి నిట్టూర్పులు విడుస్తున్నాడు.

—కిటికీలో రేణుక మనస్సు ఆవేశంతో నిండివుంది. భరించలేకపోయింది కథా భాగాన్ని. బయట గాలి ఎక్కువవుతున్నది, పేజీలు త్వరత్వరగా తిరుగుతున్నాయి గ్రంథంలో. తరువాతి పుటలో ఈదృశ్యం కనిపించింది.

"కవితా! నా హృదయాన్ని అర్థంచేసుకో. ఒక మూల పడివున్న వాణ్ణి, వచ్చి ఆహ్వానించావు. ఆకర్షించావు. ధనానికి సంబంధించిన గౌరవాలు కల్పించావు. మీ సేవకు జీవితాన్ని అంకితం చేస్తానన్నావు. నీ సౌందర్యాన్ని కోరుతున్నది మనస్సు. నన్ని తృష్ణలోపడవేసి ఇప్పుడు...

"కవీజీ! మీ పాదార్చన కోరుతున్నాను. మీ కల్యాణ గీతికల్ని కోరుతున్నాను. మీ ఆత్మజ్యోతిని కోరుతున్నాను. కవిని పాపకూపంలో పడవేసే నీచదశను కాదు నేను కోరేది.

"కవిని ప్రేమించకపోవడం మహా పాపం సుమా."

"మీరు పొరపడుతున్నారు. ఈ ఒక్క భావాన్ని వదలండి. మీ ఆజ్ఞలను శిరసావహిస్తాను."

"నా కోర్కె మన్నించు, తరువాత నీ ఆజ్ఞలన్నిటినీ పాలిస్తాను."

"అసంభవం..."

"అవమానిస్తున్నావు కవిని."

"గౌరవంగా జీవిద్దామని ప్రార్థిస్తున్నాను."

గాలికి గ్రంథంలో పుట మరిఒకటి తిరగబడింది. అక్కడి దృశ్య మిలా కనిపించింది రేణుకకు.

కవి వంటరిగా కూర్చుని పాడుకొంటున్నాడు. ఇంతలో కవిత వచ్చింది.

మోసమని పాడుతున్నా రేమిటి? ఆ పాట ఆపివెయ్యండి. మరి రేపు మీ పుట్టినరోజన్నారు కాదూ! నాన్నతో చెప్పాను; కవిపూజకు, సన్మానానికి ఏర్పాట్లు చేస్తున్నారు.

"ఇలాటి ఆర్భాటాలతో నన్ను మోసం చెయ్యాలనుకొన్నారా! హృదయం లేని పూజలా! నా పుట్టినరోజు కానుక నాకవిత"

"కవిత కాదు కానుక—ఆమె సేవ."

"మీ సన్మానాలు నాకక్కరలేదు."

గాలికి గ్రంథంలో మరి ఒకపుట లేగింది రేణుక చలించిపోతున్నది. గజగజ వణుకుతున్నది. ఆ పుటలో దృశ్యమిలా కనిపిస్తున్నది—కవి బయలు దేరాడు వెళ్లిపోవడానికి. కవిత మెట్లమీద అడ్డంగా నిలబడివున్నది. వెళ్లవద్దు. ఈ కవిత జీవించదు. మీ పాదసేవ చేసుకొని జీవిస్తాను. మీ కోరిక తిరస్కరించినందుకు మన్నించండి. కవిని వేయివిధాల వేడి ప్రాధేయపడుతున్నది. కవిత మీ కెంతో విషాదం కల్పించింది. నా వయస్సు నాకే అర్థమైనది. దీనిలో పాపం వుంటే నేనే భరిస్తాను. మన్నించండి. రేపు పూజకూడా... "

"కవితా! నా హృదయంలో అగ్ని రగులుతున్నది. వేయి సముద్రాలుకూడా దీన్ని ఆర్పలేవు. నీ సౌందర్యాన్ని సమర్పించు. పాపమైనా, భాగస్వాములమవుదాం."

"స్త్రీ అంటే కామ మేననా మీ అర్థం"

"పురుషుడు లేని స్త్రీ, స్త్రీ లేని పురుషుడు వ్యర్థమని నా అర్థం"

"ఉభయులు కోరవద్దా మరి"

"మన సాంప్రదాయమది కాదు."

"సాంప్రదాయాలమాట కాదు సత్యం చెప్పండి"

"నిన్ను కోరడం సత్యం."

"అసంభవం."

"కవితా!"

"అవును కవీజీ."

"అయితే వెళ్ళిపోతున్నాను."

"కవితను మీ పాదాలతో నలిపి వేసి వెళ్లండి."

"నీ సౌందర్యంతో నాగుండెల నిడివరకే నలచి వేశావు—వెడుతున్నాను."

"వద్దు! వద్దు"

—మరి ఒక పుటలోదృశ్యం. కవి విసురుగా నడిచి వెళ్ళిపోతున్నాడు. ఆమె కన్నీటితో గుమ్మములో నిలబడివుంది. అతడు వీధి వెంట వెళ్లిపోతున్నాడు—కవి తనుకు దూరమవుతున్నాడు.

మరి ఒకపుటలో దృశ్యం. తండ్రి కవితను అడిగాడు "ఏడమ్మా కవి!"

"వెళ్లిపోయాడు"

"ఎందువల్లా!"

(మౌనం)

మరి ఒకపూట. కవిత అర్ధరాత్రి వేళ వెన్నెలలో కూర్చుని వీణ మీటుతున్నది. కన్నీటి ముత్యాలు రాలుతున్నాయి. మరికొన్ని పుటలు ఒక్కసారిగ ఎగిరిపాయి. రేణుక వెనుక అట్ట లోపలి భాగాన్ని చూస్తోంది. అక్కడి దృశ్యమిలా కనిపించింది.

"కారు గుడిసెముందు ఆగింది. కవిత దిగి గుమ్మంలో నిలబడింది. కవిని తాను మొదటదర్శించి నప్పటికంటే దీన దశలో మంచం పట్టివున్నాడు. అతని గొంతులోనుంచి ఒకపాట, తెగి ముక్కలుగా వినిపిస్తోంది.

ఏ సుఖంబులు లేని
ఈ సుకవి బ్రతుకులో
ఏల ప్రాలితి వీవు?
పూల రెక్కలు జూచి
ఏల విపరితి వీవు?
మురిపించి నవ్వించి
మరిపింప జూతువా!
స్వర్గమ్ము రమ్యంబు
నరకమ్ములో ద్రోతువా!

కవిత ఆపాట విని దుఃఖిస్తూ ఆయన దగ్గిరకువెళ్లింది. దగ్గిర కూర్చుని—

"కవిజీ! క్షమించండి"

"ఎవరు!"

"నేను రేణుకను—కాదు మీ కవితను"

"అవునిప్పుడు రేణుక వే! నా కవిత రేణుకగా మారిపోయింది. సహాయానికి వచ్చావు రేణుకా! అబ్బా"

"కవిజీ! మీ కవితగా నే వచ్చాను. ఏమిటిలా వున్నారు? కళ్లు అలా మూస్తున్నారేం! నేను వచ్చాను కవిజీ"

"అవును వచ్చావు, సమయానికి వచ్చావు. ఇప్పుడే అనుకొన్నాను నీ మాట!...అబ్బా!—"

"ఏమిటి మూలుగుతున్నారు? ఇలా అయిపోయినారేం! క్షమించండి, ఈ పాపం నాదే, మీతో ఒక్కమాట చెప్పాలని వచ్చాను."

"ఏమిటది? త్వరగా చెప్పు"

"ఆనాడు మీ కోరిక మన్నించలేకపోయాను. ఆ కోపంతో మీరు వచ్చేశారు. తరువాత ఎంతో విచారపడ్డాను. చివరకు నా మనస్సు చెప్పింది—"మహాకవిని మించిన ప్రియుడెవడు లభిస్తాడు, ఆయన వద్దకే వెళ్లు" అని. అందుకని పరుగెత్తుకు వచ్చాను.

ఆలస్యానికి క్షమించండి. కవిత జీవితాంతరం వరకూ మీ నీడలో నిలుస్తుంది."

"అబ్బా!"

"ఏమిటది!"

"నువ్వు ఆలస్యం చెయ్యలేదు. సమయానికే వచ్చావు. నీదగ్గరనుంచి వచ్చినప్పటినుంచీ నిరాహార దీక్షతో నీ కోసం ఈ కావ్యం వ్రాశాను. ఇదంతా నా ఆత్మకథ. వోపిక లేకపోయినా పట్టుదలతో పూర్తి చేశాను. వ్రాయలేక వ్రాయలేక ఇప్పుడే చివరి గేయాన్ని ముగించాను—నువ్వువచ్చావు."

"అయ్యో! నా కోసం వ్రాశావా? నిరాహార దీక్షతో నా!... లేవండి, ఆహారం తీసుకోండురు గాని—"

"అబ్బ! ఆ... హా... ర... మా! ఈ కావ్యం...తీసుకో...నీకు—అంకిత మిచ్చాను. ఆ గేయం ఒక్కటీ చదువు వింటాను"

కవిత గ్రంథం తీసుకొని అతి దుఃఖంలో చదువుతోంది—

వలదు వలదీ
పాడు లోకము
వలదు వలదీ
వలపు నుచ్చట
కాలమెవ్వని
కరవు దీర్చెను
ప్రణయమెవ్వని
బాగుచేసెను
గగన కుసుమములు
గావె స్వాఖ్యము లెంచగాన్

ఆమె కన్నీరు గేయం పైన కురుసింది.

"విషాహృదయాన్ని చాలా బాధపెట్టాను కవితా" అన్నదామె. అతను పలకలేదు. మళ్ళీ పిలిచింది. పలకలేదు. చెయ్యిపట్టుకొని 'కవితా' అని కుదిపింది. ఆమె ఒక్క కేక పెట్టింది.

—రేణుక ఇలా కవిత పేరుతో వ్రాసిన తన కథంతా వ్యక్తించింది. ఉలిక్కిపడింది. గ్రంథాన్ని మూసివేసింది. వెనుక అట్టమీద తానిలా గ్రంథాన్ని చేతులో పెట్టుకొని దుఃఖిస్తున్న దృశ్యం కనిపించింది. బయట గాలి తగ్గి వర్షం ఎక్కువైంది. ఆమె కన్నీటితో గ్రంథం తడిసిపోతున్నది. అంకిత మిచ్చిన గ్రంథాన్ని అశ్రువులతో పూజిస్తున్నది - కవిత పేరిటి రేణుక.



# కేయూరబాహు చరిత్రము

●

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

"కావ్యేషు నాటకం రమ్యం" మనిరి గాన శ్రవ్యకావ్యములను నాటకములుగ రచించుట యేభాషయందును సామాన్యముగ గలదు, కాని దృశ్యకావ్యములను శ్రవ్యకావ్యములుగా పద్యరూపమున రచించుట కొంత విపరీతముగా నుండకమానదు. రసజ్ఞుడైన యొక కవి పూర్వకథారూపమునకు గొన్ని మార్పులు చేసి రమ్యతరముగా చేయుటకు పాటుపడును. కాని తాత్కాలిక సాంఘికాభిరుచులను బహు జాగ్రత్తగా పరిశీలింపవలసిన బాధ్యత కవికున్నది. ఆ కాలపు సాంఘికాభిరుచులను కవి గమనింపకపోయినచో తన కావ్య మెంత రసవంతమైనదైనను లోక మభినందింపలేదు. అందుచేతనే పింగళి సూరనకృత కళాపూర్ణోదయము "కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము" లని రామరాజభూషణుని విమర్శకు గురియైనది. యథార్థమునకు కళాపూర్ణోదయము పింగళి సూరన ప్రతిభను చాటుచున్నదని, ప్రపంచమున నుత్తమనవలలను చదివిన మనమీ కాలమున, నభినందించుచున్నాము. కనుక సాంఘికాభిరుచులకు కవి సామాన్యముగ వశ్యుడు గాక తప్పదు. ప్రస్తుత కాలములో చిన్న కథలు వ్రాయు రచయితకున్న గౌరవము మహాకవులకు, నాటకకర్తలకు గూడ లేదు. ౪౦ సం॥లకు పూర్వము కవి శతావధానము చేయనిచో గవ్వకు గూడ పనికిరాడు. అందుచేతనో విధముగ 'శతావధాని' యనిపించుకొనెడివారు కవులు. ఉత్తముడైన కవి సాంఘికాభిరుచులకు 'దాసోహ' మన్నను తన ప్రతిభను, వ్యక్తిత్వమును చూపి సంఘమునకుపదేష్ట గూడనగును.

ఆంధ్రవాఙ్మయము సంస్కృత వాఙ్మయమున కనుకరణమే యైనను సంస్కృత భారతాంధ్రీకరణ సందర్భమున నన్నయ్య దేశకాలాభిరుచుల ననుసరించి, చంపూమార్గము ననుసరింపవలసినవాడయ్యెను. తిక్కన మొట్టమొదట సంస్కృత కావ్యసరణి ననుసరించి, నిర్వచనముగ నుత్తర రామాయణమును రచించినను, భారతాంధ్రీకరణ సందర్భమున నన్నయ్య మార్గమునే యవలంబించి, సాంఘికాభిరుచి ననుసరించి చంపూమార్గమును గ్రహించెను. స్వల్పసంఖ్యాకులు తప్ప ఆంధ్రకవు లందరు, సంస్కృత కావ్య రచనా పద్ధతియైన 'నిర్వచన వైఖరిని' ఛిన్నముగ చంపూమార్గమునే యవలంబించి దాని నాంధ్రకావ్య సంప్రదాయముగ నొనర్చిరి. రామాయణమును పాడుట కనుగుణముగ నుండుటకై వాల్మీకి సంస్కృతభాషలో ననుష్టుప్ఛందస్సులో వ్రాసినను మనవారు పారాయణ కనుగుణముగ నుండుటకు చంపువుగనే రచించిరి. ఆంధ్రవాఙ్మయ ప్రారంభశతాబ్దములలో శ్రవ్యకావ్యరచన కనుగుణమైన చంపూపద్ధతియే యాదరణ పాత్రమగుటచేతనే వచనకావ్యములైన బాణుని కాదంబరిని, దండి దశకుమార చరిత్రమును గూడ చంపూమార్గమున కేతనద్వయము వ్రాయవలసివచ్చినది. ఒకానొక యభిరుచి యుచ్ఛదశయందున్నప్పుడితర మార్గము లెంత రమణీయములైనను సంఘమునకు నచ్చవు. ఆ రుచిని పరిపూర్తిగ ననుభవించిన తర్వాతగాని దానిపై క్రమముగ విసుగును చివరకు రోతయు జనించి దానిని త్యజింపరు జనులు.

నన్నయ్యకు పూర్వము తెలుగున పదకవిత్వముండి యుండును. అది నన్నయ భారతము ముందర నిలువలేక యస్తమించియుండును. నన్నయ భారత కవిత్వ ప్రభావము నేటివరకు గూడ నందర నాకర్షించుచునే యున్నదికదా యాంధ్ర సారస్వతమున. అట్టితరి భారతాంధ్రీకరణము పూర్తికాకుండగ నేల యా కవిత్వప్రభావము మందగింపగలదు? నన్నయ తర్వాత రెండుశతాబ్దములకు గూడ నాంధ్రభాషలో ౧౬, ౧౭ వ శతాబ్దములలో వలె నధిక సంఖ్యగల కవులు లేరు. అందుచే నాంధ్రవాఙ్మయము బాల్యదశలోనే యున్నదని చెప్పవలసివచ్చును. ఇట్లనుచేనా కాలమున నాంధ్రకావ్యరచన యుత్తమ మార్గము

నకు చెందలేదని కాదు. అసలీ కాలమున బయలుదేరిన యుత్తమ కవిత తర్వాత కాలమున పుట్టనే లేదు. ఇందుచే నన్నయ తర్వాత కొన్ని శతాబ్దములవరకు నాంధ్రవాఙ్మయమున నుత్తమ కావ్యరచన చేసి పేరు ప్రతిష్ఠల గడింపనెంచిన ప్రతి కవియు నే యితర రచనాపద్ధతులను గ్రహింపక, చంపూపద్ధతిని శ్రవ్య కావ్యముల నే వ్రాయవలసినవాడయ్యెను. తన కావ్యమునకు మూలకథ గద్యములో నున్నను లేక పద్యములో నున్నను, శ్రవ్య కావ్యరూపమున నున్నను, లేక దృశ్య కావ్యరూపమున నున్నను సరే, తాను చంపూమార్గమున శ్రవ్యకావ్యముగ నే ప్రతి కవియు వ్రాయవలసిన వాడయ్యెను. ఆ కాలమున సారస్వత సంఘములో నాటకరచనకు గాని, వచన రచనకు గాని, గేయరచనకు గాని, విశేష గౌరవము లేకుండెను. ఇందులకా కాలపు సాంఘికాభిరుచియే మూలము. అందుచేతనే భవభూతి యుత్తర రామాయణమును తిక్కనయు, రాజశేఖరుని విద్ధసాలభంజికను మంచనయు, కాళిదాసుని శాకుంతలమును పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడును, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమును నంది మల్లయ్య—ఘంట సింగన్న కవులును శ్రవ్యకావ్యములుగ రచించి యందు తమకు తోచినమార్పులను చేయవలసివచ్చినది. నాటకములను శ్రవ్యకావ్యములుగ రచింపబడినంతమాత్రమున నాకాలమున నాటకరంగములు లేవని గాని, నాటకరచన తెలియదని గాని భావించుటకు వీలులేదు. ఆ కాలమునగూడ భాగవతులు యక్షగానము లాడుచుండెడివారని పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రవలన దెలియుచున్నది. ఇక నాటకములు నాటక రూపమున నే యేల యాంధ్రీకరింపబడలేదని మఱియొక ప్రశ్న రావచ్చును. అట్టి రచనలలో మూలశ్లోకమునకు సరియగు తెలుగు సేత చేయుటలో గల క్లేశము నసంతృప్తియు ప్రస్తుతకాలమున గలుగుచున్నట్లా కాలమున గూడ గలిగియుండవచ్చును. ఇట్లని స్వతంత్ర నాటకములేల యాంధ్రభాషలో నాశతాబ్దములలో రచింపబడలేదను ప్రశ్నకు సమాధానమా కాలమందు సంఘమునగలసారస్వతాభిరుచియే యనియు గ్రహింపవలసియున్నది. ఇక నీదృశ్యకావ్యాభిలాష యక్షగానముల మూలమున పండితపామరులకు తీరుచుండెడిది. యక్షగానములు, పాత్రోచిత వ్యావహారిక భాషతో గూడి, స్వభావసిద్ధములై, భరత నాట్యసంయుతములై హాస్యరసభూయిష్ఠములై, జనులహృదముల నాకర్షించుటచే నవి యెక్కువ ప్రజారంజకములుగ నుండియుండును. మహానాటకములు విద్యావంతులకును, సంస్కారులకుమాత్రమే యర్హమైనవిగా గనబట్టెడివి. కాన మహానాటకరచన జనసామాన్యమునకు యక్షగానములవలె ప్రయోజనకారి గా లేదు. ఇక యశస్సు నాశించిన కవి తన కవిత్వమహత్త్వము ప్రదర్శింపగోరి శ్రవ్యకావ్యపద్ధతిని, చంపూమార్గము నాశ్రయించవలసిన వాడయ్యెను. నాటకమును శ్రవ్యకావ్యముగా రచించునప్పుడు కవికి, పరిపూర్ణమైన స్వాతంత్ర్యము కథాకథనమునను, వస్తువర్ణనమునను, పాత్రల భావోన్మీలనమునను బాహాటముగ స్థలకాలనిర్బంధములకు వెరవక, యుండును. అప్పుడు కవులు తమవ్యక్తిత్వమును, ప్రతిభను ప్రకటించుటకవకాశముండును. ఈ కారణములచేతనే ౧౩-౧౪ శతాబ్దములలో కొందరాంధ్రకవులు సంస్కృతనాటకములను శ్రవ్యకావ్యములుగ పరివర్తనము చేయవలసి వచ్చినది.

కావ్యరచనా స్వరూపము సాంఘికాభిరుచులపై నాధారపడియున్నట్లే, కావ్యకథావస్తు పరిగ్రహణముగూడ తత్కాల సంఘమందలి సారస్వతాభిరుచుల ననుసరించును. ఒకకాలమున పౌరాణికకథలు సంఘమున కాదరపాత్రమగును. మరియొక కాలమున జనులకు సాంఘికవిషయములు రుచించును. ఇంకొక సమయమున ప్రజ నైతిక కథల కిష్టము చూపును. మరొకప్పుడు నీతి బాహ్యమైన శృంగార కథలందు జాతికి వేడ్క జనించును. ఈవిధముగ గూడ సంఘాభిరుచులు వివిధకాలములందు మారుచుండుటచే కవి కావ్యమున నాయభిరుచులు ప్రతిబింబింపక మానవు. కాని వివిధమైన యభిరుచులను తన కావ్యమున ప్రతిపాదించుటలో కవి ముఖ్యముగా నౌచిత్యమును పాటించవలయును. విచక్షణ లేకుండ సర్వాభిరుచులను మిశ్రము చేయుచో నొకప్పుడు రసభంగము గావచ్చును. ఇట్టితఱి భిన్నాభిరుచులను ప్రతిపాదించుటకు ప్రత్యేక కావ్యములు వ్రాయుట మేలు.

ఇట్టి వివిధాభిరుచుల కాశ్రయమైనది మంచన కవి కృతి కేయూరబాహుచరిత్రము. కవి దీనిని నాలుగాశ్వాసములలో నాంధ్రమున రచించి

నందూరిసుంకన మంత్రి కంకితమిచ్చెను. ఇది చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథ భాండారమం దున్న యొక్క ప్రతిఁబట్టి యందలి తప్పులును, లుప్తభాగములును తిరుపతివెంకట కవులచే సంస్కరింపఁబడి, సరస్వతీ పత్రికనుండి పునర్ముద్రితమై, ౧౯౦౭ వ సం॥ వ సరస్వతీ పత్రికాధిపతులచే ప్రచురింపఁబడెను. దీనికి కొ. రా. జం. కృష్ణారావుగారు పీఠిక వ్రాసిరి దీని ముద్రితప్రతులు ప్రస్తుతము దొరకవు. కాన తిరిగి సంస్కరించి ముద్రింపవలసిన యావశ్యకత గలదు. దీనియందు కవి కృతిపతి వంశచరిత్రమును విపులముగ వర్ణించినాఁడు గాని, తన్నుగూర్చి యేమియు చెప్పికొనలేదు. మంచనకవి తిక్కన సోమయాజికి కొంచెము తర్వాత, క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమునం దుండెను. ఈ కావ్యమున కృతిపతియగు నందూరి గుంకనమంత్రి చరిత్రమును వ్రాయుచు చారిత్రికవిషయము లనేకము కవి దెల్పెను వాటినన్నింటిని లోగడ పూజ్యులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు భారతిలో స్పష్టపఱచినారు.

కేయూర బాహుచరిత్ర కథను రాజశేఖర కవి కృతియగు విద్ధసాలభంజిక యను సంస్కృత నాటకము నుండి మంచన గ్రహించి యందుండి కొన్ని మార్పులను చేసినాడు. ముఖ్యముగ నాటకమున నాయకుడు విద్యాధర మల్లుఁడనియు, నతని రాజధాని యుజ్జయిని యని యుండఁగ, మంచనకవి కేయూరబాహువు రాజనియు, నతని రాజధాని త్రిపురీ నగర మనియు మార్చెను. విద్ధసాలభంజిక కథ యిట్లున్నది.

ఉజ్జయినీ నగరాధిపతియగు విద్యాధరమల్లుఁడు తన భార్యయగు రత్నసుందరి యందు శృంగారలీలా విలాసమున రాజ్యవ్యాపార విముఖుఁడై యుండుటచే నతని మంత్రియగు భాగురాయణుఁడు రాజు చిత్తవృత్తిని మరల్పనెంచెను. రత్నసుందరి పినతల్లి భర్తయైన లాటదేశాధిపతి యగు చండవర్మ, తన వంశమున నేక సంతానముగల్గు పూర్వశాప కారణమున, దనకు మృగాంకావళి యను పుత్రిక గలుగగా, తన యనంతరము శత్రువులకు లోఁబడకుండుటకై తన పుత్రికకు మృగాంకవర్మ యను పురుష నామ మొసగి, యా రహస్య మెవరికి తెలియనీయక పుత్రుఁడనియే యందరికి ప్రచారము చేసెను. కాని మృగాంకావళిని వివాహమైనవాఁడు సార్వభౌముఁ డగునని సిద్ధుని వాక్య మొకటి గలదు. ఈ రహస్యమును భాగురాయణ మంత్రి చారులవలన విని, మృగాంకావళిని విద్యాధరమల్లునకు మాయోపాయమున రత్నసుందరిచే వివాహ చేయింపఁ బూనుకొనెను. లాటదేశముపై శత్రువులు దండెత్తి వచ్చుట నెఱిగి భాగురాయణుఁడు మృగాంక వర్మ రక్షణకై యాతనిని తనయూరికి పంపుమని రత్నసుందరిచేత చండవర్మకు లేఖ వ్రాయించి, తెప్పించి తన యింటనే రహస్యముగ నుంచెను. తన కార్యసాధనకై మంత్రి రాజున కొక విచిత్రమైన శయ్యాగారమును గల్పించి దాని గోడలమధ్య జనులు తిరుగుటకు వీలు చేసి క్రీడలాడు సాలభంజికల నందుంచి, దానికి తనయింటికి నొక రహస్యమార్గమును గూర్చెను.

అంతట కుంతల దేశాధీశుఁడు కస్మాత్తుగ రాజ్యభ్రష్టుఁడగుటచే నతని కూఁతురగు కువలయవతి విద్యాధరమల్లుని శరణు వేఁడగ నామెను వివాహమాడుటకై తన విదూషకుఁడగు చారాయణుని మూలమున రాజు ప్రయత్నించెను. దీని నెఱిఁగి రాణి రత్నసుందరి, యామెను తనపినతల్లి కుమారుఁడనుకొను మృగాంక వర్మనకు పెండ్లి చేయఁదలపెట్టి, తనకు సవతిని గూర్పనున్న విదూషకు నవమానింప బూనుకొని, మృగాంకవర్మ పురోహితుని కుమార్తె యను నెపమున తన పరిచారకుని కొకనికి స్త్రీవేషము వేయించి, మేఖలయను చెలికత్తె సాయమున రాజు సన్నిధిని విదూషకుని కామెను పెండ్లిచేయించెను. చివరకు సత్యమెరిగిన చారాయణుఁడు రాణిని దూషించి వెళ్లిపోగ, రాజు తన్నుతిట్టించెనని భావించి రాణికోపాగారమును ప్రవేశింప, రాజు శయ్యాగారమున రాత్రి విరహముతో నుండెను. ఇదే సమయమని యెంచి మంత్రి భాగురాయణుఁడు, కళావతియను దాసి సాయమున మృగాంకావళిని రాజ శయ్యాగార ప్రవేశమును చేయించి, యామె మెడలోనున్న ముత్యాల హారమును రాజు మెడలో వేయునటుల చేసి, రాజామె యందు రాగ మున్నదుగాగ, నామె రత్నసుందరికి వెరచునని పల్కి, తప్పించుకొనిపోయి మాయమగును. ఉదయమున విదూషకుఁడు రాజును కలిసికొనుడు సర్వము నెఱిగించెను. అంత విదూషకుఁడు శయ్యాగారమందలి వివిధసాల భంజికల చిత్ర నటనల రాజునకు చూపించుచుండఁగా, మృగాంకావళి రాజును

గూర్చి విరాళి గొనుటయు, నామె చెలి యామె సోదార్చు పలుకులును వారు విందురు. అవి బ్రహ్మ రాక్షసుల మాటలని చెప్పి విదూషకుడు రాజును మరపించును. ఈ సన్నివేశమును బట్టియే రాజశేఖరకవి తన సంస్కృత నాటక మంతకును 'విద్ధసాలభంజిక' యను నామమిడెను.

౬

విదూషకునికి జరిపిన పరాభవమునకు ప్రతిగా మేఖలను పరాభవింప గోరి రాజు, సులక్షణ యను దాది సాయమున మేఖలకు వైశాఖ పూర్ణిమనాడు గండముగలదనియు, దానిని తప్పించుకొనుటకు సర్వ వేదవేదియగు బ్రాహ్మణునకు దక్షిణతాంబూలము నిచ్చి యాతని కాళ్ల సందునుండి దూరిపోవుటయే యని చెప్పించెను. మరునాడు మేఖల విదూషకునితో గూడిన రాజును రాణిని చేరి, రాజోపదేశమున విదూషకుని పూజించి, యాతని కాళ్ల క్రిందనుండి దూరిపోగ విదూషకుడు, తనకు పూర్వము చేసిన యవమానమునకు ప్రాయశ్చిత్తమైనదా యని పరిహాసము చేసెను. అంత రాణి కోపించి చెలితో వెళ్లిపోగ, విరహతాపముతో నుండిన రాజును కళావతి చేరి, మృగాంకావళి చరిత్రనంతయు చెప్పి, భాగురాయణ మంత్రి యామెను రత్నసుందరిచేత రాజునకు మాయోపాయమున వివాహము చేయించు ప్రయత్నము సర్వము నెరింగించి, తర్వాత రాణి యొద్దకు బోయి చారాయణునిచే రాజు మేఖలకు చేయించిన యవమాన ప్రతీకారముగా, మృగాంకవర్మకు స్త్రీవేషము వేసి, యాతని సోదరి యను మిషచే, రాజునకు వివాహముచేసి పరిహసింతమని చెప్పి యట్లు చేయును. వివాహము యథా విధిగా నందరి సమక్షమున జరుగుచుండగా చండవర్మనృపాలుని వద్దనుండి, తనకొక చిన తమ్ముడు గల్గెననియు, తన యొద్ద నున్న మృగాంకవర్మ పురుషుడు గాక మృగాంకావళియను కుమార్తె యనియు రహస్యకారణమును వెలువరించి, యామె వివాహమును దన్నే చేయుమనియు లేఖ వచ్చెను. అది తెలిసి రాణి దిగ్భ్రాంతి చెంది జరిగినదానికి చేయునది లేక యూరకుండెను. పిమ్మట విదూషకుని ప్రేరణమున కువలయవతి గూడ రాజునకు పెండ్లి చేయబడెను.

ఈ నాటక కథయందు సందర్భానుగుణముగ కల్పనలు చేయబడినను గొన్ని యసంభావ్యములుగా లేకపోలేదు. కుల పరంపరానుగతమునకు విరుద్ధము చండవర్మ కేకపుత్రునకు బదులుగా పుత్రిక గలుగుట. ఏతద్విరుద్ధముగ రెండవ శిశువు జనించుట. శత్రువులు దండెత్తినపుడు వచ్చిన పురుష వేషములో నున్న మృగాంకావళి, రత్నసుందరి యింటిలో గాక భాగురాయణుని యింటిలోనుండ సమ్మతించుట యనునవి కథోచితముగ నున్నను సంభావ్యముగ లేవు. ఈ యసంభావ్యములను తొలగింప ప్రయత్నించినచో నసలు కథకే భంగము గలుగును గావననివి సహింపబడినవి. మఱియు నీ నాటకకథయందితర సంస్కృత నాటక కథా సన్నివేశములతో గొన్ని పోలికలున్నవి. విద్ధసాలభంజిక నాటకకథ భాసుని స్వప్నవాసవదత్త నాటక కథకు ఛాయగా నడిచినది. స్వప్న నాటక మందలి యుదయనుడే దీనియందు విద్యాధర మల్లుడు. అందలి కౌశాంబి యిందలి యుజ్జయిని. అందలి వాసవదత్త యిందు రత్నసుందరి. అందలి యౌగంధరాయణుడిందు భాగురాయణుడు. అందలి పద్మావతి, యిందు మృగాంకావళి. అందు పద్మావతిని వివాహమైనవాడు సార్వభౌముడగునని, యిందు మృగాంకావళిని పెండ్లి చేసికొనువాడు సార్వభౌముడగునని యును సిద్ధాదేశము. స్వప్నవాసవదత్త నాటకమున వత్సరాజు వాసవదత్తయందు బద్ధానురాగుడై రాజ్య వ్యవహారములను గూడ మఱచియుండి, తన విశాల రాజ్యమును గూడ గోల్పోగా, రాజును వాసవదత్తానురాగమునుండి మరలించుటకై లావాణకాగ్నిలో నామె మరణించెనని మంత్రి యౌగంధరాయణుడు కల్పించి పద్మావతీపరిణయముచే రాజును సార్వభౌముని చేయును. విద్ధసాలభంజికలో రత్నసుందర్యనురాగమునుండి రాజును మరలించుటకై మృగాంకావళిని జూపి మంత్రి భాగురాయణుడు, కృత్రిమ వివాహమిషచే వారిద్దరకు రత్నసుందరిచే వివాహము చేయించి, రాజు సార్వభౌముడు గావింపబడును. తన భర్త సార్వభౌముడు గావలెనని వాసవదత్త స్వబుద్ధితో పద్మావతిని వత్సరాజునకు పెండ్లిచేయ సమ్మతించి ప్రయత్నించును. కాని విద్ధసాలభంజికయందు రత్నసుందరి భ్రాంతిమూలకముగా రాజును మృగాంకావళికి స్వహస్తములతో వివాహమొనర్చును. హర్షుడు రత్నావళీ ప్రియదర్శిక నాటకములందు గూడ నుపనాయికల వివాహమాడినవాడు సార్వభౌముడగునని చెప్పించి వారి నాయకులకు

పెండ్లి చేసెను. స్వప్నవాసవదత్తమను పేరు నాటకమునకు కల్గించిక కథాసన్నివేశము రాజుశేయ్యాగారమున ననుభవించినవిషయము విద్ధసాలభంజికయను పేరీ నాటకమునకు కూర్చిన కథాలేశముకూడ రాజు శయ్యాగారమున ననుభవించిన విషయమే. భవభూతి మాలతీమాధవమున నందుని మోసగించుటకై మకరందుడు మాలతీవేషమున నతనిని వివాహమాడునట్లు కూర్పగ, రాజశేఖరకవి విద్ధసాలభంజిక నాటకమున చారాయణు నవమానించుటకై, యతనికి స్త్రీవేషము ధరించిన యొక సేవకునకు వివాహము చేయించెను. ఇది ముందు జరుగబోవు రాజ మృగాంకావళుల వివాహమునకు బూర్వరంగమువంటిది.

మంచనకవి విద్ధసాలభంజిక నాటకమందలి రాజు, రాజధాని పేర్లను మార్చుటే కాక, విదూషకునకు స్త్రీవేషము వేసిన యొక పరిచారకునితో వివాహము కూర్చినట్లు మూలమున నుండగ, కేయూరబాహు చరిత్రమున మేఖలకును పురుషవేషము ధరించిన యొక దాసితో వివాహము చేసినట్లు మార్చబడి, విదూషకుడు మేఖలకు చేసిన యవమాన విషయమును, రాజు కువలయవతిని పరిణయమగు కథను వదిలివేసెను. మూలమందలి చారాయణుని కృత్రిమ వివాహమునకు బదులు, మేఖలకు కృత్రిమ వివాహమును చేయించుటలో మంచనకవి యొక్క ప్రయోజనము నాశించినాడు. మొదట విదూషకున కొక కృత్రిమ వివాహము జరిగినపిదప రాజునకుకూడ మరి యొక కృత్రిమ వివాహము రాణి చేయనున్నదని యెరిగినచో, రా జంగీకరించునో లేకో యను సందేహమున, ముఖ్య వివాహమునకు భంగము రాకుండ, విదూషకుని కృత్రిమ వివాహమునకు బదులు, మేఖల కృత్రిమ వివాహమునుగూర్చి, తత్ప్రతీకారముగ రాజునకు కృత్రిమ వివాహమును రాణి చేయదలచినట్లు మంచన కవి, రచించినాడు మేఖలకు జరిపిన కృత్రిమ వివాహమువలన, మూలమున మేఖలకు విదూషకు డొనర్చిన యవమానముతో నవసరము లేకపోయినది.

కేయూరబాహు చరిత్రము ప్రారంభమున నే చమత్కారమైన కథాసన్నివేశము గలిగియున్నది. రసవంతమైన శృంగారరస ప్రధానమైన భాగము చతుర్థాశ్వాసము మాత్రమే. ఇందలి సన్నివేశములు మిగుల హృద్యము లైనవి. సన్నివేశములకు దగిన మనోహరములైన భావములు నా భావములకు సమానముగు సరసమైన శైలి గలిగియుండుటచే నీ కావ్యము ప్రశస్తమైనది. ఇది సరసకావ్యములలో చేరునే కాని ప్రౌఢ కావ్య మనబడదు. కథాప్రారంభమున మృగాంకావళి పురుషుడుగా మృగాంకవర్మయను పేరితో పెంపబడి భాగురాయణునొద్ద చేరుటలోనే యొక చమత్కారము కథకు కల్గినది. రాజు శయ్యాగారమున సాలభంజికల నిర్మించుట, యందే మృగాంకావళి రాజును మోహించుట, రాజు భ్రాంతి చెందుట కథకు జీవమై రమణీయముగ నున్నవి. మేఖలకు పురుషవేషమును ధరించిన యొక దాసిని పెండ్లి చేయుట, హాస్యరసపోషకమైన యొక చక్కని సంఘటనము. చివరకు రాజునకు మృగాంకావళిని రత్నసుందరిచేత నవమాన ప్రతీకారమిషచే హాస్యమునకై వివాహము చేయించుట మరియొక చమత్కార సన్నివేశము. ఈ విధముగ ననేక రమణీయ సన్నివేశములతో గూడియున్నదీ మూలకథ.

శృంగారరస ప్రధానమై, చమత్కార కథాసన్నివేశ భూయిష్ఠమైన యీ సరసకావ్య మధ్యమున నీతి బోధకములగు ననేక కథలు పంచతంత్రము మొదలైన వానినుండి గ్రహింపబడి కూర్పబడినవి. ఈ రీతిగ కావ్యమును నిర్మించుట కృతిపతి కోరికయని కవి యిట్లు తెల్పెను.

కం॥ స్థాయిరసము శృంగారం—
బైయలవడ, గథలనీతులై యొడసెసరా
గేయూరబాహు చరితము—
పేయుమునీ వాంధ్రభాష శిల్పము మెరయన్

నాలుగాశ్వాసములు గల యీ కావ్యమున సుమారు ౭౬౦ పద్యములున్నవి. ఇందులో దాదాపు ౨౦౦ పద్యములు మాత్రము నాటక కథకు సంబంధించినవి. మిగిలిన వన్నియు కృత్యవతారికయు(౨౨)నీతి బోధకమైన పిట్టకథలకు సంబంధించినవే. ప్రధాన కథ స్వల్పమగుటచే గ్రంథమునకు పుష్టిగలుగజేయుటకే కథలను కవి చేర్చియుండును. కాని యాముక్తమాల్యద, వసుచరిత్ర లందలి దీర్ఘవర్ణనలు కథాగమనమునకు భంగము గల్గించినట్లే, కేయూరబాహు చరిత్రమున నీ యవాంతర కథలు కథా ప్రవాహమున కడ్డు తగిలినవనియే చెప్పవలయును. అందులో

శృంగారరస ప్రధానముగల నాటక కథకు నీ చిన్న కథలకు సంబంధము లేదు. ఇవి ప్రధానకథకు దోహదములు గావు. కేవలము సందర్భముగ నతికించినట్లున్నవే కాని ప్రధాన కథతో కలిసిపోలేదు. పంచతంత్రము వంటివి కథలు పరస్పరము సమర్థనీయములై, ప్రధాన కథకు దోహదమ్ములును, ప్రయోజకములుగ నున్నవి. అముక్తమాల్యద యందువలె కేయూరబాహు చరిత్రమందును కథలు, వేరికవి వేరుగనున్నవి. ప్రథమాశ్వాసమున వస్తునిర్దేశము మాత్రము జరిగినది. ద్వితీయాశ్వాసమున కథ పెరుగక పూర్వమే పిట్టకథలు చుట్టు ముట్టినవి. ఇందు మేఖలకు కపట వివాహము జరుగుట మాత్రమున్నది. తృతీయాశ్వాసమున నున్న ౩౪౭ పద్యములందును చిన్న చిన్న కథలు తప్ప నాటక ప్రధాన గాథ లేనేలేదు. ఈయాశ్వాసమును త్యజించినను కావ్య ప్రధాన కథకు భంగము రాదు. కావ్యమం దెక్కువ పద్యములు గల పెద్ద యాశ్వాసమిది యొక్కటే. ఇక నసలు కథ యంతయు చతుర్థాశ్వాసముననే యున్నది. దీనిలో గూడ మూడు పిట్టకథలు గలవు. ఇవి శృంగారరస ప్రధాన కావ్యకథకనౌచిత్యము గూర్చుచున్నవి. ఈ పిట్టకథలలో గొన్ని యౌచిత్యమునుగూడ గోల్పోయినవని చెప్పవలసి వచ్చును. కీర ప్రేరణమున బోయవాడు ధనాశా పర్వతమున పాముపుట్టలో చేయి పెట్టి చచ్చుట. యక్షవనిత గర్భమును భర్తకిచ్చి మరలి రాకుండుట మొదలైన వింధులకుదాహరణములు.

కృతిపతి కవిని గోరిన ప్రకారము "స్థాయి రసము శృంగారంబై" యను పద్యమునుబట్టి యాకాలమున పారస్వత లోకమున కథా వాఙ్మయమున కభిమానము నభిరుచి కలదని కేతన దశకుమార చరితాది గ్రంథములవలనను గూడ భావించినచో, శృంగార రస ప్రధానమైన కేయూర బాహుచరిత్రమునందే యీ కథాజాలమును మిశ్రము చేయుటకంటె, కథా భూయిష్ఠమైన ప్రత్యేక కావ్యమును రచించుట మేలు. కావ్యము నీతి ప్రతిపాదక మగుటకూడ ముఖ్యముగా గోరదగినదే. అట్లని నీతి శాస్త్రము నేకరువు పెట్టుటకు రసజ్ఞు లంగీకరింపరు. కావ్యమున నీతి వ్యంగ్యముగ తెరచాటుగ నుండవలయునే కాని వాచ్యముగా నుండరాదని యాలంకారికుల మతము. శృంగారరస ప్రధానమమునైన కావ్యమును హితోపదేశమయముగా చేయజూచుచో రస భంగమగును. అవి, నీతి బాహ్యముగ లేకుండ చూచుటయే కవులు ముఖ్యముగ గమనింప వలసిన విషయము. కాన నీ కథలు కావ్యమునకు రసభంగ హేతువులైనవని చెప్పక తప్పదు. వలసినచో నిందుగల నీతిపద్యములను మాత్రముంచి, తత్ప్రతిపాదకములైన పిట్ట కథలను పరిత్యజించినచో శోభస్కరముగ నుండెడిది. దాన కావ్యము చిన్నదైనను న్యూనతరాదు. కాళిదాసుని మేఘసందేశము చిన్నదేకదా.

మంచన చక్కని ధారాశుద్ధి గల కవి. ఈతని కవిత్వశైలి సరళమై ద్రాక్షాపాకమున నుండును. ఈతని రచనము నదేశీయ పదజాల మధికమై, సరళమైన సంస్కృత పదములతో మేళగించినది. కర్కశమైన సంస్కృత సమాసములు మందునకైన గానరావు. చక్కని దేశీయ పదములతో దీర్ఘ సమాసములనుగూడ నీకవి పద్యమున గూర్చును. మరియు నీతని రచనమున చక్కని లోకోక్తులు గానవచ్చును. కొన్నియివి—(*I*) జగంబున నోడలబండ్లు, బండ్ల నోడలు జను దెంచు—(*III*) ౧౦౩౫ (౬) మాదినరొయ్యకుపని చిక్కని కటుతచేత బాగైయున్నె. *IV* ౧౦౨; (౩) దాగబోయి యుండల వరి యింట దాగిరి. *IV* ౧౬౧; (౪) పెక్కులు బుద్ధులు గఱచిన పెక్కునకు భయము నటవిక్కమింక. *IV* ౪౨; (౫) చిటిపొటి పొన్న చుక్కలకు చేతులు చాచుట *IV*. ౧౪౩. మొదలైనవి. మంచన కవితలో చక్కని జాతీయములను గూర్చును. అట్టివి కొన్ని—మందున కయినట్ట మత్స్యంబు లేకుండ. *III*. ౧౬౧; ముక్కున నీరత్రుడు. *III*. ౨౦౧; కాలము తలనైనను. *III*. ౩౯; కేయూర బాహుచరిత్రమున గల దేశీయ పదములును విశిష్ట ప్రయోగములు నివి—సోడు ముట్టు *II* ౧౦; సేగి *II* ౧౧౭. *III* ౩౨; ఊటాడు—*II* ౩౭; లెంకలు *III* ౨౦౦, ౨౦౨; అడిచిపడు *III* ౪౯; నేలమాలె *III* ౨౧౩; కొట్టికత్తెలు—*IV* ౫౦; అట్టువ *III* ౨౪౪; ఆరెకులు *III* ౨౪౪. పెరిమెలు *III* ౨౬౦; మెుక్కలము *IV* ౨౦౦; విరిసితిను *III* ౨౦౫; విప్పము—*IV* ౨౪. కీనువగొట్టు *III* ౪౧; సోగియ IV. ౯ ముచ్చుమడుగు IV ౧౯౦; కొంచెదనముసేయు—IV ౧౩౫; దొడ్డలాడు IV ౧౭; లెప్పంబయ్యె—IV ౨౪; పగతో బలియింప నేల—

III ౫౫; వెలసువారు (చు) IV ౨౬; శోధించుచు IV ౬౫.

మంచనకవి భావనాశక్తి నిదర్శనముగ మృగాంకావళి శయ్యాగారమున నిద్రించుచున్న రాజును గాంచి తలపోసిన రీతియిది. ఆ IV. ప. ౩.

సీ॥ ఈ రెప్పపాటి గ్రుచ్చి యించుక మాచిన,
 నోప్పారు కన్ను లెట్లుండునో కో,
ఈ బొమ్మలల్లార్చి రోత్తినటించిన,
 నలికమేసొబగున బొలుచునో కో;
యీ ముఖాంబుజమున నెలనవ్వు మొలచిన,
 నరుణాధరం బెంతయమరునో కో,
యీ వాక్కు లెఱచి రేమేలిబలికిన,
 మృదుభావ లెట్టివై మెఱయునో కో;
గీ॥ అనుచునరనాధ పుత్రికమనములోన
మదనవికృతు లంతంతకు మదిలగొనగ
వేడుకలు, మెచ్చులును తోడుగూడిపొదల
ధరణినాయకు దెలుకంబునగిలిపొగడె.

ఈ క్రింది పద్యమల్లపాని పెద్దన పద్యపు పెత్తనకు తరవసిగ నున్నది. శయ్యాగారమున రాజు మృగాంకావళిని గాంచి ప్రేమించు సన్నివేశము.

ఉ॥ ఎవ్వరిదానవీవు హరిణేక్షణా,
 యెయ్యది నీకు పేరుని
న్నెవ్వ తెతెచ్చె చెప్పుమిదియేర్పడ
 బంటుగినన్ను చేలుమం
చవ్వసుధేశ్వరుం డతివహస్తము
 పట్టిన, పట్టిధైర్యముల్
ద్రవ్వకుకన్నులం గొనియదల్చి
 వదల్చెగరంబు దయ్యవల్ ॥—IV ౨౧.

కేయూర బాహుచరిత్రమున కవితా శైలి పోను పోను త్తర భాగమున మృదు మధురముగ నున్నదని పీఠికా రచయితలు వ్రాసిరి. దీనికి ముఖ్యకారణము రచనా విధానముకంటె కథా సందర్భము. కావ్య పూర్వభాగము చిన్న నీతి కథలతో గూడియున్నది. ఉత్తర భాగము శృంగారరస ప్రధానమైన చమత్కార కథా సన్నివేశములతో గూడియున్నది. రమణీయ కథా సందర్భము నాశ్రయించిన శైలి, పిట్టకథలందు నీతిబోధ సేయు పద్యముల గల శైలి నతిశయింప, చదువ చవులూరుచుండుట సహజముగదా. ఇందుచేతనే కవికృత కావ్యమున కథా ప్రసంగముననుబట్టి శైలి మారుననుసిద్ధాంత మిందు స్పష్టముగ గోచరించును. ఈ కవి వస్తు వర్ణనముననను, కథాకథనముననను, పాత్రల సంభాషణముననను, వచన రచననను గూడ ప్రతి మధురమైన శైలిని వాడును. ఎక్కడో యొక్కొక విడివిడి పద్యములనుబట్టి శైలిని నిర్ణయించుటకంటె, నొక్కొక్క సన్నివేశమును గ్రహించి వరుసగ కొన్ని పద్యములనుబట్టి కవి శైలిని నిర్ణయించుట సముచితముగ నుండును. ఈ కావ్యమున చతుర్థాశ్వసము నందలి కేయూరబాహు మృగాంకావళుల సన్నివేశము బహురమణీయము. పై రెండు పద్యములు నా సన్నివేశమందలివే. మృగాంకావళి రాజు హస్తమును వదిలించుకొని పోయిన తర్వాత రాజు విదూషకుని కలసుకొని తన యనుభవముల నిట్లు చెప్పుచున్నాడు.

సీ॥ నైతన్యమొందిన చక్కని చిత్రంబు;
 చిరునవ్వు మరిగిన చిగురుబొమ్మ,
నడిపాడ నేర్చిన నవకంపునుడీగ,
 మురిపంబుబూనిన విరులదొంత్తు,
వంకవాయగ పెట్టి వచ్చినత్రోవ్వల,
 పలుకభ్యసించిన పసిడిప్రతిమ,
నిలుకడచనసిన తొలుకారు మెఱుగద్ది,
 గైసేసితోచిన కాముసలుకు,
గీ॥ నాగనభిరాముముఖ నెలనాగయొక తె
మానవాంగనా సదృశంబుగాని రూపు
మహిమగలయది యూసుస్తిమందిరమున
కేకతమువచ్చియుండెగ నేనుగంటి॥.—IV. ౩౧

కం॥ తరుణప్రవాళరుచిరా
 ధరనవమాణిక్య పాదతలవ్రజలస
ద్వరణనఖనీల కచయ
 ప్వరంధ్రికమనోప్వ రత్నపుత్రికనోతల్॥
చ॥ మెలపునవాటి యూదుముగ [—IV. ౩౧
 మిాల విలాసముకోలి, వాలికం
దలనపుచాయమిాటి, చెలి
 దామర సేకుల తెంపునవ్వుచుం
గలువల కాంతిగైకొనక
 కాలు మెఱుంగుల బోలి నేత్రముల్
చెలువకునొప్ప మెత్తియపు
 జిప్పల పాటికెనింత పెద్దలై॥—౩౨.

కం॥ కమలాననకన్నులని
క్కమునకు దొనలోన బోలుచు కాముని శిత
బాణములనునట్లాకర్ణాం—
తములను భ్రూచాప సంశ్రితంబులనుటన్॥

ఉ॥ ఇంచుక నా పయింబొలసె, [—౩౩
నిండుకరావళి ముంచి తెచ్చి పై
వంచినమాడ్కి, మవ్వలను
పైచిన చాడ్పున, గల్వదండ సా
రించినలీల, దమ్మినిరి
త్రిప్పిన భంగి, పెలుంగుడీ గగ
ప్పించినమాడ్కి, వాలుజలి
పించిన కైవడి నింతి నేత్రముల్॥. (౩౪)

వ. ఆసమయంబున శేషునతలంబున
నాసీనుడైనవన్ను గదియజనుదెంచి. (౩౫)

చ॥ జలరుహగంధి తా మధుర
చారుసుధారస మద్ది నాదుకీ
నులజిలికించుచుం దనజ
నుంగవ మీదనెలుంగు నొక్కయు
జ్జ్వలతరహార వల్లి గరు
వంబున నామెడజేరి పైపైగో
మలకరపల్లవ ద్యుతిస
మాజము మత్తనువెల్ల పర్వగన్॥ (౩౬)

అయ్యవసరంబున,

చ॥ తనువెరుగందలంచి ప్రమదంబున
శాటీసరోరుహంబున
ట్టినగని రత్నసుందరికి గెందములో
డెఱలించు గోముల
ధ్వనినను బల్కి కన్నులవదల్చుచు
నాదుమనంబు తోనగ్ర
క్కునదన హస్తముం దిగిచి
కొంచరిగెన్ లలి తాంగి మెల్పుగన్॥. (౩౭)

క॥ అత్తఱిమను వెనుకన
నత్తరుణియదృశ్యమయ్యె నచ్చెరువు, వయ
స్యోత్తమ, యప్పటినుండియు—
జిత్తంబునసందియంపు జీకటిబడిరిన్॥

చ॥ కలయనునొక్కరుండె, కలగాదిది
నిక్కమయొక్క, నిక్కమున్
గలయును బొత్తునంగలయ
గాగిన దంద మొకో, నిజంబుగా
గలయను నేని నన్న యదికంకనము
హారము, నిక్కమైనన
క్కలికి వెడిందవాయి
దలిగన్నులసుందరి యేమిముందరన్॥ (౪౦)

వ॥ అని యిట్లు మదనవికార భ్రాంతి పూర్ణస్వాంతుడైన మేదినీ కాంతుంగను గొని సంతసిలుచు రత్నసుందరీ సౌభాగ్య గర్వాపహరణ క్రియాంచితైక పరాయణుండను నాచారాయణుండాత్మ గతంబున....(౪౧)

* * * *

* * * *

ఉ॥ హారము పెట్టుచోల భవనంగను
పోకిన యంగుళాగ్రముల్
భూరితపః ప్రభావ
ఘనపుణ్యఫలంబులుగా దలంచి, యం
భోరుహ నేత్రి రిత్తమెయిఁ
బొల్పలుచుం బలుమారు జూచుస
న్మేర ముఖారవిందమువఁ
జేర్చుకొనుం బుల కాంకితాంగిరై॥...౧౪౨

చ॥ విరహజ వేదనాభరము
పెమ్మగ డెందమువీడఁగన్ను నీ
రురువుగనుండె మద్దియ
మహోగ్రమనోభవ వహ్నియంగముల్
దరికొని కాల్పనందు సకలంబును
హార్పగ లావులేమిజే
వరమణుసర్పినుండెడు నివాసము
చేరియొనర్చు కైవశిన్॥... (౧౪౩).

మరియు.

శా॥ నాడెన్ మోము రసాలబాలలతికా
వాసంతికల్ చూచిగా
నోడెన్ గన్నులు పద్మగావోడఁగా,
నిట్టూర్పులత్త మావల్లికం
గూడెందాపము కీరకోలు
వసెంగోష్ఠీ విహారంబునా
టాడెందాలిమి మేనుడస్సెఁగడు
నయ్యంభోజ పత్రాక్షికిన్॥.

ఇక మందనకవి సంభాషణ శైలిగూడ హృదయరంజకముగ నుండును. ఇందులకు దాహరణముగా తృతీయాశ్వాసమున నొక పిట్టకథనుండె.

కం॥ ప్రియబంధు లెల్లవారును
లయ మొందిరఁ దాను జాల లాఘవికంబౌ
శ్రేయశీలనరై తిరిగెను
భయదర్శకమనగ నొప్పపామచొప్పటన్॥ ౧౮

కం॥ మండూకనినాదమువిని
నింకినపంతిపముతోడ నీరుండనిచో
నుండవిని యాదటనుదకము
లుండఁగఁగోలునని మేనసు మెక్కపలారన్॥.

మ॥ కదియుంజయ్యవవచ్చి నాగమచటం
గాంభీర్య సంపత్తికిం
సుదురైయుండెకు నాయి గాంచిమది
గోర్కుల్ చేకు సేకూఱలో
వుకు, వాత్సృష్టబుభుక్షు యిప్పాఁప నెసం
బుస్తున్నహోవ్యగ్రహ
స్పదదుష్కాలదినంబు సెల్లనిదటన్
సమ్యక్సుఖా వాసినై॥ (౧౯) .

కం॥ చెలువెడలఁ దెఱవుఁగానక
దరినుండుచులోనమండు దర్దుర నాథున్
బరిమిత పరిజనపరివృతు—
నిరవునమున్న తని జూచియిట్లనిపలికెన్॥

శా॥ దేవా, భేకకులాధినాథ, కరుణాదృష్టి
న్నన్నుం జూడవే
జీవంబుండదు నీరువట్టుకతనన్
శీఘ్రంబ నిం గొల్వరా
ద్రో వేదిక్కునఁగానవేర, మదిలో
దుఃఖంబునన్ ప్రుంగెదన్
నీవారిం గలయంగరాఁబనిచి
మన్నింపంగదే వేఁడెదన్॥

కం॥ మా పెద్ద లెలుకపాలక—
మీ పెద్దల కొగ్గసేసి మెలఁగుటరొల్లం
బాపికొనవలయు, ననునీ—
శ్రీపాదసమీపమునుండు చేరిచికొనవే॥

గీ॥ ఉరగసంఘంబులకుఁ గప్పలోడు లెల్ల
నీవు పుట్టుకమును గాని నీప్రతాప
మెరిగి రిక మిన్నక దొరయరాదరవకుంద్ర
చారుతరమూర్తి మండూకచక్రవర్తి॥

ం॥ హనుమంతునిం ప్లవంగం
బనిపిల్తురునిన్నుఁ బిలుతురా పేరనె, యిం
ద్రునిహరియందురు, హరియని
నినుఁ జెప్పదురనగ, వినుతినీకుందగదే॥

కం॥ అనితన్నునిట్లు పొగడిన
వినిమెలుచ్చంగ భేకవిభు పయ్యహికి
ట్లను వామంత్రు లయునమత
మునవినురప్పింతు నిలువుముదనునవచటన్॥

తిక్కన భారతమునందు రాజనీతిని కందపద్యములలో రమణీయముగ గూర్చినాడు. అట్లే పాంథిక నీతిని కేయూరబాహు చరిత్రమున మంచనకవి కంద పద్యములలో చేర్పుగ గూర్చినాడు. అట్టివి కొన్ని.

కం॥ వయవంశులు నిజకార్య
ప్రయోజనములకును జేయుపనులన్యులకూ
కయిసేసిరి వీరనుచుం
బ్రియమందగఁజేయుదురు ధరిత్రీశులు లై॥ II౪౦

కం॥ చెలిమి శిలాక్షర మెప్పుడు
నలుక జలాక్షరము సుజనులగువారలకున్
జెలిమి జలాక్షర మెప్పుడు
నలుక శిలాక్షరము కుజనులగువారలకున్ ॥III౭౯

కం॥ వృద్ధునకుదరుణి యమృతము
వృద్ధునితరుణికి నసహ్యవిషరూపింపన్
వృద్ధకుఁదరుణుండమృతము
వృద్ధయుఁదరుణునకసహ్యవిషరూపింపన్
III ౨౨౯,

కం॥ అతినిష్ఠయనాచారం
బతిశౌచము శౌచభంగి, యతినిందయతి
స్తుతి యిబిధూర్తుల విధముల
గతి మఱికైతవ్యంబు దుష్టకపటము దెలియన్॥

కం॥ అపగత వివేకులకుహిత
ముపదేశించుటయు, వారినొందుటయును నీ
తిపరులకొప్పదు...III ౨౬౫.

"సుమతి పగమేలు విమతి నెయ్యమున కంటె." III ౨౭౭.

కం॥ తగదొరుల నమ్మ నెప్పుడు
దగువారలనమ్మలేని దగుగాకమహిం
బగవారల నమ్మదగదు
పగవారలకంటె వలదుభామలనమ్మన్॥IV౯౨.

ప్రబంధములలో నుద్యానవిహారాది, వర్ణనలు వచనములో చేయబడినట్లే మంచనకవియు చేసెను,

ఈ వచనము ప్రబంధములందలి వచన రచనమును బోలినదై శైలి యతిని పద్యములందువలె మృదు మధురముగ నున్నది. ఇందుల కుదాహరణముగ ఆ IV. ౫౦.

"వ॥ మఱియుం దత్కాలంబున వికచారవింద వాసిత గండూష జలంబు లొండొంటి కిచ్చు కుండాల మిథునంబులుం గ్రీడాలవాలంబులగు కూలంబులుం గలిగి, పికిలిత యొలదూండ్ల నడికి చవి పట్టి ప్రియుల కొసగు చక్రవాకంబుల భాగ్య పరిపాకంబులం బోని పద్మాకరంబులును; సెసె వెలువులేని పూదేనియ జడింకోగి యసముకోల పర్జన్యకోల కెంకమత్తిల్లి నృత్యంబుసేయు మత్తకేకి కేకలకోడు భుజంగ కుటుంబంబులును; వలపలు వోయిన కతంబున రిత్తలైన సుస్త్రప్రేమ ధర పరిలిప్తంబులగు వనకేళిలోల బాలికా జనంబులకుం బరిరంభణ యోగ్యంబులగు చందన తరు సందోహంబులును; సుస్తులయెసె చిగుళ్ల వలనంత వేడిమింబోరలు కొంతేల యుసురు పొప్పులకు గొట్టికత్తెలు పుడికివందేటు వాటునకు సెరసు లేకుండ నాడికంబుగా వడినెట్టిన తావికుప్పలంబోలె నొప్పి పూచిన యశోక భూజాత పోతంబులును; సహకార కోరకాంకురములు గస్వనంగమిచి మేపి క్రొవ్వనం జెమ్మ పెరిగి నోరం గొలందులు గూయు కోడి దంపతుల సందడికి దొలగి, మధుర పక్వఫలంబులం బరితృప్తింబులై యొలయా వివిహాకలమీద సూకలుగొన ద్రాకిన సురిలింద పందియుల గొందులపందు వెసలి తోరగిన పూరేపం బొమ్మల గలుగు నీరంలుల లోన బ్రాగేశ్వరుల యొంఅకల యుసుకులం బారవశ్యంబుబూన జంచువు నంచులమీద నిడినిద్రించు రాచిలుకరాణి వాసంబులు నగుచు నత్యంత మనోహరంబగుచుండు."—IV ౫౦.

రచనా విధానము ప్రబంధ మార్గము ననుసరించినను క్రీ. శ. ౧౬వ శతాబ్దపు కావ్యములవలె నష్టాదశ వర్ణనలను కథలో గల్పించి, విస్తారముగ వసు చరిత్రాదులందువలె వర్ణించి, స్వల్పకథకు పుష్టినిచ్చి గ్రంథమును పెద్దదిగ జేయునాచారము మందవకవి కాలములో ప్రబలియుండలేదు. కావున దీన నష్టాదశ వర్ణనల కవకాశమును కవి కల్పింపక, తత్కాలాభిరుచియైన చిన్న కథలను కథలో చొప్పించి కావ్యమునకు పుష్టిగల్గింపవలసి వచ్చినది.



# వేణీసంహారము: కృతికర్త



శ్రీ బులుసు వెంకటేశ్వర్లు

వేణీ సంహార నాటక కర్తయగు భట్ట నారాయణుడును నన్నయభట్టునకు సాయపడిన నారాయణ భట్టును భిన్న వ్యక్తులా యన్న విషయమును ఏప్రిలు నెల భారతిలో ప్రస్తావించియున్నాను. తదనంతర పరిశోధనవలని ఫలితములు వీరిరువురు భిన్న వ్యక్తులు కారనుటకే తోడ్పడుచున్నవి. కాని, వామనాదులు వేణీ సంహార శ్లోకములు కొన్ని యుదాహరించియుండుటచే నన్నయ చెలికాడగు నారాయణ భట్టు కాలమునకు వేణీ సంహార కృతి కర్త కాలమునకు నొకటి రెండు శతాబ్దముల కాలము భేదము కావచ్చును. ఈ యొక్క ప్రతిబంధకము తక్క వీరిరువురు భిన్నులు కారనుటకు మఱే ప్రతిబంధకము కానరాదు. ఈ సందర్భమున మన నన్నయ మిత్రుడగు నారాయణభట్టు పితామహుడగు నారాయణభట్టే భట్ట నారాయణుడనుట చాల సమంజసమగును.

అసలు వేణీ సంహార నాటక కర్తయగు భట్ట నారాయణుని కాలమును గూర్చి పలువురు విమర్శకులు పలువిధముల యభిప్రాయములు వెల్లడించిరి. వంగీయ గాథలు గల "క్షితీశ వంశా వళీ చరితము"న నిట్లు గలదు.

"ఇతి శ్రుత్వా తేన బ్రాహ్మణేన సార్థం దూతాన్ ప్రేష్య బహుమానపురస్సరం భట్ట నారాయణ దక్ష శ్రీహర్ష ఛాందస వేదగర్భ సంజ్ఞకాన్... ఆనీయ నవనవత్యధిక నవశతీ శకాబ్దే ప్రాగుప కల్పిత వానే నివేశయామాస..." క్షితీశ. వంశావళీచరిత, పుట. ౨.

దీని ననుసరించి ఆదిశూరుడు భట్ట నారాయణాదులను ౯౯౯ శతాబ్దమున, అనగా క్రీ. శ. ౧౦౭౭ సంవత్సరమున దవకడ జేర్చుకొనెనని కదా! దీని నంగీకరింతు మేని యిదియే నన్నయభట్టు కాలము, నారాయణ భట్టు కాలము నగును. మఱి క్రీ. శ. ౮౫౦—౯౦౦ ప్రాంతము వాడని నిర్ధారింపబడిన వామనుడెట్లు భట్ట నారాయణుని నాటకమునుండి శ్లోకములుదాహరింప గలడు? అందుచే ఆది శూరుడు చేరదీసిన భట్ట నారాయణుడు వేఱు; వేణీ సంహార కృతికర్త భట్ట నారాయణుడు వేఱు—అనవలయును. కాని, నాడు, క్రీ. శ. ౮౫౦ ప్రాంతము వాడని విస్పష్టముగా నిర్ణయింప బడిన వామనాచార్యుడు తన కావ్యాలంకార సూత్ర వృత్తిలో (౪-౩-౨౮)

"వస్తుద్వయస్య క్రియయోస్తుల్య కాలయోరేకేన పదేనాభిధానం సహోక్తి సామర్థ్యాత్ సహోక్తిః ౧ యథా 'అస్తం భాస్వాన్ ప్రయాతః సహ రిపుభిరయం సంహ్రియంతాం బలాని.' (వేణీ. V. ౨౬.)" * అని వ్రాసిన వ్రాతయు, నాతడు సాధింపగన్న "సుభ్రుకిం సంభ్రమేణ" (వేణీ. ii. ౧౯.) "సంయమయితు మారబ్ధః" (వేణీ i. ౨౦) "పతితం వేత్స్యసి క్షితౌ." (వేణీ. iii. ౪౧.) అనురూపముల నుదాహరించుటయు ద్రోసిరా జనవలసి వచ్చును.

ఒక్క వామనాచార్యుడే కాక క్రీ. శ. ౮౪౦ ప్రాంతము వాడగు నానంద వర్ధనుడు, క్రీ. శ. ౯౫౦ ప్రాంతము వాడగు ధనంజయుడు వేణీ సంహార శ్లోకము లుదాహరించి యుండుటచే వేణీ సంహారకర్త యంతకు బూర్వుడే యైయుండ వలయును గదా!

ఈ కారణములచే నన్నయభట్టు సమకాలికుడగు నారాయణభట్టే భట్టనారాయణుడనుట కిది ప్రతిబంధకము. నారాయణభట్టు తాతయగు నారాయణ భట్టు వేణీసంహారకర్త యన్నచో నాతడొకటి రెండు శతాబ్దములు వెనకవాడై యుండవలయును గనుక కాల విషయకమగు ప్రతిబంధకము వైదొలగుచున్నది. నన్నయ మిత్రుడగు నారాయణభట్టు కాని, నారాయణ భట్టు తాతయగు నారాయణభట్టు కాని, నారాయణ భట్టు నామధేయుడే యీ వేణీ సంహార కృతికర్త యనుటకు గ్రింది యుదాహరణము ప్రబలాధారము. దీనినిబట్టి నారాయణభట్టు భట్ట నారాయణుడు లొక్కరే యనియు వేణీ సంహారకృతికర్త వంగీ

---

*శ్లో. కుర్వంత్వాప్తా హతానాం
రణశిరసి జనా వహ్నిసాత్దేహభారా
నశ్రూన్మిశ్రం కథంచిద్దదతు
జలమమీ బాంధవా బాంధవేభ్యః
మార్గంతాం జ్ఞాతిదేహాన్
హతనరగహనే ఖండితాన్ గృధ్రకంకై
రస్తంభాస్వాన్ ప్రయాత
స్సహరిపుభిరయం సంహ్రియంతాం బలాని
(వేణీ. ౫. ౩౬.)

యుడు కాని కన్యాకుబ్జ దేశస్థుడు కాని కాక యాంధ్రుడే యనియు స్పష్టముగా జెప్పవచ్చును.

క్రీ. శ. ౧౩౬౩ ప్రాంతమునకు జెందిన వల్లభ దేవుడు తన "సారంగధర పద్ధతి"లో ౧౭౩, ౩౯౭౨ ౩౯౮౧, ౪౦౭౩, ౪౦౮౧, ౪౦౮౫, ౪౦౮౬, ౪౦౮౮ అను అరు సంఖ్యలుగల శ్లోకములు "నారాయణభట్టు వేణీ సంహారమునుండి" అనియే పేర్కొనియున్నాడు. ఈ శ్లోకము లన్నియు వేణీసంహార నాటకమున గలవు. ఆతడే:

"ఉత్తిష్ఠంత్యారతాంతే
    భరమురగపతౌ పాణినైకేన కృత్వా
ధృత్వా చాన్యేన వాసో
    విగళితకబరీ భారమంసే వహన్త్యా
భూయస్తత్కాలకాంతి
    ద్విగుణిత సురతప్రీతినా శౌరిణావ
శ్శయ్యామాలింగ్య నీతం
    వపులరసలసద్బాహు లక్ష్మ్యాః పునాతు"

"అశ్వత్థామ ద్రోణి కృతాభిమన్యుని ధన
    ప్రోద్భూతి తీవ్రధ్రువః
పార్థస్యాకృతి శాత్రవ ప్రతికృతే
    రంతిస్సుచాసుహ్యతిః
కీర్ణాశాప్పకసైః పతంతి ధనుషి
    క్రీడాజడా ద్రుష్టయో
హా వత్సేతి గిరస్స్ఫురంతి నపున
    ర్నీయాంతి వక్త్రాద్బహిః"

అను శ్లోకములను సైతము నారాయణభట్టు వేణీ సంహారములోనివని యుదాహరించి యున్నాడు. ఇందలి పై శ్లోకమును "భట్ట నారాయణుని వేణీసంహారములోని"దని వల్లభ దేవుడు సుభాషితావళిలో పేర్కొనియున్నాడు. దీనినిబట్టియు భట్టనారాయణ నారాయణభట్టు లభిన్న వ్యక్తులని తేట తెల్లముకదా! మఱియొక విచిత్రముకలదు. పై రెండు శ్లోకములు మఱియొకచోట పేర్కొనబడి "నిశా నారాయణస్య, నిశానారాయణస్య" అని యుల్లేఖింపబడుట కలదు. ఈ నిశానారాయణు డన్న నర్థముకాక విమర్శకు లక్కరి దిక్కరైరి. నిశా నారాయణుడు భట్ట నారాయణు డన్నను నొక్కడే యని పై యుదాహరణమువలన స్పష్టము. ఇక, ఈ నిశానారాయణ నామ మీతని కెట్లు వచ్చినదని ప్రశ్న. దీనికే విమర్శకుడు సరియైన సమాధానము చెప్పలేక నిశాపద మీతడు నాటకమున బలుమారులు వాడియుండుటచే నీతనికి నిశానారాయణు డను పరిహాస నామము వచ్చినదని శ్రీ గజేంద్రఘట్కరు పేర్కొనిరి. దీని కాధారముగ బలువుర నోళ్లబడి ప్రశస్తి గాంచినదగు:

"జానే కోసపరాఙ్ముఖీ ప్రియతమా
    స్వప్నేఽద్య దృష్టావయా
మామాసంస్పృశ పాణిశేతిరుదతీ
    గంతుం ప్రవృత్తాతతః
నోయావత్పరిరభ్య చాటుకశతై
    రాశ్వాసయామి క్షణం
భ్రాతస్తావదహం శఠేన విధినా
    నిద్రాదరిద్రః కృతః॥"

అను శ్లోకమును రచించిన కవినామమే మరుగుపడి యాతనికి "నిద్రాదరిద్ర" కవి యనియే పేరు వచ్చినదనియు, ఆ పేరనే యీ శ్లోకమే "సారంగధర పద్ధతిలో" ౩౪౫౪ శ్లోకముగా నుదాహృతమైనదనియు నీవిమర్శకుడు పేర్కొనెను. కాని, యిది కేవలము సంగతముగ నే తోచును.

ఈ సందర్భమున మన నారాయణభట్టు గృహనామములను గుఱించి యాలోచించి దీనికిని దానికిని సంబంధము కలదేమో చూతము. భారత కృత్యాదిని నన్నయ వ్రాసిన పద్యమిది:

"పాయక పాకశాసనికి
    భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు దానుమధ
    రామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధు
    రంధరుడుం దనకిష్టుడుం సహా
ధ్యాయుడు నైనవాడభిమ
    తంబుగతోడయి నిర్వహింపగన్."

ఈపద్యమందలి "తానును" అన్నచోట "మారస" "వానస" "తానిపి" "తానిశ" మున్నగు పాఠాంతరము లెన్నియో తాళపత్ర గ్రంథములను బరిశీలించిన కొలదిని లభించు చున్నవి. దీనిని బట్టి నారాయణభట్టు గృహనామము "వానస" అని యాంధ్రకవి తరంగిణీ కృతికర్త. (పుట. ౧౨౪. సంపుటము ౧.) యూహించిరి. ఇట, "తా నిసిధరామర వంశ విభూషణుండు నారాయణభట్టు" అను పాఠము సమంజసమని మనము గ్రహించినచో నారాయణభట్టు "నిశా నారాయణు"డనియు ననగా నాతని యింటి పేరు నిశాశబ్ద తద్భవమగు నిసి వారనియు ననగా వారి యింటి పేరు చీకట్లవారనియు మనము తెలిసికొనవలసి యున్నది. తెలుగు దేశములో గోదావరి జిల్లా లోనే చీకట్ల వారు పలుజాతులవా రున్నారనియు, చీకట్ల నారాయణయను నామము నీతడు నిశానారాయణుడని సంస్కృతీకరించుకొనె నన్న నసంగతము కాదనియు తెలుగు గృహనామములనట్లు సంస్కృతీకరించుకొనిన తెలుగు కవులు పెక్కురు గలరనియు మా మిత్రులు "ఆంధ్ర రచయితల" రచయితలనగు శ్రీ మధుసా

పంతుల సత్యనారాయణ శాస్త్రిగారు నాయూహ బలపఱిచి యున్నారు. కావున, నారాయణభట్టు, భట్ట నారాయణుడు, నిశానారాయణుడు, నారాయణుడు నొకే వ్యక్తియొక్క భిన్న నామము లనియు మనము గ్రహింపవలయును. వల్లభదేవుడు తన "సుభాషితావళి"లో వేణీసంహారమునుండి శ్లోకము లుదాహరించి "భట్టనారాయణస్య" అని యుల్లేఖించుచు నొండొకట వేణీసంహారశ్లోకము నుదాహరించిరే "నారాయణస్య" అనియు పేర్కొనియుండుట యీ నిర్ణయమున కింకను బలకరము కాగలదు. ఈ విషయము లన్నియు బరిశీలించి సముచిత నిర్ణయ మొనరింప నాంధ్రవిమర్శకుల నభ్యర్థింతును.

వేణీసంహారకృతి ననుసరించి యే తత్కృతికర్త విద్యావివేక సంపద మనము తలపోసినచో నాతని మతశాస్త్ర విజ్ఞానాదులు మనకు గోచరించును. ఈతడు విష్ణుభక్తుడనుట నాటకమునం దెల్లెడ వెల్లడి యగుచున్నది.

"జయతి సనాశ్విగతాం
స్వనాభి రంధ్రోద్భవజగద్బీజః
దామోదరో నిజోదరగహ్వర
నిక్షిప్తనిఖిల జగదండః,1"
"జయతి సభగవాన్కృష్ణః
శేతేయః శేషభోగశయ్యాయాం
మధ్యేపయః పయోధే
రపర ఇవాంభోనిధిఃకృష్ణః2"

అనునాందీ శ్లోకములే కాక, "భగవతా సకల జగత్ప్రభవస్థితి నిరోధ ప్రభవిష్ణునా విష్ణునాద్యాను గృహీతం భరతకులమ్"

"తతః స మహాత్మా దర్శిత విశ్వరూప తేజస్సంపాతమూర్ఛితః మమభూయా కురుకులమ్" మున్నగు వాక్యములే కాక "దేవేన చక్రపాణినా" "భగవతో నారాయణస్య" "భగవాన్ పురాణ పురుషో నారాయణః" మున్నగు శబ్దము లీకవి యవ్యవ విష్ణుభక్తిని జాటుచున్నవి. ఇంతే కాక,

"కృతగురు మహదాది
క్షోభ సంభూత మూర్తిం
గుణిన ముదయనాశ
స్థాన హేతుం ప్రజానామ్
అజ మమర మచింత్యం
చింతయిత్వా భవంతం
భవతి జగదదుఃఖం
కింపునర్దేవ దృష్ట్వా*"

మున్నగు తావుల నవకాశము లభించినపుడు తన యిష్ట దైవమగు విష్ణుమూర్తిని మనసార ధ్యానిం

---

1. "శ్రీదామోదర దైవతంబుభువన
శ్రేణీమహా ధారము
ఖ్యాదేశంబు స్వనాభిరంధ్రమహితో
ద్యచ్ఛ్లోక బీజంబునా
భీదేశాంతర సంప్రతిష్ఠితమహా
విశ్వాండ భాండంబుసం
హ్లాదాంభోనిధి స్వప్రకాశమునది
వ్యక్తోన్నతియై వెల్గుతన్."

2. "క్షీరాంభోనిధి మధ్యమందుగృపతో
శేషాహి పర్యంకమం
దారూఢుండయి చిద్విలాసమున బ్ర
హ్మానంద సంతోషస
త్పారావారమునంగ నెన్నలరుసం
భద్వేణు విద్యాకళా
పారీణుండగు కృష్ణదేవుఁడుజగ
త్ప్రాణత్కుఁ డేపారుతన్."

---

* "గురుమహదాది వృత్తులొన
గూడిన మూర్తిని సర్వసృష్టి సం
భరహర హేతుభూతు నజా
భావని కందని వాని నెన్నఁడున్
మరణము లేని నిన్ను నొక
మాఱు తలంచిన మాత్ర దుఃఖముల్
తొరఁగు నటన్న దర్శనవుఁ
దోయధి మున్గినఁ జెప్ప నేటికిన్."

"స్థిరమై యొప్పెడి నిర్వికల్పక సమా
ధిన్ బుద్ధులన్ నిల్పుదు
స్తర దుర్వార తపోగుణంబు విపుల
జ్ఞానంబునఁ ద్రోచియా
తీర్థరమల్ గాంచెడి జ్ఞానమూర్తిని దురా
త్మ క్రూరదురోర్మహుండా
కురుగాఁజెట్లు గ్రహింప నేర్తుఁగను వై
కుంఠాత్మకగా గృష్ణునిన్."

చును. "భవతు భగవద్భక్తిర్విఘ్నం వినా పురుషోత్తమే" అన్నదే యీ కవి యాదర్శము.

"ఆత్మారామా విహితమతయో
నిర్వికల్పే సమాధౌ
జ్ఞానోద్రేకా ద్విఘటితతమో
గ్రంథయస్సత్త్వనిష్ఠాః
యం వీక్షంతే కమపి తమసాం
జ్యోతిషాం వా పరస్తా
త్తం మోహాంధః కథమయమముం
వేత్తి దేవం పురాణమ్"

ఇత్యాది శ్లోకము లీకవికి పంచరాత్రాగమాది విజ్ఞానము నారాయణీయాది శ్రుతి స్మృతి జ్ఞానము కలదని తెల్పుచున్నవి. మఱియు నీతనికి యోగ సాంఖ్య వేదాంత శాస్త్ర పరిచయము గాఢముగా గలదనియు దీనివలన మనమూహింపవచ్చును. కర్మమీమాంసాదులలో నీతనిద్వితీయ విజ్ఞానియని

"చత్వారో వయమృత్విజః సభగవాన్
కర్మోపదేష్టా హరిః
సంగ్రామాధ్వర దీక్షితో నరపతిః
పత్నీ గృహీత వ్రతా
కౌరవ్యాః పశవః ప్రియా పరిభవ
క్లేశోపశాంతిః ఫలం
రాజన్యోపనిమంత్రణాయ రసతి
స్ఫీతం యశో దుందుభిః"
("నలువుర మేము ఋత్విజు
లనన్ హరియే యుపదేష్ట, ధర్మజుం
డలరును సోమయాజియయి
యాలువు నీవును సోమిదమ్మవున్
ఖలులగు కౌరవుల్ పసులు
కొంత పరాభవ దుఃఖశాంతియే
ఫలము, నరాధిపాళి బిలు
వంగను మ్రోగెడు గీర్తి దుందుభుల్.")

మున్నగు శ్లోకములవలన మనకు వెల్లడి యగుచున్నది. ఇంతేకాక, యీ నాటకమందలి మనోహరాలంకారములే కవికి గల యలంకార శాస్త్రనిష్ణాతత్వమునకు గొప్ప నిదర్శనము. యుధిష్ఠిరుడు దుర్యోధనుని వెదకించుటలో వేగువారికి జాలరులకు, భటులకు జెప్పిన మాటలవలన నీకవి చక్కని రాజనీతిజ్ఞుడని విశదమగుచున్నది.

భట్ట నారాయణుడు వేణీసంహారము కాక యితర గ్రంథము లేమి రచించెనో వేణీ సంహారము నుండి మనకు దెలియరాదు. కాని, యింత పాండితీ విలసితమగు మహానాటకమును రచించిన చతురకవితా సంపన్నుడితర గ్రంథములను రచించియుండ డనుకొనుట సమంజసము కానేరదు. "భట్ట నారాయణస్య కృతి మభినవం వేణీ సంహారం నామ నాటకం ప్రయోక్తు ముద్యతాః స్మః" ('భట్ట నారాయణస్యాభినవ కృతిం') అని పాఠాంతరము. (*Grills Edition Of Veeneesamhara*) ఇను మూర్తి ధారోక్తివలన నిది భట్ట నారాయణుని యభినవకృతియని స్పష్టము. దీనినిబట్టి యీతని యితర కృతులు గలవని చెప్పవచ్చును.

తగిన ప్రమాణములు లేనప్పుడు తొందరపడి నిర్ణయములు చేయుట ప్రమాద హేతువగును. కాని :

"భట్ట నారాయణకృతం పూర్వవృత్తాంత దర్శనమ్
అప్రాప్య దండిరచితం హరిశర్మాప్యలీలిఖత్."

(దశకుమార చరిత్ర. అనుబంధము. పుట ౧౫౫. బొంబాయి సంస్కృత గ్రంథమండలి. ప్రచురణము.)

అను నాధారము దండి రచించిన పూర్వదశకుమార చరిత్ర లభింపనందున భట్ట నారాయణుడు రచించిన పూర్వ వృత్తాంత దర్శనమును హరిశర్మ వ్రాసికొన్నాడని తెలుపుచున్నది. దీని ననుసరించి మన భట్ట నారాయణుడే దశకుమార చరిత్ర పూర్వ భాగమును వ్రాసి యుండవచ్చునని శ్రీ గజేంద్ర ఘట్కరు తమ దశకుమార చరిత్ర టీకలో వ్రాసియున్నారు. ఇది చింత్యముగనే యున్నది.

మన నారాయణభట్టే భట్టనారాయణుడని మన మంగీకరించినచో నాతడు సంస్కృతమున భారత కథను వేణీ సంహార నాటకముగను, దానినే కన్నడ భాషలో భారత కథగను రచించెననియు నన్నయ భట్టారకున కాంధ్ర భారత రచనమున దోడుపడెననియు స్పష్టమగును. అనగా మహాభారత సంహిత యన్న నీతనికి ప్రాణమనియు దానిని మూడు భాషలలో మూడు విధములుగా రచించి కాని తృప్తి నందలేదనియు మన మూహించుట సత్యమునకు సన్నిహితవిషయమే కావచ్చును.

ఇంతకు దేలిన దేమన : భట్ట నారాయణుడు—నారాయణభట్టు, నారాయణుడు, నిశా నారాయణుడు—అను పేళ్ల వ్యవహరింపబడి యుండెననియు, అతడాంధ్రదేశీయుడగు నారాయణభట్టే కానియున్నాడు కానోపుననియును, వేణీసంహార శ్లోకము లుదాహరించిన భోజదేవుడు (క్రీ. శ. ౧౦౦౫-౧౦౫౪) క్షేమేంద్రుడు (క్రీ. శ. ౧౦౨౫—౧౦౭౫) మమ్మటుడు (క్రీ. శ. ౧౧౦౫) విశ్వనాథుడు (క్రీ. శ. ౧౩౫౦) మున్నగువారును, వంగదేశీయగాథయగు "క్షితీశవంశావళీ చరితము"ను, రాజేంద్రలాల్ మైత్రా నిర్ణయమును వేణీసంహార కృతికర్త క్రీ. శ. ౧౦౫౦ ప్రాంతము వాడగుటకు ప్రతిబంధకములు కావేరవు. అపుడు భట్టనారాయణుడే నారాయణభట్టని రూఢిగా నిర్ణయింప వనువగును.

ఈ నిర్ణయమునకు ప్రతిబంధకముగ వేణీసంహార శ్లోకము లుదాహరించిన వామనుడు (క్రీ. శ. ౭౭౦-౮౦౨) ఆనందవర్ధనుడు (క్రీ. శ. ౮౪౦—౮౭౦) ధనంజయుడు (క్రీ. శ. ౯౫౦) వీరి కాలములు పై నిర్ణయమును బాధించుచున్నవి. వీరిని బట్టియే విల్సను పండితుడు వేణీసంహారము క్రీ. శ. ౮, ౯ శతాబ్దములలో బయలు వెడలినదనియు, జూలియసు గ్రిల్లుదొర క్రీ. శ. ౬, ౭ శతాబ్దుల నడిమినదనియు వనుకొనిరి. వేణీ సంహారకర్త బాణుని సమకాలికుడని మేక్స్ ముల్లరు అభిప్రాయపడెను.

ఈ పరిస్థితులలో నాంధ్ర చరిత్రజ్ఞులు విమర్శకులు నీ విషయమును గూలంకషముగ జర్చించి తేల్ప సమర్థులు. నారాయణభట్టు కాలము నొకటి రెండు శతాబ్దులు వెనుకకు నెట్టినచో నీ కాల ప్రతిబంధకము తొలగిపోవును. నారాయణభట్టు తాత నారాయణభట్టనియు నాతని పేరే మనుమనికి వచ్చినదనియు జెప్పిన దోషము లేదు. నందంపూడి శాసనమును బట్టి నారాయణభట్టు తాతకూడ మహావిద్వాంసుడని మనకు దెలియును. కావున నారాయణభట్టే వేణీసంహార నాటక కృతికర్తయగుటసత్యమని నా విశ్వాసము.



# తుమ్మెద పెండ్లి



శ్రీ కొడాలి వెంకటరాజారావు

౧

తేకువిచ్చిన గులాబీ కన్నెముచ్చట
విందుచేసినది కమ్మందనాల
వయసువచ్చిన మల్లెపడుచు రెక్కలువిప్పి
కమ్మతావిడెను చక్కందనాల
కొలనునిల్చిన గొజ్జకలువ పుప్పొడిగంధ
మందించి మురిసె తియ్యందనాల
ముసుగుతీసిన స్నిగ్ధముగ్ధమందారమ్ము
స్పందించె మధువు చిక్కందనాల
తుమ్మెదల జంట పెండ్లికై తొలివసంత
మున, మనోహర శోభావిభూతి తనరు
నవలతోద్యానవనము మన్మథవిహార
దివ్యసుందరశాల మా తెలుఁగునేల.

౨

కుతుకచాచిన కోజు కూనలూదెనుమించి
వేళ తెలిపెడి బాకాలజోడు
ఫలవృక్షములగోరువంకలు శుకములు
వాయించె వరుస నౌబత్తురీతి
ఎలమావి కొమ్మపై నిలచికోయిల-కన్నె
స్థాయినిల్పినది సన్నాయిపాట
నెమలిబోగము సాని నిగిడి పింఛమువిప్పి
కురిసె నృత్యము చేసి భరతశాస్త్ర
భంగిమలు, పెండ్లి వారలు పొంగిపోవ
ఎంతటి అదృష్టమో కద! యీ వసంత
శోభ 'గ్రమ్మిన వనలక్ష్మి చూడవచ్చె
తానుసైతము పెండ్లి ముత్తైదువట్లు'

3

జిల్లేడు పూలు తెచ్చిన తేనెకాన్కలు
చదివింపబడె పెండ్లి సమయమందు.
మాలతీలతలు సన్మాన మిచ్చుతలంపు
తీరిక పూలపందిళ్లు వేసె
పూతపూసిన క్రొత్తమూతమ్ము సైతమ్ము
పికజాతి తరిమినిల్చినది మధువు
సంపెంగవిరులు ద్వేషమువీడి పూసిరు
నలది నిష్కపట సఖ్యత విలార్చె
పేర్మి, తుమ్మెదజంటకు-పెండ్లి నాడు
సర్వశోభాయమాన వసంతఋతువు
లీల నిటువంటి ఘను పెండ్లిండ్లు చేసి
నిలుపుకొన్నది పరువు మా తెనుఁగునేల.
ఒకపూవు మెకనెక్కియున్న పెండ్లికొమాడు
డింకొక్క పూమెక నెక్కియున్న
పెండ్లికూతురుపైన విసరుపుప్పొడి ధూళి
తిరిగి సిగ్గున వాని తిరిగిచూడ
కుండనే పెండిలికూతురు పుప్పొడి
బుక్కాముచల్లిన పుసమిసడిమె
గడుసు పెండిలికుమారుడె గెల్చెచివరకు
వయసుతక్కువ పెండ్లి పడుచె యోడె
తుమ్మెదలజంట, పుప్పొడి చిమ్ముకొనియు
నొకరిపై నొక్కరీరీతి ప్రకటపరచె
మెదలలో దాగియున్న సమ్మదము వెలికి
కనులపండువ చేసి ప్రేక్షకుల మనసు.

# పుష్పాలు - ప్రేమికులు - పశువులు



శ్రీ మునిపల్లెరాజు

౧

అప్పుడే కలిసిన వానతో నేలంతా సుగంధ వేళ్ల వాసన కొడుతున్నది. ఆకాశంలో మళ్ళీ రాజ పుటానా జాగీర్లకువలె చీలిపోయి మెల్లు కదులుతున్న మబ్బులూ, నీటి బరువుతో తూలుతూ, మెల్లగా వీస్తున్న గాలీ, సోమరిపోతు చుట్టపొగలాగా నల్ల మేఘాలూ, నిండుగర్భిణి నడకతో మబ్బుల కౌగిలింతల్లో సిగ్గుపడుతూన్న సాయంత్రపు సూర్యుడూ, ఎదురుగా ఏడు రంగుల ఇంద్రచాపమూ.

జమీందారు శివనాథం గారు మేడ రెండో అంతస్థు బాల్కనీలో, పట్టెవేళ్లతడికెలు దాటి, పిట్ట గోడదాకా వచ్చి కిందికి చూశారు. పక్కనే అక్క కొడుకు మధు వున్నాడు—చక్కని అసలు మైసూరు సిల్కు పైజామాలమీద గళ్ల కాశ్మీరీ పొడుగు కోటుతో.

శివనాథంగారు సింహద్వారం వేపు చూశారు. అక్కడ పందిరిపని ఆపి, అతిథిగృహం—"వాణీ విలాస" ముందుచేరి కబుర్లు చెప్పుకుంటున్నారు కూలి వాళ్లు. ఆయనకు చిన్న కోపమూ, వాన చినుకులు కదిలించిన మొగలి మొగ్గలమీది సువాసనా ఒక్క సారిగా వచ్చి తగిలినై. ఆయన ముక్కోపపు అల మళ్ళీ పుట్టినంతలోనే మాయమైపోతుంది.

"చూశావా, అమ్మాయి సాయంత్రం బండికి వస్తుంది. వీళ్ళింకా పందిరే వెయ్యలేదు. ఇంకా తోరణాలు కట్టేదెప్పుడు? లైట్లు అమర్చే దెప్పుడు? ఎందుకే తల్లీ, యింత రాద్ధాంతం అంటే సంధ్య వింటేగా? చెల్లి రాక రాక వస్తున్నది. ఈ మాత్రం అలంకరణ కూడా లేకపోతే ఎట్లా అని మారాం చేస్తుంది."

మేనమామగారి మాటకు మధు కొంచెం వులిక్కిపడ్డాడు.

"యివ్వాళ సాయంత్రమా వచ్చేది...? అయితే మన ప్లిమత్ కార్లో దివానుగారు వెళ్ళారేమో కలెక్టరుగారి కోసం...?"

"అయితే నేం? ఫోర్డులో వెళ్ళి సంధ్య అప్పుడే స్టేషన్లో మకాం వేసిందిగా!!"

జమీందారుగారి నవ్వు 'వాణీవిలాస' గోడల చాటునవున్న పనివాళ్లకు చక్కగా వినిపించింది. వెంటనే వాళ్ళు పనికి వుపక్రమించారు.

"అయితే నేనూ వెళ్తాను - స్టేషన్ దాకా. పాపం, సంధ్య ఒక్కతే వున్నదేమో"—అని మధు శివనాధంగారి ముఖంలోకి చూశాడు.

మేనమామగారి నిండు పెదిమలనుండి చిరునవ్వు జవాబుగా వచ్చింది.

"ఏమో నబ్బా - నాకు నమ్మకం లేదు. నువ్వు గాని సంధ్యగాని ఛాయను గుర్తుపట్టగలరా నేను లేందే? నేనూ బయలుదేరుతున్నాను పదండి-లావణ్యను తీసుకొని..."

పెద్దకూతురు లావణ్య రాదని ఆయనకు తెలుసు. అయినాగూడా అలా అన్నారు మాటల ధోరణిలో-ఆత్మతృప్తికోసం.

౨

మెయిల్ రావటానికి ఇంకా అరగంట ఆలస్య ముంది. సంధ్యారాణికి వెయ్యి ఆలోచనలు—అరగంటంత పొడుగ్గా వుంది ప్లాట్‌ఫారం. రైలులైను అవతలి వేపున యిసిక దిబ్బలమీది సరివితోటల్లో మిణుగురు పురుగుల సంకేతాలు. అరగంటలో మెయిలు వస్తుంది. మెయిలు...తను బుద్ధెరిగిన తర్వాత చూడని చెల్లెలితో మెయిలు వస్తుంది... మెయిలు.... చెల్లి. సంధ్యారాణికి నమ్మకం కుదరటం లేదు...తన చెల్లి... తన అస్పష్టపు భావాల్లో...తన అవ్యక్తపు బాల్య స్మృతుల్లో మాత్రమే నిలిచివున్న చెల్లెలు...యీ మెయిలులో నేనా వచ్చేది?...వస్తుందా?

ఛాయను తన వూహాలో చిత్రించుకోటానికి ప్రయత్నించింది. పెద్ద నల్లటికళ్లూ...నవ్వే సన్నటి పళ్లూ... యివి తప్పితే ఛాయ వూహకు అందలేదు. తనకు ఒక చిన్న సంగతి మాత్రం జ్ఞాపకం వుంది. ఛాయ—పెత్తండ్రిగారింటికి పెంపుడు పోకముందు, తల్లి బ్రతికివున్నప్పుడు, తనకు ఏడెనిమిదేళ్ళప్పుడు... అంటే పదిపన్నెండేళ్ళ కిందటిమాట......రోజూ తనకూ, ఛాయకూ, అక్క లావణ్యకూ మధ్య జరిగే గులాబిపూల పోటీలు...! ఒకళ్ళకు తెలీకుండా ఒకళ్లు

తెల్లవారుజామునే నిద్రలేచి, అమ్మకూడా ఎర క్కుండా, దాసీలు వాళ్లు మేలుకోకముందే, పొగ మంచులో తడుసుకుంటూపోయి, గులాబీ గుబుర్ల దగ్గర కలుసుకోవటం...ఎప్పుడూ ఛాయదే(శీ...తవది చుక్క......అక్కడ అందరూ నవ్వుకోవటం... ఛాయవి ఎంత అందమైనకళ్లు....! నవ్వేటప్పుడు ఆ పళ్లు కూర్చిన సన్నముత్యాలై...ఈ పదిపన్నెం డేళ్లలో ఎంత మారిపోయిందో....!!?

లావణ్య నవ్వేదికాదు. తను ఓడిపోయావని ఏడుపు మొదలెట్టేది. లావణ్య అప్పటికీ యిప్పటికీ అంతే. ప్రతి స్వల్పవిషయానికీ అన్ని రాద్ధాం తాలు కల్పిస్తుంది. అబ్బ—మనుషులకు అంతెంత కష్టం. దానికి తగిన మొగుడే దొరికాడు. ఎప్పుడూ నాన్నగారిని వుబ్బించి, మోసంజేసి డబ్బు కాజేయ టం. లావణ్యకు తృప్తి అనేది లేదు. అందరికీ సంతోషం, ఆహ్లాదం కూర్చే విషయాలుకూడా దాన్ని కదిలించలేవు. పిన్ని ఒకతె దొరికింది... యింకేంగావాలి?...అహర్నిశలూ గుసగుసలూ, సక పకలూ, మాటలు, పోటీలు...యీసులూ...వాళ్ళ ప్రపంచానికి సరిహద్దులు అవ్వే...ఆ సొమ్ములూ, చీరెలూ, దాసీల పొగడ్తలూ, దొంగ గౌరవాలూ.

ఛాయ వస్తుందని తెలిసినా వాళ్ళిద్దరికీ చీమ కుట్టినంతకూడా లేదు. పోనీ, పిన్నికి (పేమలేక పోవచ్చు. ఎంత పిన్ని అయినా సవతితల్లి అమ్మ కాదుగదా...! కాని...లావణ్య...!!! లావణ్య... తనుతోపాటు ఒక్క తల్లి కడుపున పుట్టిన లావణ్య.. దానికి బొత్తిగా లేదు. అది ముగ్గురిలోనూ పెద్దది. జీవితానుభవం గలది. తల్లిపోయింది...అమ్మ!... అమ్మ లేదు...పది పన్నెండేళ్ల తర్వాత మొదటి సారిగా వస్తున్న ఛాయను ఆదరించవలసిన బాధ్యత దానిది. అమ్మలేని చిన్న చెల్లి...కాని చిన్నప్పటి లావణ్య ఏమీ మారలేదు...ఆ యేడుపు, ఈర్ష్య, గర్వమూ...కాని అమ్మ...అమ్మే వుండకూడదూ... అమ్మ జ్ఞాపకం వస్తుంది. కళ్లు చెమ్మగిల్లుతాయ్... అమ్మే వుంటే తన్ను యిట్లా ఒకతైనూ పోనిచ్చేదా? ఏ పదిమంది దాసీవాళ్ళనో యిచ్చి...నాన్న ను తరిమి వుంచేది కాదూ?

* * *

మధువచ్చి ఆ అనంత (ప్రవాహానికి ఆనకట్టగా నిలుచున్నాడు. తన వాడైన మధు !!

చక్కలిగిలి...చిన్నప్పుడు ఛాయకూడా యిదేవరస. ఎప్పుడూ వాళ్ళిద్దరూ ఒకటి...లావణ్య కలిసేదేకాదు.

"యిదుగో నిన్ను యిటువంటి పనులే చేయ వద్దని చెప్పేది...మాట్లాడ కేమండీ...మిమ్మల్నే... ఓ రాణిగారూ......!"

తనకు నవ్వు వస్తున్నది. అబద్ధపు కోపాన్ని నిజమని దాపెంచుకు మధు చేసే వ్యర్థప్రయ త్నాలు చూస్తుంటే.

"నేను "గారిని" కాదని లక్షసార్లు చెప్పా నండీ"

"నేను అండీని కాదని..."

"అండీ కాకపోవచ్చు గాని మొండీమాత్రం అవుతారు"

"మొండివాళ్లు దొంగలకన్నా ఎప్పుడూ నయ మేగా"

"దొంగలు యిలా ప్రత్యక్షంగా కనపడరు. ఆదీ గాకుండా దొంగతనంలేని దొంగలుంటారా?"

"మరి మాతో చెప్పకుండా, రాత్రిళ్లు చలి గాల్లో కాళ్లు తీసికెళ్లేవాళ్లో...?!"

మళ్ళీ చక్కలిగింతలు...

"అదుగో నాన్నగారు కూడా వచ్చారు..."

## 3

సన్నగా, పొడుగ్గా అప్పుడే కింతాకులపు మబ్బుల్లో స్నానంచేసి వస్తున్న దేవకన్యలాగా, తెల్లని బెనారస్ సిల్కు చీరమీద బుట్టచేతుల ముఖ మల్ జాకెట్టుతో ఛాయ...మొగల్ రా కుమార్తెలను మరిపిస్తూ...మెయిల్ నించి దిగింది. తోడుగావచ్చిన దాసీ, పురోహితుడూ ముందుదిగి జవాన్లు అంది స్తున్న సామాన్లు సర్దుకొంటున్నారు. జమీందారు గారు, పన్నెండేళ్ల కిందట తన అన్నగారింటికి దత్తతపోయిన చిన్నకూతురు లలాటాన్ని స్పృశిం చారు. శిరసుమీద కేశాలుసర్దుతూ ముద్దిడుకొన్నారు. ఛాయ వంగి వ(మతతో నమస్కారం చేసింది.

"సంధ్యక్క..." నవ్వింది. ఎంత చక్కటి నవ్వు! చిన్నప్పటి ముత్యాల పళ్ళవరస...తన సన్నటి చేతుల్తో అక్క నడుం చుట్టవేసింది.

"లావణ్య అక్కేదీ...?"అన్నది చుట్టూచూసి.

"రాలేదు...దానికి ఒంట్లో బాగులేదు."

"ఔను...నాకు...తెలుసులే."

ఇద్దరికీ ఒక్కసారిగా నవ్వొచ్చింది. కొంచెం దూరంగా కోటుజేబుల్లో చేతులతో మధు అక్క చెల్లెళ్ల వంక చూస్తున్నాడు.

"మధు బావను బొత్తిగా మన్నెరగవుగా?" శివనాధంగారి సగం ప్రశ్న.

ఛాయ బరువు కనురెప్పలు ఒక్కసారి ఆశ్చ ర్యంగా పైకిలేచి కిందికి వాలాయ్. ఆ పెద్దకళ్ల పిస్గ ప్లాటుఫారం లైట్లమీద ప్రసరించటం మధు గమ నించక పోలేదు. ఛాయ తలమీది పమిటె లాక్కొని కాళ్లో అక్కపక్కనే కూర్చొన్నది.

## ౪

శుక్లపక్షం వచ్చింది. పోయింది. ఆదివారాలు, కాలపు అడుగులేని గర్భంలో కలిసి సోమవారాల సాయంత్రపు జ్ఞాపకాల్లో మాత్రం నిలిచివున్నై. ఎన్నో నిన్నలు. కాని పన్నెండేళ్ల ఎడబాటును ఈదిన, అక్కా చెల్లెలూ తమ సంభాషణల అంతు చూడలేకపోతున్నారు. బాల్యక్రీడల స్మృతుల నెమరులో, తావులేని వర్తమానం, అదృశ్యమైవున్న భవిష్యత్తూ గూడా తమ ప్రాధాన్యతను పోగొట్టుకొన్నై. పుస్తకాలూ....కళా....పిన్ని......లావణ్య...... నాట్యం......బాల్య స్నేహితులు...కన్నీళ్లు...... నిరాశ......అమ్మ...పెద నాన్న...నాన్న...... మధు...ఆ సంభాషణల చుట్టూ తిరుగుతున్నారు.

ఎన్నేళ్లో లావణ్య కుళ్ళు మాటల్లో, పిన్ని తిట్లల్లో గడిపిన సంధ్యారాణికి కలల్లోని చెల్లెలు కొత్త జగత్తును సృష్టించి తెచ్చింది. గులాబీల పరిమళాలు, మాటల శోభకు అతీతమైన మలయమారుతమూ యీ కొత్తలోకపు సింహద్వారాలై ఆహ్వానిస్తున్నై. ఈ కుళ్లూ, యీ సామాన్యత, ఎన్నో లోపాలూ... అన్నీ వెనకటి కథలు. ఇప్పుడో...తన హృదయ కవాటాలన్నీ విప్పి యిప్పుడు చెల్లికి చూపగలదు. చావులేని తన కలలను మాటల్లోకి మార్చి చెబితే... సానుభూతితో విని ఆనందించి, ఓదార్చగల చెల్లి. తెలివిగల చెల్లి. ఎవరిపరిహాసానికి దూరమై ఇన్నేళ్లూ వ్యర్థపుచ్చావని విచారించిందో...ఆ చెల్లెలు...... ఛాయ ఒంటరిగా పెరిగినపిల్ల. కాని యిక్కడో తన అక్క...తను, దీర్ఘ చలికాలపు రాత్రుల్లో రగ్గుల వెచ్చదనంకింద పడుకొని ... కన్నీళ్ళు కార్చుతూ ... ఆలోచించి ...ఆలోచించి...అలసి నిద్రించే రోజుల...అక్క ...ఏదో అవ్యక్తమై, అదృశ్యమై యిన్నాళ్ళూ తనలో దాగివున్న అక్కమీది అనురాగం ... అక్కకు హత్తుకుపోయి ... మళ్ళీ ఎన్నడూ ఎడబాటులేకండా...యిట్లా...ఎప్పుడూ ....యీ చిన్ననాటి తోటల్లో ఆడుకొంటూ....ఆ పొదరిళ్ళలో దాగులుమూతలాడుతూ... చెరువుగట్లూ జాజి మొక్కలూ...యీ నీడా...అబ్బ...అక్క వుంటే చాలు...! పెదనాన్నగారి శిష్టాచార నాగరికతనుండి....నవ్య సంస్కారం పుట్టినదే...నాన్నగారింట్లోనే తావుంటుంది. అక్కయ్య...తనూ... ఒకటిగా...ఎప్పుడూ...

"నాన్నగారూ పెదనాన్నగారూ పన్నెండేళ్లయిందట మాట్లాడుకొని..."

"నాన్నగారు సీమ వెళ్లొచ్చి ప్రాయశ్చిత్తం చేసుకోలేదట...అసలు తగాదా అక్కడే వచ్చింది."

"నాన్నగారు సంస్కారప్రియులు"

"పెదనాన్నగారు అంత కటువుగా కనబడతారు గాని వారి హృదయం నవనీతం లాంటిది. దేశీయతంటే వారి కంత మమకారం! నన్ను యింగ్లీషు చదువుకోవద్దని శాసించారు—సంస్కృతంలో పంచకావ్యాలూ, వీణె, భరతనాట్యం..యివ్వే మన నాగరికతకు సంప్రదాయాలకు చిహ్నాలని...నాకు వీటినే... నిత్యమూ వుపాధ్యాయులచేత నేర్పించారు..."

"అయ్యో, నాన్నగారైతేనా ? యిక చెప్పేదేముంది? అంతా దొరల తతంగం. పేర్లన్నా, సాహిత్యమన్నా ఎంత యిష్టమని. వారి గ్రంథాలయం నిండా యింగ్లీషు, బంగాలీ పుస్తకాలు తప్పితే— యింకోటి లేదుగా. అసలు మన పేర్లు చూడు... సంధ్య...ఛాయా...రూ......"

"లావణ్యా...లావణ్య పేరు చెప్పవేం..."

"........................"

"లావణ్య మనతో ఎప్పుడూ కలియదు... నేను వచ్చి రెన్నాళ్లు కావస్తోన్నయి కదా...యింతవరకు ఒక్కసారైనా సరిగ్గా పలకరించిందీ?"

"అబ్బ, దాని కుళ్లు ఎప్పుడూ...అంతేలే..."

"నీకు జ్ఞాపకం వుందీ చిన్నప్పుడూ...... "

"అహ్హా...హ్హా......"

"అమ్మ చచ్చిపోయే ముందు నాన్నగారిని పిలిచి అన్నదట...'లావణ్య తెలివిగలది. అది బతక నేర్పరి. మీరు సంధ్యనూ ఛాయనూ వెయ్యి కళ్ళతో పెంచాలి—' నాన్నగారినుండి అలాగే వాగ్దానం తీసుకొన్నదట. నాన్నగారికి పట్టుదలలు జాస్తి... చివరకు పెదనాన్నగారే నామాటలకు సడలి నన్ను వెళ్ళి చూచిరా అమ్మా అని పంపేరు గాని..."

"మధుకు అంతసిగ్గు. మొన్న అంటున్నాడు— ఛాయ అంత చక్కగా డాన్సు చేస్తుందని తనకు తెలీదట."

సిగ్గు ఆవరించగా, కాటుకలాంటి తన నల్ల కళ్లను కిందికి వాల్చింది.

"అబ్బ...మధు ఎన్ని సిగిరెట్లు తాగుతాడని ? ఒకటయిపోగానే మరొకటి !"

ఛాయ మాట్లాడలేదు. సంధ్య చెబుతున్నది. తేలిపోతూన్న కళ్లు దూరాన ఏదో ఆశనో అమృతాన్నో చూస్తున్నట్లుగా...సన్నని ఎర్ర పెదిమల వంకల్లో చిరుచెమటలు...

"మధు తిరిగి కాలేజిలో చేరడట. నాన్నగారు అమెరికా పంపిస్తున్నారు—యింజనీరింగు కోర్సుకు."

రాబోయే రోజుల కలల్ని సంధ్యముందే వూహించుకొంటున్నది. మధు అమెరికాకు బయలుదేరకముందే తమ పెళ్లి నిశ్చయిస్తారు నాన్నగారు... అంతదూరం బాబూ....మధును ప్రతిరోజూ ఒక్క

పుత్తరమన్నా వ్రాయమని చెప్పాలి...వచ్చేఏడు మధు...తిరిగివచ్చి...తనను గూడా అమెరికా తీసుకెళ్ళేట్లుగా...నాన్నగారిచేత..... చెప్పించాలి...... అబ్బా......నాన్నగారితో ఎట్లా చెప్పటం...సిగ్గేస్తుంది...

పెళ్లిమాట చెల్లికి చెబుదామని పెదిమలమీదికి వచ్చింది...

మధు మాట వచ్చేసరికి...తరవాత చెప్పొచ్చులే...చెల్లిని వదిలి తను అమెరికా వెళ్ళాలంటే... మధు అశ్రద్ధ మనిషయ్యె......అజాగ్రత్తలవల్ల...... ఆరోగ్యం పాడుచేసుకుంటాడు......

౫

లావణ్య నవ్వు చాలా అరుదైనది. నవ్వితే, అది ఎవరిమీదనైనా విరుచుకుపడటానికో లేక కసి తీర్చుకొనేమాట లనడానికో......ఈ సంగతి జమీందారుగారి పూళ్ళో, యింట్లో ఆబాలగోపాల మెరిగిన విషయం...

"ఒసే, గంగా! ఆ సన్నజాజిపూలన్నీ ఎవరికే ?"—

లావణ్య పెదవులమీద విషపుచిరునవ్వను అనుభవం గల దాసీ గంగ వెంటనే గమనించింది.

"చిన్నమ్మగారు తెమ్మన్నారు—" ఇంకా అక్కడ వుండటం ప్రమాదమని గంగకు తెలుసు.

తూర్పు వేపు వరండాలో పరిషియన్ రగ్గుమీద—సంధ్య, ఛాయ సన్నజాజిమాలలు గుచ్చటం తలుపు చాటునుండి చూసింది లావణ్య. అక్కడ్నుంచే సంధ్యకు వినబడేట్టుగా—"పిన్నిగారూ,... ఓ పిన్నిగారూ...నిన్నటించీ అనుకొంటున్నాను, ఆ సన్నజాజిపూలు గిల్లించుదామని" అన్నది.

పిన్ని కంఠం—"అయితే యిప్పటేం మించిపోయిందీ!...గంగను పంపి గిల్లించు."

సంధ్య గ్రహించింది. ఈ మనుషులది ఎంత వక్రబుద్ది! ఈ సిల్కుచీరెల కింద, యీ నాజూకు జాకెట్ల కింద, యీ ఆడంబరపు అందాల కింద ఎంత నల్లని హృదయాలు !!

"నేను కోయించానండీ పిన్నిగారూ! ఛాయా, నేనూ దండలు కడుతున్నాం" అని తను తిరిగి కేకేసింది.

లావణ్య మెలికల మనస్సు అంత చక్కటి సూటి జవాబును ఓర్చ లేకపోయింది. వరండాలోకి, ముఖం చిటమట మాడ్చుకుంటూ వచ్చింది.

"అవునా, ఛాయా నువ్వూ పంచుకుంటే చాలుగా. ఆ పచ్చ చామంతులుగూడా అన్నీ అట్లాగే వున్నై. వాటినిమాత్రం ఎందుకు వదిలావో? ఛాయ పెట్టుకుంటుందేమో"—ఆ చూపులోని ప్రతి కిరణంలో, ఆ మాటల్లోని ప్రతి అక్షరంలో, పొల్లులో, ఆ పెదిమల వంకర్లలో ఈర్ష్య, అసహనం పుట్టిపడుతోంది. ప్రతిధ్వనిస్తోంది. నగ్న నాట్యం చేస్తోంది.

ఛాయ అక్కడ ఒక్కక్షణం కూర్చొనలేదు. గిరుక్కున తిరిగి మెట్లు దిగిపోయింది—సన్నజాజుల్ని రగ్గుమీదనే వదిలి. ఛాయ కళ్ళల్లో ముత్యాల్లాగా కన్నీళ్లు కదలటం సంధ్య గ్రహించకపోలేదు. తనేమి చేయగలదు? లావణ్యవేపు రోషంగా ఒక్కసారి చూడటం తప్పితే ??

* * * *

దిగులుగా, తోటపక్క చెఱువులోని చలనం లేని నీళ్లను చూస్తూ ఒంటరిగా కూర్చొనివున్న ఛాయ—అరగంటసేపటికి గాని తిరిగి కనిపించలేదు. రాకరాక వచ్చిన చెల్లి, మళ్ళీ తనలాగానే యీ కుళ్లు వాతావరణంలో చిక్కుకొని యిలా మూగగా బాధ పడటం !

"ఇదిగో చిట్టీ! నీకు యిదివరకే చెప్పలే? లావణ్య మాటల్ని మనం లెక్కచెయ్యకూడదు. దాని కుళ్ళుతో అదే బాధపడుతుంది. మనకేం నష్టం ?" చూస్తూండగానే ఛాయకళ్ళల్లో నీళ్లు నిండినై.

"అక్కా..." అని సంధ్యమెడను గట్టిగా పెనవేసుకొన్నది - సంపెంగ కొమ్మను పాకి పెనవేసుకొన్న గోధుమ త్రాచులాగా.

"అయితే...సంధ్యక్కయ్య ! నీకు బాగా ఈత వచ్చునన్నావే"

"అవును...వాళ్లందరికన్నా.

"నాకు బొత్తిగా రాదు"

"ఓసి...అదెంత పని ? నీకు రొండురోజుల్లో ఈత నేర్పుతాను. ఈ చెరువులో నేనూ, లావణ్య, మధూ అనేకసార్లు పందాలు కట్టి యీదాం. మనుకు లోతంటే మహాభయం. అసలు ఆమూల ఒక సుడి వున్నది. అటువేపంటే రానే రాదు. ఇకలావణ్య? నాలుగు గజాలకన్నా...."

ఏ సంభాషణలోనైనా సరే మధును తగిన స్థానంలో యిరికించకపోతే సంధ్యకు తృప్తి వుండదు.

లావణ్యమాట ఎత్తగానే ఛాయ—అప్పటిదాక నాగస్వరం వింటోన్న పాములాగా ముగ్ధురాలైవింటున్నది ఛటుక్కున—"అబ్బ—ఆకుళ్లు ముచ్చుమాట నాముందు ఎత్తకు—అయితే, నాకు రొండురోజుల్లో వస్తుందంటావా ?"

"ఓ!"

"అయితే నాకు రేపు నేర్పాలమ్మాయ్!"

"ఎల్లుండికి మధుకన్నా నువ్వే బాగా ఈదగలవ్"

"దూర్తాంగా"

*            *            *

౬

మధు పుట్టినరోజు పండుగ.

ఉదయానే శివనాగంగారి చురుకు అజమాయిషీ క్రింద తలంట్లూ, ఫలహారాలూ, బ్రాహ్మణ సత్కారాలూ ముగిసినాయి. మధ్యాహ్నం విందు.

మధు అమెరికా వెళ్ళేముందు, బహుమతిగా, అనుక్షణ స్మృతికై తను యివ్వదలచిన చేతిగడియారపు గొలుసూ, ముత్యాలు పొదిగిన బంగారపు గుండీలూ, అతని "అరవప్రాణం" గోల్డుఫ్లేకు సిగిరెట్టు టిన్నులూ, అన్నీ పెట్టెలోంచి పెళ్లగించింది సంధ్యారాణి.

మధు పుట్టినదినం పండక్కన్నా మంచి అదను దొరకదు—యీ బహుమతులకు. అంతగా అయితే అమెరికా ప్రయాణ మప్పుడు యింకేవైనా వస్తువులు, మంచివి చూడవచ్చు.

తోటలో ఒక్కడే మధు కూర్చొని వుండగా, నక్కి నక్కి, వెనకగా వెళ్లి వాటిని ముందు వుంచింది.

"అ...రే...ఛాయా....సంధ్యా....సంధ్యా! నేను సిగరెట్లు మానేశానుగా—బొత్తిగా తాగనని వాగ్దానం గూడా చేశాను."

కొంచెం చిన్నబోయింది సంధ్య.

"ఎవరికి ?"

మధు కొంచెం బిత్తరపోయినట్లుగా కనిపించాడు.

"ఎవరికేమిటి ?......నాకే...నేనే వాగ్దానం చేసుకొన్నాను."

"ఛేస్...ఛేస్...ఇన్నాళ్లనుంచీ నేను పోట్లాడగా, పోట్లాడగా యిప్పటికి వదిలిందన్నమాట... యీ సిగరెట్ల మత్తు."

"అరే...యీ గొలుసు గూడా...యింత ఖరీదైన గొలుసు యిప్పు డెందుకుకొన్నావ్ ? నిన్ననే కొత్తది కొనుక్కున్నానే...అంటే...కొనుక్కోలేదనుకో...ఆ యిచ్చిన వాళ్లు గూడా యిట్లాగే హఠాత్తుగా..."

"ఎవరన్నావు మధూ !" అని మధు ముంజేతి మీది చొక్కా మడతను పైకి తీసింది. చక్కని ఫ్రెంచి గొలుసు.

"ఎవరిది మధూ యీ బహుమతి ? నీ యిష్టాయిష్టాలన్నీ తెలుసా ఏమిటి వాళ్లకు ?"

"అబ్బే...ఎవరూ లేదు...నిన్ను వుడికించటానికి అలా అన్నాను గాని అసలుకొన్నది నేనే."

సంధ్య అతని కళ్ళల్లో కళ్ళుంచి చూసింది. మధు వెలా వెలాపోయి కళ్లుకిందకు వాల్చుకొన్నాడు. కాని కొంచెం విసుగుదలతో—

"యీ గుండీలు ఎన్ని డజన్లున్నాయో నా పెట్టెలో, ఎందు కివన్నీ ?" అన్నాడు.

ఎన్నాళ్ళనుండో, మధురంగా వూహించుకుంటూ యీ శుభదినానికై, కోరి దాచి వుంచిన యీ అందమైన వస్తువులు! కిందటి వేసంగిలో తనూ, మధూ బెంగుళూరు వెళ్ళినప్పుడు మెచ్చుకొన్న బహుమతులు !!

సంధ్య కళ్ళ నీళ్ళు గిర్రున తిరిగినై. తనవాడైన మధు ఏమిటో యిలా మాట్లాడుతున్నాడు.

౭

దిగులుగా సంధ్య అంతా గమనిస్తోన్నది గాని మధులో ఏదో పెద్ద మార్పు, చిన్న మార్పు వచ్చింది. మన్ను దిన్న పామువలె మాట్లాడక కూర్చుంటాడు. వెనక ప్రతిసాయంత్రమూ క్లబ్బుకు వెళ్లేవాడు—నలుగురు మెంబర్ల టెన్నిస్ క్లబ్బుకు. ఇప్పుడు అదీ లేదు. తోచనప్పుడు కాల్చిన సిగరెట్లు, లేక తనతో కబుర్లు. అన్నీ ముందు ఆలోచనలు. కాని యిప్పుడో? ఏమాట వచ్చినా "అబ్బ ముందు ఆలోచనలు చేయకు సంధ్యా—" అని మందలింపుగా, బరువైన విసుగుతో త్రోసి వేస్తాడు. ఇంత హఠాత్తుగా సిగరెట్లు మాని వేశాడు. కావాలని ప్రయత్నంతో తనను తప్పుకొని తిరుగుతున్నట్లుగా తోస్తున్నది.

సంధ్యకు అర్థంకాలేదు. ఎవరితో చెప్పుకొంటుంది? తన హృదయంపైన యీ కొత్త బరువు, యీ కుంగదీసే మధు దిగులు—ఎవ రర్థం చేసుకోగలరు? ఛాయ ఒక్కతే తన కా యింట్లో ఆప్తురాలు. ఛాయకన్నా చెబితే హృదయం తేలికపడుతుందేమో. పాపం, దానికేం తెలుసు, వట్టి అమాయకురాలు. అసలు తనింతవరకూ మధును పెళ్లిచేసుకోబోతున్న సంగతి ఛాయకు చెప్పలేదుగా. యివ్వాళ చెప్పాలి. సాయంత్రం "వాణీ విలాస"లో వుత్తరాదినుండి వచ్చిన మణిపురి నటకుల నాట్యప్రదర్శనం. అక్కడకైనా మధును తీసుకుపోవాలి.

మొదట ఛాయను వెతుకుతూ పోయింది. ఇందాక పూలుగుచ్చుతోంది. ఏదీ యిప్పుడు? దానికి పూలంటే ఎంత యిష్టమని?!

"గంగా! చెల్లిని చూశావా?"

"లేదమ్మగారూ ! యిందాకట 'గ్రామఫోను' పట్టించుకొని తోటయింట్లోకి వెళ్లారు."

తోటయింటికి దక్షిణంగా వెళ్ళాలి. దానికి రెండువేపులా పెద్ద వరండాలు. వేసంగుల్లో చల్లద

వానికై శివనాథంగారి హయాంలో కట్టించిన బంగళా అది.

సంధ్య వెతుకుతూ వెళ్ళింది. ముందు వరండాలో గాని, ప్రక్కన గదుల్లో గాని, మధ్యహాలులో గాని ఎక్కడా కనిపించలేదు ఛాయ. బయటి వెనుకపక్క వరండా చూడకుండానే, తిరిగి పోతూండగా ఛాయే, గులాబిపొదల పక్కనే పాలరాతి అరుగు మొగన ఎదురొచ్చింది.

"చెల్లీ...నీకోసం వెతుకుతున్నాను."

"..................."

"భరతనాట్య ప్రదర్శనానికి రావా యేమిటి?"

ఛాయ మెల్లగా "వస్తా నక్కా!" అంది.

"గ్రామఫోను పట్టించు కెళ్ళాలటగా..అదేదీ?"

ఛాయ తన చూపుడువేలును బయటి వరండా వేపు నిర్దేశించింది.

"మనం ఫోంచేసి తయారు గావాలి. వాణీవిలాస వేపు అందరూ అప్పుడే బయలుదేరుతున్నారు. నువ్వు పద, నేను గంగచేత ఫోను పట్టించుకొస్తాను." సంధ్య బయటి వరండా వేపు దారితీసింది.

అరే...మధు.

పడక కుర్చీలో కాళ్లు చాచుకొని, కళ్లు మూసుకొని పడుకొనివున్నాడు మధు. పక్కనే నల్లటేకు బర్మా టేబిల్ మీద గ్రామఫోను. దానికి ఆనించి యిన్ని హిందీ రికార్డులు. హిందీ రికార్డు లంటే మధు చెవి కోసుకుంటాడు. సైగల్ పాటలన్నీ ఏరి ఒక మూల పేర్చేవాడు.

అ వేమిటి? కాయితాలు. మధు వేమో. అంత చిందరవందరగా యెందుకు పారేస్తారు? అన్నీ చిత్తు కాయితాలు. అది....ఏదో వుత్తరంలావుంది. సంధ్య పరికించి చూసింది. వుత్తరం కాదు. నిరంజన్‌మల్ కంపెనీ, బంగారంవజ్రపు పనివాళ్ల బిల్లు. ఒక వైనాఫాషన్ బంగారపు చేతిగడియారపు గొలుసు (రాళ్లతోసహా) రెండువేల అయిదువందల రూపాయలు." ఆ కింద తెలుగులో ఎవరిదో చిన్న దస్తూరి. "నువ్వు సిగరెట్లు తాగటం జొత్తుగా మానెయ్యాలి." సంతకం లేదు. నిన్న మధు అన్న గడియారపు గొలుసు యిదేనేమో. ఏ స్నేహితులు యిచ్చివుంటారబ్బా?

"అరే....సంధ్య....భలే........ఎంతసేపయిందేమిటి నువ్వొచ్చి?"

సంధ్య వెనక్కు తిరిగి లేచింది. మధు కళ్లు నులుముకుంటూ కుర్చీనుండి లేచాడు.

"ఇవ్వాళ వంట్లో ఏమీ బాగులేదు సంధ్యా! ఇక్కడకొచ్చి చూశాను. ఈ కుర్చీ ఖాళీగా వుంది. అంతే ఎప్పుడు పడుకొన్నానో...ఏమిటో..."

సంధ్య కుర్చీ రెక్కమీద కూర్చొని అతని గుండీలు సర్దింది. కాలరు సరిచేసింది.

"నిన్న.....నాన్న గారు......దివానుగారితో చెప్పగా విన్నాను. మన...పెళ్లి శ్రావణమాసం వెళ్లగానే స్థిరపరుస్తారట మధూ!" సంధ్యను కన్యలకు సహజమైన సిగ్గుతెర ఆవరించింది. మధు భుజంమీద తల ఆనించి, తన జడను ముందుకుపడునట్లుగా జారవేసింది.

"అబ్బ!...అంత తొందరేమొచ్చింది? నేను అమెరికా వెళ్ళివచ్చిందాకా వుంటే మునిగిపోయేదేమున్నది?" అతని ముఖంలో చికాకు విస్పష్టంగా ప్రతిబింబిస్తున్నది.

సంధ్య చలించింది. తనవాడైన మధు అన్న మాటలేనా యివి? ఈ శ్రావణం వెళ్లటం కోసం... ఎన్ని యుగాల వేదన, ఎన్నెన్ని తపస్సులు, ఎన్ని తపస్సుల నిష్క్రమణకు నిరీక్షణ!! తనకు తానై మధు యిదివరకెన్ని సార్లన్నాడు? "మన పెళ్ళి నేను అమెరికాకు వెళ్ళకముందే జరగాలని."

ఆ మధు...ఏడీ? ఈ చికాకు...యాతప్పకు తిరిగే మధు. సంధ్య తన చెవులను నమ్మలేదు. కాని యిది సత్యం. అమెరికా వెళ్ళి అక్కడ ఒక సంవత్సరం గడిపినతర్వాత, తనను కూడా మధు తీసుకెళ్తానని చెప్పినమాటలు...యిప్పుడూ? అవ్యక్తమై, మాటల కందని వేదనతో కఠిన సత్యం ముందు నిలిచింది. ఎన్నో ఆశల నిరాశగా, ఎన్నో మధుర స్వప్నాల తర్వాత పీడకలగా, ఎన్నో పున్నమలు గడిచిన అమావాస్య కాలరేయిగా, నిశ్శబ్దపు భయంకరయాతనై యీకఠిన సత్యం తనముందు, పరిష్కరింపబడలేక, పరిష్కరింపబడక నిలిచివుంది. నిలిచివుంది నగ్నంగా. నిలిచివుంది విషపు నవ్వుతో. "మధు తనవాడేనా?"

౭

చెఱువు అనటంకంటె దాన్ని సరస్సు అనటం సమంజసం. అది తరతరాలనుండీ జమీందారుగారి కుటుంబానికై ప్రత్యేకించబడివుంది. మొన్నమొన్నటి దాకా, దానికి మరామ్మత్తులు లేవు; కాని పిల్లలు ఎక్కువచ్చినతర్వాత వాళ్ళవత్తిడి వల్ల శివనాథంగారు, సరస్సువిషయమై కొంత శ్రద్ధ తీసుకొనక తప్పిందికాదు. దానితో గట్టు మీదిదట్టమైన చింతచెట్లు కొన్ని, నాగుజెముడుపొదలు కొన్ని శుభ్రంగా తుడుచుకొని పోయాయి. మెట్లువున్న మూడు వైపులా తప్పిస్తే, నాలుగోవైపున తెల్ల తామరలూ, ఎర్రతామరలూ, వత్తుగా పరచుకొని ఆకులతో ఆ మూలనంతటినీ కప్పివేసినై. తామరపూలను పండగరోజుల్లో మాత్రమే కోయటం అలవాటుగా, కుటుంబాచారంగా వస్తా

వుంది. కిందటి సంవత్సరమే మధు రంగుచేపలు రక రకాలవి తెచ్చి వేశాడు. దూరంగా మూడువేపులా వున్న కంచె, బయటివాళ్లకు—లోపల చెరువొక టున్నదన్న స్ఫురణనుగూడా తెలియజేయనీదు. అందుకని సంధ్యదాన్ని "దేవ సరస్సు" అంటుంది.

౬

దేవ సరస్సులో నీళ్లు తొణికిసలాడటం లేదు. మధ్యాహ్నపు బలవంతపు నిశ్శబ్దంలో, పడమటకు తిరిగిన ప్రొద్దు ఒక్కటే లోతు నీళ్లతో పరిచయం చేసుకొంటున్నది.

సంధ్య అనుకొంటున్నది—

"మధు తిరవాడేనా ?"

చెరువులో నీళ్లు పైమట్టంకింద చల్లగా, మృత్యువుకంటె చల్లగా, మధు కల్పించిన నిరాశగా, శరీరానికి తగులుతున్నై.

ఛాయ—

"ఎందు కక్కా...అట్లా వున్నావ్ ?"

"............"

"మాట్లాడవూ ?"

"............"

"ఏమి టాలోచిస్తున్నా వక్కా !"

తను మాట్లాడగల స్థితిలో, మనః స్థిమితతో వున్నదా? ఛాయ గూడా అక్కడ లేకపోతే, జీవితం యింకెంత నిస్పృహగా వుండేదో!......నిజానికి మధు - తన హృదయంలో అంత గాయం చేస్తున్నానని గ్రహించక అలా అనివుంటాడు......ఇంకో అర గంటలో రాడా? మళ్ళీ వస్తాడు...నవ్వుతూ కుమాపణలు వేడుతూ. - అన్నీ...దిగుస్లూ...పిచ్చి ఆలోచనలూ మళ్ళీ మరిచిపోయి, తనూ తనవాడైన మధూ...!!

ఒక్కసారి పుష్పినలాగా సంతోషం వచ్చింది సంధ్యకు.

"చూశావా ? నీవప్పుడే మునిగి యీదటం గూడా నేర్చుకొన్నావ్!" అన్నది చెల్లెలు ఛాయతో.

ఛాయ, తన విద్య మరొకసారి జయప్రదంగా ప్రదర్శించటానికి, నీళ్లలో మునిగి తేలి, ముఖంమీది చుక్కల్ని తుడుచుకొన్నది—"నా కింకా ఆ మూల లోతునీళ్లలోకి వెళ్లటమంటే భయంగా వుందక్కా !"

ఛాయ సన్నటినవ్వు గట్టుమీది చెట్లకొమ్మల్లో యింకా సన్నగా ప్రతిధ్వనించింది. సంధ్య తిరిగి చూసేసరికి, అప్పుడే పదిగజాలు యీదుకుంటూ పోయింది. సంధ్య తనకూ మధుకూ జరిగిన ఈత పోటీ లను స్మృతికి తెచ్చుకొంటున్నది. లోతునీళ్లంటే భయపడే మధును, ఎన్నిసార్లు తను ఆ వేపుకు తీసు కెళ్లింది? ఎన్నిసార్లు...నీళ్లకింద ఒకళ్ళ దేహాలు ఒక ళ్ళకు తాకుతూ...

"అక్కా !...అక్కా...యిటు చూడవూ ?"

ఛాయ సన్నటి నడుం! కాశీమజిలీ కథల్లో బంగారపు చేపలాంటి రాచకన్నెవలె యీదుకుంటూ, మున కుతూ తేలుతూ!

"అదుగో...మళ్లీ ఏమిటో ఆలోచిస్తున్నావ్ ?"

ఈమాటు సంధ్య పూరుకొట్టింది.

"తామరపూలు...సంధ్యక్కా !"

"కాదు...అవినీటి పారిజాతాలు."

"పారిజాతాలా ?!!! యింత చక్కగా..."

ఛాయ ఆశ్చర్యంగా చూడటం, ఆ చక్కని పలు వరస-మళ్లీ మధు దిగులును మరిచిపోయింది సంధ్య.

"సంధ్యక్కా !... పారిజాతాలంటే...జ్ఞాపక మొచ్చింది. పెదనాన్నగారికి పారిజాతాపహరణం లోని పద్యాలన్నీ వచ్చు..."

"మరి నీకూ..."

"ఔను నాకు గూడా వక్కా. నా కెన్ని పద్యాలు నేర్పారని. ముఖ్యంగా సత్యభామ... అలక..."

సంధ్యకు చెల్లెలి మాటల మీద నవ్వు వచ్చింది.

"అసలు...సత్య...భామ..."

ఇక సంధ్య నవ్వాపుకోలేక పోయింది. పుక్కిటనీళ్లు యిద్దరూ వెదజిమ్ముతున్నారు. సంధ్య అన్నది.

"ఇప్పుడు......ఈ చెరువుమధ్య నువ్వట్లా నుంచొని నాకు సత్యభామ అలిగిందని చెబు తూంటే...నిజంగా కృష్ణుడి జలక్రీడలు...నువ్వు సత్యభామలాగా వున్నావ్...నిజం!......చెదిరిన ముంగుర్లూ తడిసిన గుడ్డలూ...ఆ బంగారపు మెరిసే గాజులూ'"

ఛాయ గూడా తన డొక్కలు పట్టుకొని పెద్దగా నవ్వటం ప్రారంభించింది.

"పోదూ...నువ్వు గూడా నన్నాటలు పట్టిస్తు న్నావ్...సంధ్యక్కా...!

"ఉహూఁ! నే నన్నంత మాత్రంలో సత్య భామనైనావా నువ్వు ?...అసలు నీకు క్రిష్ణుడొక డుంటేగా...? మళ్ళీ నువ్వు.

ఛాయనవ్వు మళ్లీ..."ఏం లేకేం...యీ పారి జాతాలు కోసింది నాక్రిష్ణుడికే..." ఛాయకళ్లు ఎక్కడో తేలిపోతున్నై.

"ఓహో...ఎవరు ?"

"మ...ధు..." ఛాయ చటుక్కున నాలిక కరచుకొన్నది. వాన జల్లులాగా పిగ్గువచ్చింది.

కళ్లువాల్చింది. తిరిగి నీళ్ళలో మునిగింది. పారిజాతాలు పైకెత్తి పట్టుకొని.

కాని సంధ్య నవ్వు ఆగిపోయింది. సన్నని కనుబొమలు విభ్రమతో ముడివడ్డాయి.

మధు...

తనవాడైన మధు......

తన స్వర్గంలో నలకూబరుడు తన స్వప్నాల్లో నాయకుడు...

చెఱువు...యీ దేవ సరస్సు...పారిజాతాలను, శ్రీకృష్ణుణ్ణీ, సత్యభామను సృష్టించిన దేవ సరస్సు—రంకులరాటం తిరిగినట్లుగా తిరుగుతోంది. ఆకసం చెఱువులో అల్లకల్లోలాన్ని ముద్దెట్టుకోటానికేమో క్రిందికి దిగివస్తోంది. బలవంతంగా తామరాకుల్ని పక్కలకు తోసేస్తూ, చిన్న అలలు కల్పిస్తూ ఈదుకుంటూ పోయింది ముందుకు.

"అక్కా—అటు సుడి వున్నదంటి వే...నేను గూడా రానా...?"

సమాధానం లేదు. అప్పటికే సంధ్య చాలా దూరం పోయింది.

"అక్కా.... నేనూ...వస్తూన్నా...నువ్వక్కడే నిలు...ఆ లోతు దాటించిందాకా..."

ఛాయ అక్క కోసం ముందు చూడలేదు. ఆ దిక్కుగానే నీళ్లలో పాయలు చేసి, మునుగుతూ తేలుతూ ముందుకు యీదుతోంది.

"అక్కా...యిక్క...డ లో...తు"

"—..............—"

"సం....ధ్య...కా...! ...ఈ లో...తు నాకు...అందటం....లే...దు."

సంధ్య మెడతిప్పి ఒకసారి చూసింది. గిరుక్కున అటు వేపు తిప్పుకొన్నది.

"అమ్మో... సం...ధ్య...కా!...నే...ను ...ము...ని...గి పో...తు......అ...మ్మో...!!"

సంధ్య కదలలేదు. వెనుదిరిగి గట్టు పట్టుకొని మరోసారి చూసింది. అప్పటికే ఛాయ తెల్లని భుజాలు నీటిమట్టం క్రిందికి జారిపోతున్నాయ్. పైకి తేలిన పారిజాతాలు, దేవసరస్సులో మానవులు కల్పించిన తరంగాల్లో నీటి వాలుకు కొట్టుకుపోతున్నై. నాలుగయిదు నీటిబుడగలు మాత్రం పైకి తేలినై. నీటిబుడగలు...జీవితాన్ని, దాని అంతాన్ని స్మృతికి తెస్తూ, ఎవరో దేవత దుర్భరణపు వ్యధతో, ఆమెకు ఎన్నేళ్ళో ఆసనంగా వున్న ఉద్యానపు పాలరాతిశిల కరిగి కార్చిన కన్నీటిబొట్లుగా...నీటిబుడగలు... నాలుగైదు పైకి తేలినై.. అంతే!

## ౧౦

ఊళ్ళో హృదయంగల వాళ్ళందరూ చెప్పుకొన్నారు.

"ఆ చుప్పనాతిపిల్ల లావణ్య చెరువులో తోసిందట"

"పాపం"

"ఆ రెండో పిల్లసంధ్యకూ, యీ చచ్చిన పిల్లకూ...జంట...కవల జంట...పాపం! సంధ్యారాణి కుంగిపోతోన్నదట దుఃఖంతో"

"ఏం వినాశకాల మొచ్చిందమ్మో...ఆ లావణ్యకు"



# తీర్పు

★



శ్రీ కలపటపు రామగోపాలరావు

ఆ కేసు మహేశంగారికే విచిత్రంగా తోచింది. రాజమహేంద్రవరం లాంటి మహాపట్నంలో చోరీ నేరాలకి కొదవని కాదు. తన అయిదేళ్ల మేజస్ట్రేటు గిరీలోనూ రకరకాల గొడవలు చూశాడు. ముద్దాయి అడడవడం కూడా ఆయన అనుభవంలో కొత్తకాదు. అయితే, "దండం దశగుణం భవేత్" అన్న పద్ధతిలో 'పీనల్ కోడ్' వొప్పుకున్నంత శిక్షలు విధించుకుంటూపోయాడే గాని, నేరానికి వేరే కారణాన్ని గురించిన జిజ్ఞాస యెన్నడూ బాధించలేదాయన్ని. ఏ షికారుకి వెళ్లినప్పుడో, సంధ్యాలంకరణలోని గోదావమ్మ ముందు గుండె కొట్టుకెక్కి అలాంటి ప్రశ్న లేగినా, "సంచితకర్మ", "డబ్బు పాపిష్ఠి" అన్న సంజాయిషీలతోబాటు తన బ్రతుకులో పతనాలు స్ఫురించేవి. చటుక్కున యింటికెళ్లి, భగవద్గీత పారాయణతో, మళ్ళీ తెల్లారితే మామూలు దినచర్యకి మనస్సు సంబాళించుకునేవాడు. కాని, యిప్పుడీ 'గంగమ్మ కేసు'లో—

చోరీ అయినది డబ్బు కాదు. పైన వేసివున్న వెలనిబట్టి, "అరువందలరూపాయల విలువగలఆస్తి"గా ఫిర్యాదులో ప్రకటించబడినా, సామాన్యులు లోభపడే వస్తువు కాదు. అందులోనూ, ఎంత చీకటి బాటయినా, బహిరంగ ప్రదర్శనంలోనించి కేవలం ఒక పెద్ద చిత్రం చేతబట్టుకుని చక్కాబోయిందంటే, ఓ పట్టాన నమ్మకం పుట్టేది కాదు. కాని "చోరీ ఆస్తి"తో పరారవుతూ వుండగానే పట్టుబడిందట. చీరకొంగున మూటలో పాతనోట్లు—ఏభై రూపాయలు కూడా దొరికాయట. పోలీసుల్ని చూడగానే, ఆ పటం పారేసి పారిపోలేదు సరిగదా "బాబూ, నా ప్రాణం—నాది" అంటూ యేవో వెర్రికేక లెట్టిందిట!—ఇదంతా చెబుతూ ఇన్‌స్పెక్టరు వీరాస్వామి - "ఆ! - ఆ పటం గిల్టు చట్రం లేదండీ, అది బంగారమని ఆశపడి వుంటుంది—దొంగముండ!—ఆ రొఖ్ఖం ఎక్కడ కొట్టేసిందో—లేకపోతే, సంపాయించిన బాపతో!—" అని పదేళ్ల పోలీసు అనుభవంతో పత్తాలేశ్వేశా డొక ఇకిలింపుతో—

మహేశంగారా సంజాయిషీకి పెదవివిరిచేశాడు మొదట. కాని, ఆయన ఆలోచనాతరంగాలలో అదేమాట పదేపదే—వరదలలో మోడుపైన పర్వం లాగ—పడగెత్తి బుసలుకొడుతూ వచ్చింది. అయినా ఎన్నడూ లేనిది, యీ చిన్న కేసు విషయంలో తన కింత మథన యెందుకని, మనస్సు మళ్లించుకోడానికి చూశాడు.

ఆ మూడోనాడే విచారణ. విచారించడాని కేముంటుం దయినా—దిక్కులేని బికారిది—వేరే వకీలా, వాదనా?—వీరాస్వామి "ఛార్జిషీటు," ఆ యిద్దరు పోలీసు జవానుల వాఙ్మూలాలు—అంతా ఓ గంటలో తెమిలిపోతుం దనుకున్నాడు.

కాని, ముద్దాయి తరఫున నారాయణమూర్తిగారు వకాలతు పుచ్చుకున్నా డనడంతోటె, మహేశంగారి ఆశ్చర్యం మరింత యెక్కువయింది! దిక్కులేని దన్నారే, అంత డబ్బెక్కడ పొయ్యగలిగింది?- "క్రిమినలు సైడు పెద్దదే య్యనిపించుకుంటున్న మూర్తిగారిలాంటి చిల్లర కేసు పట్టాడంటే, ఎంత డబ్బో - అంతకంటె మరే ప్రబలకారణమో - వుండాలి!—

*   *   *   *

అటువంటి కారణం వుందో లేదో గాని, మొదటిరోజు 'క్రాసు' లోనే మూర్తిగారు తన ప్రతిభ చవి చూపించాడు—

"ఆ వేళ, నీది ఎక్సైటివు డ్యూటీ—అంటే ఎన్నింటివరకు?"

"రాత్రి ఎనిమిదిన్నర వరకూ నండి—"

"అయితే, చోరీ జరిగిందన్న సమయం - ఏడున్నర ప్రాంతాలలో - నువ్వు డ్యూటీలోనే వున్నావు?—"

"చిత్తం"

"అంటే, హాలు బయటా, లోపలా—నువ్వు మామూలుగా వుండేది?"

"బయటేనండి—గేటు దగ్గిర—"

"ఎన్ని గేటు లున్నాయా హాలుకి?—"

"ఒకటేనండి—ముందు వేపు—"

"జనం వెళ్ళాలన్నా, రావాలన్నా అదే త్రోవ—?"

"అవునండి—"

"అయితే, చూడు నూటడెభైయూడూ, సుమారు రెండడుగుల పొడవూ, అడుగున్నర వెడల్పూ వున్న పటంతో—ఒక ఆడమనిషి పారిపోతూన్నప్పుడు, నువ్వు గేటుదగ్గిర—త్రోవలోనే—వున్నావు!—అయినా, అక్కడికి దాదాపు అరమైలున్న పెద్ద మసీదు దాకా తరిమితే గాని ఆ ఆడమనిషిని అంది పుచ్చుకోలేకపోయావు!—క్రిందటేడు, పోలీసు పందాలలో 'రన్నింగురేసు' ఫస్టుప్రైజు నీకేగా వచ్చింది?—"

"చిత్తం, అవునండి!—అదే - అంటే - ప్రైజు నాకే వచ్చిందండి—కాని, అప్పుడు—కాస్త కాఫీ కని - గేటు వదిలి అవతలి కెళ్ళానండి!—"

"ఓహో, అలాగా కాఫీహోటలు గేటు కెంత దూరం వుందేం?—"

"అంటే...గేటుదగ్గిరే ఒక టుందండి!—కాని, నేను—"

"అక్కడికి వెళ్ళ లేదు - అరమైలు అవతలవున్న సెట్టి హోటలు బాగుంటుందని - కప్పు కాఫీకోసం - డ్యూటీ వదలి అంతదూరం వెళ్ళావు!—"

బోను దిగేసరికి, నూటడెభైయూడుకి ముచ్చెమటలూ పోశాయి. రెండో జవాను, రెండువందల పదిహేనకి—మరీ కొత్తవాడవడంచేత కాళ్ళో లు—వణుకే పట్టుకుంది. కాఫీకి వెళ్ళకపోయినా, మొత్తం మీద ఆ సమయానికి గేటుదగ్గిర లేనట్టు మొదటే వొప్పుకున్నాడు. పరుగెత్తుతూ పడిపోయిన గంగమ్మకి - పటం లాక్కునే సందర్భంలో - ప్రక్కలో నాలుగు లాఠీపోట్లు తగిలినట్టు కూడా తేలిందతని క్రాసుపరీక్షలో—తర్వాత, ఇనస్పెక్టరు వీరాస్వామి, తన మూడో సాక్షి - రామశాస్త్రి అనే ఆయన్ని - బోనెక్కించాడు. "దేవుని ఎదుట ప్రమాణం చేసి—" అతగాడు "ప్రత్యక్షంగా తాను చూసినవ"ని కొన్ని సంగతులు చెప్పాడు—

సుప్రసిద్ధాంధ్ర చిత్రకారుడు, దామెర్ల రామారావు వర్థంతి సమితి కార్యదర్శిగా, తానే చిత్రకళా ప్రదర్శనం ఏర్పాటుచేశాడు. మామూలు ప్రకారం, ఆఖరిరోజు సాయంకాలంకూడా అక్కడే వున్నాడు. మూసే టైము కావస్తోంది. జనంకూడా ఎవరూ లేరు. తాను, హాలులో తిరుగుతూ, అమ్ముడయిన చిత్రాలూ, పొరుగూళ్ళు పంపాలిసినవీ, వివరాలు నోటుచేసుకుంటున్నాడు. గేటుదగ్గిర మనిషి, ఎవరినో టిక్కెట్టు అడగడం వినిపించింది. అటు చూసేసరికి రెండణాలు బల్లమీద పడేసి హడావుడిగా జొరబడుతోంది గంగమ్మ. అంతక్రితం, ఎగ్జిబిషను నాలుగు రోజులూ కూడా హాజరవుతున్న దేనని గుర్తించాడు. మొదటిసారి ఆవిడ కూడా వచ్చిన మనిషి-ఎవరో గోపాలంగారట. ఒకటి రెండు చిత్రాలనిగురించి చాలా వివరాలడిగాడు. అంతసేపూ, ఆ పెద్ద కళ్లు వప్పజెప్పి, గంగమ్మ ఆ చిత్రందగ్గిరే నిలిచివుంది. చామనఛాయ శరీరం, తెల్లచీరా, నొక్కు దువ్విన తలా, మసగ వెన్నెలలో మందారపుష్పం స్ఫురించిందట రామశాస్త్రికి. ఆ దరిమిలా ఎప్పుడూ అంత శోభస్కరంగా కనిపించలేదు. ఎప్పుడొచ్చినా, గంటల తరబడి, ఆ వొక్క చిత్రందగ్గిరే వుండిపోయేది. ఎగ్జిబిషన్ మూసే వేళయి, పొమ్మనేవరకూ వదిలేది కాదు. ఆఖరిరోజునకూడా, తాను "టైమయిపోయిం"దంటే, "బాబూ, కాస్సేపు!—కాళ్లు లాక్కుపోతున్నా" యని ఆ చిత్రానికి ఎదురుగానే కూలబడింది. హాలులో వెలుగుతున్న దీపం కాంతి కంటే, ఆరిపేసిన దీపాల చీకటే ఎక్కువగా వుంది. అదే తెల్లచీర—నలిగి మాసిపోయింది. రవిక చిరిగివుంది. రేగిపోయిన ఆ జుట్టూ, గుంటలుపడి చింతనిప్పులలాగ కణకణ లాడుతున్న కళ్లూ, కన్నీళ్లతో తడుస్తున్న చెక్కిళ్లూ—రామశాస్త్రి కా వాలకం చూస్తే వళ్లు ఝల్లుమందా సమయంలో. అంతట్లో, గేటుదగ్గిర మని షెందుకో కేక వేస్తే తానటు వెళ్లాడు. తర్వాత, అతడి నేదో పనిమీద యింటికి పంపించి, తాను ముందు వరండా నానుకునివున్న ఆఫీసుగదిలో, ఏవో లెక్కలు చూసు

కుంటూ వుండిపోయాడు. అరగం టయిందో, పలక్తై నిముషాలయిందో—మళ్ళీ తాను హాలులోకి వెళ్లే టప్పటికి—ఆవిడ లేదు. బల్లమీద ఆ చిత్రం లేదు! గమ్మున గేటువగ్గిరికి పరుగెత్తి, నలుగురూ నాలుగు వేపులా గాలించారు. ఫలితం లేక, తాను ఎక్సిబిషన్ హాలుకి తిరిగొచ్చిన మరో పావుగంటకల్లా, ఇనస్పెక్టరుగారొచ్చి, పటంతో సహా దొంగ పట్టుబడిందని, ఫిర్యాదు దాఖలు చెయ్యడానికని, తనని స్టేషనుకి తీసుకెళ్ళారు.

ఇలాగ, రామశాస్త్రి వాఙ్మూలం అయాక, నారాయణమూర్తి గా రందుకున్నాడు—

“శాస్త్రిగారూ, ఆఖరిరోజున ఆవిడ వాలకం చూసి, వళ్లు ఝల్లుమందన్నారు - అంటే మీకు భయం వేసిందనా?—”

శాస్త్రి కొంచెం యికిలిస్తూనే, “అబ్బే, అంటే ఝడుసుకున్నానని కాదు—కాని, ఆ చింపిరి తలా, వెర్రిచూపులూ—మసగ వెల్తుర్లో చూస్తే - ఏమిటో -”

“గమ్మున చీకట్లో పిచ్చిది యెదురై, కెవ్వు మన్నట్టయింది—అంతేనా?”

“అవునండి! సరిగ్గా అప్పటి నా మనస్థితి చెప్పారు—”

“అంటే, అదీ మనస్థితీను!-కోర్టువారీ విషయం ముఖ్యంగా గమనించాలని మనవి—శాస్త్రిగారూ, మరొక్క సంగతి—పటంతో మనిషి పట్టుబడిందని చెప్పడానికి, యినస్పెక్టరుగారే స్వయంగా వచ్చా రన్నారు—ఏ జవానుచేత కబురెట్టినా సరిపోయేది గదా?—”

“సరిపోయేది—కాని, స్నేహితుడి నోసారి చూసినట్టూ అవుతుందని వచ్చారనుకోకూడదా?—”

“అనుకోవచ్చు - అసలు ఆయనకీ మీకూ స్నేహం అన్న సంగతి తెలిసివుంటే!—అయితే పోయిన వస్తువు దొరికినా, కేసు నడపాలన్న పట్టుదలకి కూడా, యీ స్నేహమే కారణమయిందని అనుకోవచ్చునా?”

“యువర్ ఆనర్ - అబ్జెక్షన్!”—అంటూ యినస్పెక్టరు వీరాస్వామి చర్రున లేచాడు—“సాక్షి యీ ప్రశ్నకి జవాబియ్యవలసిన అవసరం లేదు.”

కోర్టువారా అభ్యంతరం అంగీకరించినమీదట మూర్తిగారు మళ్లీ సాక్షివైపు తిరిగి—“సరే, శాస్త్రిగారూ!—ఆ రాత్రి కలుసుకున్నప్పుడు, ఇనస్పెక్టరుగారిదివరకే ముద్దాయిని యెరుగున్నట్టేమీ చెప్పలేదా?”

ఇనస్పెక్టరు తిరిగీ అభ్యంతరం చెప్పబోయాడుగాని, కోర్టువారీ ప్రశ్న బేసబబు కాదని తీర్మానించారు. శాస్త్రి, యినస్పెక్టరుని చూస్తూ, కొంత నసుగుడుగానే—

“ఎరుగుండడం అంటే—కనక కొన్నాళ్ళ పాటు యిన్నీసు పేటలో యిరుగుపొరుగునే వున్నారట—ఆ మనిషి ప్రవర్తనంత మంచిది కాదన్నట్టు చెప్పారంతే—”

“అసలావిడ ప్రవర్తన వూసెందుకొచ్చిందో, సెలవిస్తారా?”

“బాగుందండి!—ఫలానా మనిషి పట్టుబడిందంటే, ఆ మాటమీదా మాట వస్తుంది—”

“శాస్త్రిగారూ! నిజమే చెబుతానని ప్రమాణం చేశారు. నిజంగా, జరిగిన మాటలు జరిగినట్టు చెప్పమని కోరుతున్నాను—”

ఆ మాటల్లో తీవ్రతకి శాస్త్రి కనుబొమలు ముడివడ్డాయి - కళ్లు రెపరెపలాడాయి—“అంత చెప్పకూడని మాటలేం రాలేదు. ఏదో దిక్కులేనిదని నేను జాలిపడితే, ‘దిక్కులేకపోవడమేం ఖర్మం? - దానికున్న ధీమా పొగరూ నీకేం తెలుసు’ నని హెచ్చరించారు—”

“ఓహో, అలాగా! ఆ విషయం యినస్పెక్టరుగారికి తెలుసునన్నమాట!-థాంక్స్, శాస్త్రిగారూ, అంతే” అని మూర్తిగారు కూచున్నాడు.

ఆ రోజుకి విచారణ ముగిసింది. మేజస్ట్రేటు పీఠం దిగి వెళ్లినవాడు, కళ్లజోడుకోసం మళ్లీ తానే తిరిగొచ్చాడు. ఆ రావడంలో బుట్ట తలపాగా అవతల తన గదిలో మరిచిపోయాడు. పలచని క్రాపు, బుట్ట మీసాలూ, పచ్చని ముఖం నలభయ్యోపడికి యిటే వున్న మనిషి, కళ్లజోడు తీస్తుంటే వేళ్లు వణికాయి. ఆయన కుర్చీ వెనకాల, గోడమూలనున్న బూజు పంజ వెలుగుపడి మెరిసింది. గోదారిగాలి తిరిగి కోర్టుగదిలో దుమ్ము రేగింది.

ఎవరో పెద్ద మనిషి, కోర్టుగుమ్మం దగ్గిరే మూర్తి గారికి దణ్ణం పెట్టి కారుదాకా ఆయన వెంటబడ్డాడు.

"చూడండి గోపాలంగారూ, వచ్చే హీరింగుకైనా ఆవిడ కోర్టులో హాజరుకావాల్సి వుంటుంది— ఎలా వుంది జ్వరం?" అని మూర్తిగారడిగారు.

"పొద్దున్న చూస్తే మూసిన కన్ను తెరవటం లేదండి—రేపటి హీరింగుకి, ఏమో, కష్టమనుకుంటాను—"

"రేపెలాగో కాదనుకోండి - నాకూ సెషన్స్ కోర్టులో పనివుంది—వాయిదా తీసుకుందాం—"

"బొత్తిగా, మందుకూడా తాగటం లేదట—"

"అయ్యో పాపం, మరేం భయం లేదని, కాస్త నచ్చచెప్పి తాగించాలి గాని ఎలాగ?..."

"భయం కాదు బాబూ, ఆ పటం కోసం!— అహోరాత్రాలు ఒకటే వెర్రిపేలాపనట - లాకప్ పహారాజవాను, పిల్లలగలవాడేమో పాపం, ఆ బాధ చూడలేక, నిన్న రాత్రి రహస్యంగా ఆ పటం పట్టుకొచ్చాడ టోసారి. అది చూసి ముద్దులాడుతూ, ఓపట్టాన వదిలింది కాదుట—"

"పాపం, ఆ తల్లిగుండె—"అని మూర్తిగారలా కారు నానుకునే ఓ క్షణం పరధ్యానంలో పడ్డాడు.

"బెయిలుకేమన్నా ప్రయత్నం చేస్తే—"అని గోపాలంగారు సందేహించాడు.

"చెయ్యొచ్చు—కాని, సరియైన హామీ—"

"నేను సరిపోతానా అండి?"

"మీరా!" అని మూర్తిగారాశ్చర్యపడ్డాడు. "ఎవరోపరాయిమనిషికోసం ఎంతభారం సిద్ధపడతాడాయన?" అన్న సందేహంతో పరిశీలిస్తున్నట్టుంది ఆయన బొమముడిపాటు.

"ఈ మహేశంగారు ఎంత పిసినిగొట్టో అంత భయస్థుడుట—ఏ మూడు నాలుగొందలో డబ్బె ధరావతు కావాలనొచ్చు—అదీగాక, కీడెంచి మేలెంచమన్నారు, తీరా విడిపించాక, ఆ మనిషి ఎటొచ్చి ఎటుపోయినా, మధ్య మీరు అనవసరంగా యిరుకున పడిపోతారు—"

"అయ్యొయ్యరామా, అటువంటి మనిషికాదండి— మొదటే చెప్పానుకదూ—"

"అహా, అందుకుకాదు—కాని, చూడండి, యీ రోజుల్లో ఒక కడుపున పుట్టినవాళ్ల మధ్యనే యెన్నో విపరీతాలు చూస్తున్నాం—కాలం అలాంటిది!—అందుకని, ఏదో మొదటినించీ మీ కుటుంబం అంటే వున్న అభిమానంకొద్దీ, నాకు తోచింది చెప్పాను—మరోలా భావించకండి—"

"ఎంత మాటండి!—ఈ గొడవలో మీ సహాయమే లేకపోతే, ఎప్పుడో ముగిసేది ఆవిడ కథ— చిన్నప్పుడే తల్లినీ, జ్ఞానంవొచ్చేసరికి వొక్క తోబుట్టువునీ పోగొట్టుకున్న యీ నిర్భాగ్యుడికి, దేవుడు చూపించిన యీ చెల్లెమ్మ కూడా కరువయి పోయేది—"

ఆ కంఠంలో గద్గదిక, గంగమ్మంటే ఆయన గుండెకి యెంత దగ్గిరో, అవగాహన చేసింది. క్షణం ఆగి, గోపాలంగారు, మళ్ళీ అన్నాడు—

"మీ ప్రతిష్ఠకితగిన కేసు కాకపోయినా, మీగా నకుంకట్టారంటే, నే నివ్వగలిగిన ముష్టిఅరవై రూపాయలకోసమా?—నా మీద అభిమానంతోబాటు, 'అయ్యో, నిర్భాగ్యురాలే' అన్న జాలీ, వుపకార చింతా, ఎంతో వున్నాయని నాకు తెలుసు—మీరన్నట్టు, ఎంత కలికాలం కొట్టుకుపోతున్నా, ధర్మచింత యింకా పూర్తిగా చావలేదు—మీలాంటి సత్పురుషులే అందుకు తార్కాణం—"

ఆ మాటలు మూర్తిగారి అంతరాత్మని కలచాయి. ఒకప్పుడు, తాను వీధిలాంతర్లక్రింద చదువుకుంటున్న రోజులలో, అన్నం పెట్టి ఆదరించిన గోపాలంగారి తండ్రి జ్ఞాపకం వచ్చాడు. కాలచక్రానికి వొక పెసపట్టుకుని తాను పైకొచ్చాడు. పడుతున్న ఆకుమీద వుండిపోయి, గోపాలంగారి కుటుంబం అధోగతిని పడింది—ఆయన, స్కూలు మేస్టరయాడు. ఆ బడిపంతులిచ్చిన అరవైరూపాయిలూ, మొదట అక్కరలేదన్నా—తాను పుచ్చుకున్నాడు. ఆ రూపాయలంతే 'ముష్టి'గా ఎన్నడూ తోచలేదీ క్షణంలోతప్ప—

* * * *

గోపాలంగారి హామీమీద, బెయిలు దరఖాస్తు పెట్టడం, ప్రాసిక్యూషను పట్టువల్ల అది కొట్టివెయ్యబడడం కూడా జరిగాయి. మరో పరిణామం,

గంగమ్మ కేసు ఆ వూరి ప్రజాశంఖంలో ప్రధానవిశేషం అయింది.

'ప్రతి బుధవారం ప్రకటించబడే' ఆ 'ప్రజా పత్రిక'కి, సంపాదకుడూ, విలేఖరీ, సర్వసిబ్బందీ అయిన శ్రీనివాసాచారి చేతుల్లో ఓ యాభై రూపాయలు చేరినప్పుడే—లేకపోతే, మరో అచ్చాఫీసులో అరువు దొరికినప్పుడే—తప్ప, బుధవారం రాదన్న సంగతి ఆ వూరివారికి చిరకాలానుభవమే—అటువంటి దీపారి, అదనపు పేజీలలో 'ప్రత్యేక సంచిక' వెలువడింది!—"విద్యార్థులపైన తుపాకి కాల్పులు," 'కరువురాక్షసి కరాళనృత్యాలు' అన్న వార్తా వ్యాసాలతోబాటు, 'కాంగ్రెసు పోలీసుల ఘనకార్యం' అన్న శీర్షికతో ఆ విచారణ వివరాలు 'మన ప్రత్యేక విలేఖరి' నించి అచ్చయాయి. "ద్రౌపదికి కృష్ణపరమాత్మలాగ, అనాథ అనుకున్న గంగమ్మ రక్షణకి నారాయణమూర్తిగారు నడుం కట్టాడ"ని ఆయన ప్రతిభా విశేషాలు ప్రత్యేకంగా పొగడబడ్డాయి. పత్రిక కొని చూసిన కొద్దిమందిదగ్గరా, పేజీలు చింపుకు చూసినవాళ్ళూ—అసలేమీ చూడకుండా ఆనోటా ఆనోటా వినిపించినవాళ్ళూ ఎక్కువయి, ఒక కోర్టులో వాయిదాపడ్డ 'కేసు' వంద కోర్టులుగా వీధులలో విచారణ సాగింది. అప్పా, అలీ, అమ్మో కాని ఆడ దెవరోకదా అని, ఆకతాయిలు నోటికొచ్చినట్టు మాట్లాడారు.

గంగమ్మతోబాటు, అదే యింట్లో అద్దెకుంటూ, ప్రస్తుత కష్టసమయంలో ఆదుకుని పనిచేస్తున్న గోపాలం మేస్టరుకూడా (ముగ్గురుపిల్లల తండ్రి అయినప్పటికీ), యిలాగ ప్రజలనోళ్లలో పడక తప్పింది కాదు. గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్టు, గంగమ్మ బ్రతుకిలా రచ్చనిపడినందుకే ఆయన చాలా నొచ్చుకున్నాడు. దానికితోడు, 'లోకులు కాకుల'ని ఎంత తెలిసినవాడయినా, చివరికి హెడ్మాస్టరుకూడా ప్రత్యేకంగా కథపెట్టి 'స్కూలు ప్రతిష్ఠ' పురస్కరించుకుని, నాలుగు అనేసరికి, నీరవుడయాడు గోపాలంగారు. దిక్కులేని డొంకల కొంపలలో మళ్లీ దీపంపెట్టిన ఆ విద్యాసంస్థ మూలవిరాట్టు వీరేశలింగం స్మరణకొచ్చి, ఆయన వుత్తేజితు డయాడు. గుండెకట్లు తెంచుకొస్తున్న కోపం, దుఃఖం, గొంతులో బిగబట్టి, "మీరూ నన్ను శంకిస్తే, యింక యిక్కడ పనిచెయ్యడం కష్టం—సంస్థకి భంగం అన్నప్పుడు, వ్యక్తిపోవడమే ధర్మం—ఆవిడ విషయంలో నా కర్తవ్యం అనుకున్నది చెయ్యకతప్పదు. కాని, తల్లికి వసంతంపట్టే దౌర్భాగ్యక్షణమాత్రం యింకా కాలేదు—" అని గదిలోంచి చరచరా బయటపడ్డాడు. ఆ రోజునే గోపాలం మేస్టరి రాజీనామా వుత్తరం హెడ్మాస్టరుకి చేరింది.

కాని మర్నాటికల్లా, ఆయన వుద్వేగం కొంత తగ్గి, వున్న సంసార పరిస్థితులు కొట్టొచ్చినట్టుగా, గోపాలంగారి మనస్సుని కలవరపెట్టసాగాయి. తెల్లారితే, కేసు ఫైనలుహియరింగవగా, మూర్తిగారింటికో సాయంకాలం షికారుకి వచ్చినప్పుడోసారి కలుసుకోమంటే బయలుదేరాడు. తాలూకాఫీసు వీధినే గోదావరి గట్టువైపు నడుస్తున్నాడు. లోగడ వానలకి పొంగిన మురికికాలవలు మ్యునిసిపలు రాజకీయాలలాగే ముక్కులు బద్దలు కొడుతున్నాయి. 'గమ్మున అలాగ వుద్యోగం వొదులుకోడం తొందరపడ్డానేమో' అనుకున్నా డాయన...ఛా, అంత లేసి మాటలన్నవాడికింద ఎలా పనిచెయ్యడం యింకా?...ఏ ప్రయివేట్లు చెప్పుకున్నా రోజెడుతుంది...అసలా వూరినించిపోయి, మరోచోట ఏదయినా ప్రయత్నించవచ్చు...ఇక గంగమ్మ మాత్రం ఎలా ఉంటుం దక్కడ? ఆవిడవల్లనే గదా, అసలు గొడవంతాను?...పాపం, ఆవి డేం చేసింది?...సగం మతిపోయి, జైలులోపడి మగ్గుతోంది...

గట్టెక్కా డాయన - హోరున వరద గాలి కొడుతోంది. నాసికనించి పాపికొండలవరకూ, రకరకాల బహూకరణలు పోగుచేసుకొచ్చిన గౌతమి, సాగరసమాగమయోగం దగ్గర బడిందన్న సంతోషంతో, పరవళ్లు తొక్కుతూ పరుగెడుతోంది. అప్పుడే, మబ్బునించి వెలువడ్డ అస్తంగతభానుడి పరామర్శకి, స్నానాల రేవులో రెల్లుదుబ్బులు సహితం పులకించి జలజలమంటున్నాయి—

ఆ రేవులోనే గంగమ్మ తనకి మొదట తటస్థపడ్డ దృశ్యం జ్ఞాపకం వచ్చింది గోపాలంగారికి—రెండేళ్ల క్రితం - అంతకంటె చీకటిపడ్డ సమయం - తాను, స్నానానికి వెడుతుంటే, అకతాయిగా ఆడగొంతు, ఏడుపు, వినిపించి పరుగెత్తేసరికే, కాస్తలో ప్రమాదం తప్పింది - నా అనేవాళ్లు లేక, సంఘానికి వెలిఅయి

కూడా, కొడుకుకోసమే బ్రతుకు భరించిందిట - లోకుల కది పాపిష్టికొనుపయినా కన్నకడుపుకి ఆ శిశువే సర్వప్రపంచమూ అయాడు. ఆ పిల్లవాడి మీదనే ప్రాణాలన్నీ పెట్టుకుని, వాడికోసం వంటలు చేసింది. పై పనులు చేసింది. గంటలకొద్దీ సంతోషంతో కష్టించింది...ఏదో అల్లాటమని పనుకుని, వీరాస్వామిలాంటి అల్పబుద్ధులు అన్యథా ప్రవర్తించబోతే, తగిన బుద్ధిచెప్పి తన శీలం కాపాడుకుంటూ వచ్చింది..."నా కన్నా, నా దుర్గా-నువ్వు పెద్దవాడివయి, అమ్మ బాధ లెప్పుడు తీరతాయ"ని ఆ పిల్లవాడితో చెప్పుకోడిచేది......కాని, ఏ దేవుడి కళ్లు కుట్టాయో, అయిదేళ్లయినా నిండకుండా ఆ పొక్క ఆశాకూడా అంతంఅయిపోయింది. మశూచకంట!... ఇంక తనకు యిల్లేమిటని, అంతక్రితం తన దుర్గయ్యని మట్టిపాలుచేసిన ఆ స్మశానాలరేవులోనే తానూ వాడికి తోడు వెడదా మనుకుందిట - "కాని, అన్నయ్యా, నిన్ను చూపించి, నాకో ఒక్కతోవాకూడా చూసే వాడు దేవుడు" అని చాలాసార్లు తన కష్టాలు చెప్పుకుంటూ వాపోయేది గంగమ్మ - అలాగ, ఆవిడ ఆత్మహత్యా ప్రయత్నం తప్పించిన ఘడియ మొదలు, ఆనాటి కానాడు తన కెక్కువ ఆప్తురాలవుతూ వచ్చింది-కుటుంబంలో మనిషయిపోయింది. ఆమధ్య రెండోవాడికి కలరా తగిలి, ఆసుపత్రిలో పడేసే, అహోరాత్రాలు ఒక్కతే వాడి మంచం కనిపెట్టుకుని బ్రతికించింది...ఇదెక్కడి ఋణానుబంధమో అనుకున్నాడు గోపాలంగారు—

అవతల పడవలరేవులో, మామూలు షికారు జనం, కొబ్బరికాయల బస్తాలమీద 'క్లబ్బు'లు సాగిస్తున్నారు. బహుశా, తన పేరూ గంగమ్మ పేరూ కలిపి, వావీవరసా లేకుండా ఉచ్చరిస్తూ వుంటారు - ఆ చెల్లెమ్మ కడుపు దుఃఖం మరిపించడానికి, బ్రతుకంటే కొత్త వుత్సాహం కల్పించడానికి, తాను ఎన్నో బోధలు చేశాడు - బాధలు పడ్డాడు. తన పిల్లలని ముస్తాబు చేసేటప్పు డావిడ ముఖంమీద చిరునవ్వు చూసి, మరిచిపోయిందనే అనుకుంటూ వచ్చాడు—ఆ ఎగ్జిబిషన్లో మళ్ళీ ఆవి డా చిత్రం చూసిన ఘడియవరకు - ఆ పిల్లవాడు కూడా లోకమోహనంగా వున్నాడు. ఆ గిరజాలజుత్తూ, చంపకు చారెడు కళ్లూ, ఆ బుల్లినోరూ, కొంటె చిరునవ్వూ, చిన్న బొజ్జా—చూస్తే, ఎవరో యీ కాలపుభావాల చిత్రకారుడు, బాలకృష్ణుడిని మామూలు బాలుడుగా చూపించా లనుకున్నాడు - 'బాబు' అని పేరెట్టి ఆ చిత్రం వ్రాసినాయన ఎవరో కృష్ణమూర్తిట - యీ మధ్యనే పైకొస్తున్న చిత్రకారుడుట!—ఆ నాలుగు రోజులు తానేదో సారస్వత సభల గొడవలో వుండిపోయి, గంగమ్మ సంగతి కనిపెట్టలేదు—తర్వాత, తన భార్యే చెప్పింది - ఎప్పుడో దాచుకున్న ఏకైక రూపాయలా అడిగి తీసుకుందిట గంగమ్మ...ఆవిడ కున్న ఏకైక ఆభరణం, బంగారు రేకు మురుగులు కూడా చేతిని వున్నట్టు లేదట!—పాపం, ఆ పటంకోసం, ఎంత యమయాతన పడివుండాలో!...తన కొడుకు పోలికనుకున్న చిత్రం, చూసగా చూసగా తన కొడుకేననే భ్రమ కలిగించి వుండాలి - దేవుడు చూపించా డనుకున్న అన్న కూడా దరిద్రుడే నని తెలిసి, ఆ డబ్బుకోసం పిచ్చిగా ప్రయత్నించి వుండాలి...కాని, యిల్లలికి పండగ అవుతుందను కున్నట్టయిందా ప్రయత్నం...

కాని, విచిత్రం, ఆ తల్లి కళ్లనికూడా మరిపించగల పోలి కెలా వచ్చిందా చిత్రంలో? - అదే సందేహం, తర్వాత కలుసుకున్నప్పుడు వేళ, మాటలలో మూర్తిగారు కూడా అడిగాడు - 'పిల్లలంతా ఓలాగే వుంటా'రని వినక గంగమ్మకి చెప్పిన సమాధానం కంటె ఎక్కువ చెప్పలేకపోయాడు గోపాలంగారు - మూర్తిగారు తల పంకిస్తూనే,

"ఆ బొమ్మ గీసిన కృష్ణమూర్తి, పూర్వం ఆవిడకి తెలిసినవాడేమో?"

"నే నెరగని 'పూర్వం' ఆవిడ జీవితంలో లేదనుకుంటాను - ఆ ఘట్టాలన్నీ నా కళ్లకి కట్టినట్టుగా మనస్సులో హత్తుకుపోయాయి"

"అయితే, నా వూహ పొరబాటే!—"

"మొదట నేనూ అనేక అపోహాలు పడ్డానండి- కాని, తెలుసుకున్నకొద్దీ, ఆవిడ నిర్మలాంతఃకరణ నాచేత చేతులు జోడింపజేసింది. ధర్మసూక్ష్మం కానలేని శుద్ధిసంఘం, ఆభాసతే పాప పుణ్యాలుగా భ్రమించే అలవాటు చొప్పున, ఆ అమాయకురాలిని నానా హింసలూ పెట్టింది" అని గోపాలంగారు, గంగమ్మ పూర్వకథ చెప్పాడు—

అసలావిడ పేరు గంగామహాలక్ష్మి - చిన్నప్పుడు, 'మహాలక్ష్మి' అనేవారట!- రామచంద్రపురం

దగ్గిరేవో పల్లెటూరట! -సబ్బుకి అసింగ్, తల్లిదండ్రులా పిల్లని రెండో పెళ్లివాడికిచ్చారు. రెండేళ్లు తిరగకుండానే...ఆ భర్త హఠాత్తుగా 'బ్రాంకైజ్వరం' వచ్చి మరణించాడు. అప్పటికి పదహారేళ్లు నిండని మహాలక్ష్మికి జుట్టు తీసెయ్యాలన్నారు. ఎవరో, ఆవిడ భర్త తాలూకు దూరపు బంధువు—పాతికేళ్లకుర్రాడు—పోట్లాడి ఆ ప్రయత్నం మానిపించాడు. అలా ఏర్పడ్డ గౌరవం కొద్దీ, దరిమిలా అతగాడు పలకరించినప్పుడు మాట్లాడిందావిడ. అసలా పెళ్లి పెళ్లేకాదని, జీవితం అలా అడవికి గాచిన వెన్నెల చెయ్యడం దేవుడి ఉద్దేశం కాదనీ, క్రమంగా అతను ఎన్నో బోధలు చేశాడు. తాను పెళ్లిచేసుకుంటానని, రాజమండ్రీలో అలాంటి వివాహాలుచేసే సంస్థవుందనీ వచ్చి చెప్పాడు. అతడిని పూర్తిగా నమ్మిందావిడ. పెళ్లి అయినా ఖాళీగావున్న భర్తృస్థానంలో అతడి మూర్తి తనహృదయంలో ప్రతిష్ఠించుకుని మురిసింది. యవ్వనోద్రేకంలో అతని కోర్కెలకి ఆత్మార్పణ చేసింది. నెలలయిన కొద్దీ ఆవిడ బ్రతుకు దుర్భరం అయింది. అతడు క్రమంగా కనిపించడం మానేశాడు. వాళ్లవాళ్లకీ విషయం తెలిసి ఆ వూరునించి తీసుకుపోయి వేరే పెళ్లి చేశారుట! ఇంట్లో వెధవాడబడుచు ఒకావిడ ప్రొద్దస్తమానం నానా హింసలూ పెడుతుండేదట. ఆ దుర్గడికేం, మగ మహారాజు, ఏంచేసినా చెల్లుతుందని ఆవిడ చాలా పొర్లన్నదట—అంతకుమించి, తన బ్రతుకింత చేసిన వాడి వయినం గంగమ్మకి తెలియదు. తెలుసుకుందామన్న యోచన కూడా తోచలేదావిడకి. ఎలాగో యింట్లోనించి గెంటెయ్యాలని ఆ వెధవాడబడుచే గట్టి ప్రయత్నం చేసిందట—'అంత పనీ చేసేవారే అన్నయ్యా—కాని, నాకు జబ్బు చెయ్యడం, వొళ్లు తెలియని స్థితిలో ఆసుపత్రిలో పడెయ్యడం, వాళ్లకా శ్రమ తప్పింది. అప్పుడైనా పోయింది కాదీ పాడు ప్రాణం? అదేమిటో నాకు మాత్రం యింకా బ్రతకాలనే వుండేది సుమా!' అంటూవుండేది గంగమ్మ. అక్కడ ఒక 'నరుసమ్మ' దయవల్ల, తల్లీ పిల్లవాడూ, ఒక ఏడాది జీవించారుట. ఆ నరుసమ్మ చివరికి పెళ్లి చేసుకు వెళ్లిపోతూ, యాభై రూపాయలు పిల్లవాడి చేతుల్లో పెట్టి కళ్లమ్మట నీళ్లెట్టుకుందిట—"మళ్లీ నిన్నూ మాస్తే ఆ నరుసమ్మ జ్ఞాపకం వస్తుందన్నయ్యా" అని చెబుతూ, ఆ సంఘటనంతా ఒక పెద్దకలగా తోస్తుందనేది గంగమ్మ— తర్వాత ఆవిడ కథ మీకిదివరకే తెలుసు" నని గోపాలంగారూరుకున్నాడు.



ఇద్దరూ గస్టెక్కేసరికి మునిసిపలు దీపాలు చీకట్లని సూచిస్తున్నాయి. మూర్తి గారు కారులో కూచుంటూ అన్నాడు—"చూడండి గోపాలంగారూ మన తరఫున మీరు మొదటి సాక్షి కావాలిసి వుంటుంది—"

"మీ అజ్ఞ బాబూ, తెలిసింది చెప్పడానికెప్పుడూ సిద్ధమే—మొదటి సాక్ష్యం అంటే, అసలు మొత్తం మనవేపు—"

"త్రిమూర్తులూను—"

"ముగ్గురు సాక్షులా అండీ?—నేనూ—రెండోది?—"

"ఆ పటం!—"

"మూడోది?"

"భగవంతుడు!—" అని మూర్తిగారు పెద్ద నిశ్వాసం విడిచాడు. కారు బయలుదేరింది.

* * * *

మర్నాడు కోర్టులో గోపాలంగారు వాఙ్మూలం యిచ్చాడు. గంగమ్మ శీల ప్రవర్తనలుగురించి తనకి తెలిసిన సంగతులు చెప్పాడు. అనేకసార్లావిడ, తన పిల్లవాడి అందచందాలు చెప్పకు వాపోయేదనీ, ఆ పోలికలన్నీ యిప్పుడు చోరీ అయిందన్న పటంలో స్పష్టంగా వున్నాయనీ, తెలియజేశాడు.

ఆ రోజున, 'ప్రజాశంఖం' పత్రిక ధర్మమాఅని కోర్టు గది ప్రేక్షక జనంతో కిటకిటలాడింది. ఎన్నో కేసులలో మూర్తిగారి వాదనలు విన్నవాళ్లు, అంత వుద్రిక్తుడై ఎప్పుడూ ఆయన మాట్లాడలేదని ఆశ్చర్యపడ్డారు—

చాలా నీరస స్థితిలో వున్నా, ముద్దాయి నా రోజున హాజరు పెట్టారు—ముడి విడిపోయిన ఆజుట్టు అలాగే వ్రేలాడుతోంది; సగం నిద్రలో లేపినట్టు, కళ్లు కణకణ లాడుతున్నాయి. అదృష్టిలో నిర్లిప్తత—యీ కోర్టూ, ప్రజలూ, గోడలూ దాటి—ఏలోకాలనో అందుకున్నట్టుంది. అమ్మవారి జాతరలో గణాచారిలాగ, ఆవిడ దేహం వూగిపోతోంది. బోనెక్కేముందు చెయ్యాల్సిన ప్రమాణం కూడా ఆవిడ స్పష్టంగా పల్లించలేదని ప్రాసిక్యూషనుతరఫున ఒక

అభ్యంతరం చెప్పారు. ఆవిడ ఏ ప్రశ్నలకీ సమాధానం యివ్వలేదు — అసలవి, వినిపించుకున్నట్టే లేదు. మూర్తిగారు తన రెండో సాక్షిగా హాజరు చేయించిన 'ఎక్సిబిట్' — 'బాబు' చిత్రం — ముందు పెట్టినప్పుడు మాత్రం, ఏదో మాట నొక్కిపట్టావిడ చేతులు చాచింది. ముఖం మీద ఒక క్షణం ఏదో కాంతి వెలిగింది. నిద్రిస్తున్న అగ్నిపర్వతం ఒక్కసారి మళ్లీ విజృంభించినట్టు, ఆవిడ ఆపాద మస్తకం దడదడలాడింది. కాని, "చూడమ్మా — యీ బొమ్మ నీ కొడుకుదేనా — చెప్పు — దేవుని ఎదుట, ప్రమాణం చేసి — నీకన్న కొడుకేనా?" అని మూర్తి గారు గద్గద కంఠంతో ప్రశ్నించే సరికే, ఆ మహా చైతన్యం మళ్లా సమాధిలో పడిపోయింది. జల ప్రళయంలాగ బొట బొట కారిన కన్నీళ్లే సమాధానం అయింది. "ఇంక ఆవిడ సాక్ష్యం చాలని" మేజస్ట్రీటు మహేశంగా రాదేశించడంతోటి, పోలీసుజవాను ఆవిడని తీసుకుపోయాడు.

"కడుపు తీపి యెరిగిన తలిదండ్రులకి అంతకంటె రుజువక్కరలేదనుకుంటాను" అని మూర్తిగారు తన 'ముగింపు' అందుకున్నాడు. పటం పట్టుకు వెళ్లినప్పుడావిడ ఒకవిధం అయిన వున్మాదావస్థలో వుందని, రామశాస్త్రి సాక్ష్యం వుదాహరించాడు. అప్పటి చర్యలకి ఆవిడ బాధ్యురాలు కాదని వాదించాడు — "ఎడారి ఎండ మధ్యలో నీళ్లు కనిపిస్తే తాగబోవడం చోరీ అవుతుందా? కీకారణ్యంలో పాంథుడు వెలుగు వేపు పరుగెత్తడం నేరమంటామా? చచ్చిన పిల్లవాడు కంటబడ్డాడనుకున్నప్పుడు తల్లి ప్రత్యణువూ పరవశం కావడం కూడా అలాంటి అనివార్యమైన, ఆధ్యాత్మిక సంఘటనే — అసలు చోరీ, ఆవిడ బ్రతుకలా బండలు చేసిన రాక్షసుడు చేసింది — గంగమ్మది కాదు — ఆ పటం ఆ తల్లిదే!" అని మూర్తి గారు కూర్చునే సరికి అక్కడి ప్రజ యావత్తూ నిస్తబ్ధులయారు.

తీర్పు వినిపించేసరి కారోజు నాలుగయింది. అవతల వానజడి తగ్గింది. పచ్చని చెట్లమీద అప్పుడే వచ్చిన నీరెండపడి పక్కమీద సుషుప్తిలో వున్న పసిపాపడి చిరునవ్వులాగ ప్రకృతి అంతా చిదానందంగా వుంది.

మేజస్ట్రీటు మహేశంగారు, తీర్పు చెబుతూ — అప్రయత్నంగా లే — నుంచుండి పోయాడు. అక్కడవున్నవాళ్లకోసం కాదన్నట్టు, అతి హీనస్వరంలో ఆచి ఆచి మాట్లాడాడు - అప్పటికి ముద్దాయి అనుభవించిన జైలు ఆ నేరానికి తగిన శిక్ష అయిపోయింది. న్యాయదేవత ఆశయం నెరవేరిందని, వెంటనే గంగమ్మ విడుదలకి ఆదేశించాడు - "ముద్దాయి తరఫున, మూర్తిగారు - అన్నట్టు - యీ బా - బు - పటం - ఆ తల్లి దే! - ఆవిడకే - వప్పగించదున్నాను -" అని యిన్స్పెక్టరు వీరాస్వామి వైపు సూచిస్తూ కవరొకటి బిళ్లబంట్రోతు చేతి కిచ్చాడు. ఎలా తెలిసిందో, ఒక్క క్షణంలో అక్కడి ప్రజలంతా, ఒక్క గుండెగా, "ఓహ్హో, మహానుభావు" డని హాహాకారం లేచింది. కారణం, ఆ కవరులో వున్నది రామశాస్త్రి పేరట, ఆరువందల రూపాయలకి చెక్కు - మహేశంగారిచ్చిన 'బాబు' పటం ఖరీదు!

* * * * *

కోర్టులో ఆ కేసలా ముగిసేసరికి, అవతల మళ్లా ముసురందుకుంది. ఆ చిగిబిగి రాత్రి తొమ్మిదివరకూ కుంభపోతగా కురుస్తూనే వుంది.

అప్పటికి గంగమ్మ కేసు డాక్టరు చేతులలో పడింది - ఇంటికి తీసుకొచ్చినప్పటినించీ, మాటా మంతీ లేకుండా మంచంమీద పడివుంది. వొళ్లు పేలిపోతోంది. పరీక్ష చేసి, 'న్యుమోనియా' అన్నాడు డాక్టరు.

గోపాలంగారి భార్య రోగి గుండెలకి 'ప్లాస్టరు' వేసింది. మందు తాగించింది. భార్యని పిల్లల దగ్గరికి పంపించి, చెల్లెమ్మని కనిపెట్టుకుని కూర్చున్నాడాయన. ఓ రాత్రివేళ, నూతిలో మాటలాగ ఆవిడ మాటలు వినిపించింది -

"నా - బాబుని - కొట్టొద్దను -"

"ఎవరు కొడుతున్నారమ్మా? - అదేదో - కల-"

"మారం - పెడుతున్నాడు - ఆ చంద్రం - కోసమని -"

"నేను - తెస్తాలే, పొద్దున్నే -"

ఆవిడ వింతగా చిరునవ్వు నవ్వింది - పోలీసు ఠాణాలో ఆరు కొట్టారు -

న్నాడు...దూరంగా, లంకమీద నుంచుని, కీరా స్వామి లాకీ వినిరాడు...తన తల పగిలి చెంపలమ్మట నెత్తురు కారింది. కెవ్వున కేక వేసేసరికి - పక్కనున్న మేజామీదికి వొరిగివుంది శిరస్సు. పాలగ్లాసు పడిపోయి, చాప కిందంతా మడుగయివుంది. కిటికీలోంనించి ఎండకి, గది అంతా వెలుతురుగా వుంది. కళ్ళు చిట్లించుకుంటూ అటు చూసేసరికి -

అక్కడవున్న ఒక్క కుర్చీలో, మహేశం గారు! - ప్రక్కనే రామశాస్త్రి, యింకో పెద్ద మనిషీ నిలబడివున్నారు-

"క్షమించాలి - మిమ్మల్ని లేపేశాం -"

కల కాదు, నిజమే! - అది మహేశంగారి గొంతే! - ఆయన, లేచి గంగమ్మకేసి చూస్తున్నారు-

గోపాలంగారు గమ్మున లేచాడు. నలుగురూ, వీధి వరండాలోకి వెళ్లి మంచాలమీద కూర్చున్నారు-

"ఈయనే కృష్ణమూర్తిగార"ని రామశాస్త్రి, కలకత్తానించి ఆయనలా పరుగెత్తుకొచ్చిన కారణం చెప్పాడు. ఎక్సిబిషన్ ముగిశాక, మామూలుగా నే, తాను 'బాబు' చిత్రం కోర్టువారి స్వాధీనంలోవుందని యీ గొడవ కొంత కలకత్తా వుత్తరం వ్రాశాడట. కృష్ణమూర్తిగారు అప్పటికి వూళ్లో లేక ఆ వుత్తరం ఆలస్యంగా చూసుకున్నాడట. వెంటనే ఆదుర్దాతో రైలెక్కాడట. ఎక్సిబిషన్ జాబితాలో ఏదో పొరబాటున యింకోదాని ఖరీదు యీ చిత్రానికి పడిందే గాని, అసలీ 'బాబు' చిత్రం అమ్మకానికని ఆయన ఎన్నడూ వుద్దేశించలేదట—

"ఆయన పటం ఆయనే స్వయంగా వప్పజెప్పాలని వచ్చార"నీ మహేశంగారన్నాడు.

"నాదేమిటి, ఆవిడదే!—ఆ తల్లే నా వేళ్లకి కళ్లిచ్చి వ్రాయించిందా చిత్రం— మూడేళ్ల క్రితం మాట. నేనీవూళ్లో ఒక నెలరోజులుండటం తటస్థించింది. అదో పెద్ద సత్రంకొంప. ఆవతలి వాటాలోంచి, 'బాబు' అప్పుడప్పుడు నా గదిలో కొచ్చేస్తూవుండేవాడు. వందమంది పిల్లలలో అయినా గుర్తుపట్టగల అందం—అతని బొమ్మ వ్రాద్దామని సరదా వచ్చింది. ఏమి ఆదుర్దాపడిందో, గమ్మున 'బాబుని' ఎత్తుకుని గాఢంగా గుండెలకి హత్తుకుంది. ఆ విడ ముఖం నేను దగ్గరగా చూసిందా వొక్కసారే— కాని, ఆతన్మయత్వం, ఆనందాతిశయం, నా మనస్సులో ఆ ముఖం అచ్చొత్తుకుపోయింది. తల్లిని చంపి పుట్టిన దౌర్భాగ్యుడికో అనుభూతి, అమ్మ అంటే ఏమిటో అవగాహన చేసింది—ఆ మాతృభావం చిత్రించాలని తర్వాత చాలా మథనపడ్డాను—కాని, మళ్లీ నే నీవూరు వచ్చేసరికి ఆవిడ ఆ యింట్లో లేదు. ఎన్నిసార్లు యత్నించినా పత్తా తెలియలేదు. 'బాబు' చిత్రం పని కాస్త వెనకబడేసరికి మాత్రం ఆ ముఖం కలొచ్చి వేధించేది. ఆ చిత్రం పూర్తయాక ఎలాగయినా వెతికి ఆ తల్లికే యివ్వాలని ముడుపు గట్టాను. ఆఖరికిలాగ ఆ సంకల్పం సఫలం చేయాలని వుద్దేశించాడు భగవంతుడు—"అని కృష్ణమూర్తిగారు సంగతంతా చెప్పేటప్పటికి గోపాలంగారికి యేదో కథలో గొడవలాగ ఆశ్చర్యం వేసింది.

గంగమ్మకి కొంచెం తెలివొచ్చాక, నెమ్మదిగా చెప్పి ఆ పటం చూపించాలని నిశ్చయించారు. కాస్సేపుండి, మహేశంగారూ, రామశాస్త్రి వెళ్లిపోయారు. కృష్ణమూర్తిగారు మాత్రం అక్కడే వుండిపోయాడు-

ఉదయం అంతా గంగమ్మకి మగత తగ్గి సంధి మాట లెక్కువయాయి.

"అమ్మొయ్య, నా దుర్గన్నకి తలదువ్వనే లేదివేళ" అనిద్దువ్వన్న తెమ్మందోసారి "ఎంత మట్టి పోసుకున్నాడో, యీ చొక్కా విప్పెయ్యాలం"ది యింకో సారి. సూచనగా 'బాబు' పటం అందిన సంగతి చెబుతూ వచ్చాడు. గోపాలంగారు. క్రమంగా నాలుగయేసరికి, ఆవిడ కా ధోరణి తగ్గింది. చాలా తెలివిగా మాట్లాడడం మొదలెట్టింది—"చాలా—అవస్థ—పడుతున్నా వన్నయ్యా—నీ ఋణం ఎలా తీర్చుకోగల"నని కన్నీళ్లెట్టుకుంది.

కృష్ణమూర్తిగారు 'బాబు' పటం అందిచ్చాడు. కాళ్లు తడబడుతూ, గోపాలంగారు, మంచం దగ్గరకి తీసుకెళ్లాడు—

గమ్మున, గంగమ్మ కన్నులు, వింత కాంతితో విప్పారాయి. చేతులు చాచుకున్నాయి. ముఖం అంతా ఒక మూగచిరునవ్వు వెన్నెల కాసింది -

ఆ తన్మయత్వం, కృష్ణమూర్తిగారిదివర కొక సారి సందర్శించాననుకున్నాడు. కాని, యిప్పటిది, మళ్లీ చెరిగిపోకుండా శాశ్వతసమాధిని చెందింది. గోపాలంగారు, తర్వాత చెప్పుకు వాపోయినట్టు, ఆ పటం యింక అవసరం లేకపోయిందావిడకి. అసలు వస్తువునే చేరుకుందా తల్లి -

అంత్యక్రియలకేమీ లోటు రానివ్వద్దని, మహేశంగారో రెండువందల రూపాయలు పంపించాడు. కాని, "బ్రతికివున్నంతకాలం, భగవంతుడే దిక్కయాడావిడకి - యిప్పుడు మాత్రం మనిషిసానుభూతెందుక"ని ఆ డబ్బు తిప్పేశాడు. గంగమ్మ ఆస్తిశేషం, పోలీసుల చేతుల్లోంచి వచ్చిన, ఆ యాభై రూపాయలే ఖర్చుపెట్టాడాయన - చెల్లెమ్మని సంపాదించుకున్న ఆ స్మశానాలరేవులోనే మళ్లీ వప్పగించేశాడు...తల్లీ పిల్లల నక్కడే తన పాత్రిల్లో చేర్చుకుని, పులకించింది అఖండ గౌతమి -

గోపాలంగారికి, ఆ దుఃఖంతో మతిపోతుందను పోతే ఎలాగ?" అని చీవాట్లుపెట్టారు స్నేహితులు. మూడోమాసికం జరిపించాక, మళ్లీ యింకోచోట వుద్యోగానికి దరఖాస్తుపెట్టాడాయన. ఆ సందర్భంలోనే ఏవో కాగితాలు ధృవపరిపించాలిసొచ్చి, రెండటిసారిగా, మేజస్ట్రేటుగారి యింటికి వెళ్లాడొక వుదయం -

సైనుబోర్డునిబట్టి యిల్లు రూఢిచేసుకున్నాడు - ఇత్తడిప్లేటుమీద నల్లని అక్షరాలు - "పి. దుర్గామహేశం" అని వున్నాయి.

హాలులో అడుగుపెట్టేసరికి, గోపాలంగారు నిర్ఘాంతపోయాడు - మహేశంగారి కళ్లమ్మట నీళ్లు కారుతున్నాయి... మెల్లిగా, ఏదో చదువుకుంటున్నాడాయన... మేజాబల్లకి ఎదురుగా దీపారాధన చేసి వుంది - 'బాబు' పటం!

సంకోచిస్తూనే "నమస్కారం -" అన్నాడు గోపాలంగారు.

ఉలిక్కిపడ్డాడు మహేశంగారు...గమ్మున మూసేశాడా పుస్తకం -

అది భగవద్గీత.........



# రెండు స్కాందపురాణములు

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

సంస్కృతభాషలోని పురాణ వాఙ్మయము మహాసముద్రమువంటిది. ప్రాచీనుల వ్యవహారమునుబట్టి పురాణములు మహాపురాణములనియు, నుపపురాణములనియు రెండు తెఱఁగులుగా నున్నవి. అంగము, ఉపాంగమునన్నట్లు మహాపురాణములు ప్రధానములుగను, ఉపపురాణములు వాని తరువాతివిగను లెక్కింపబడుటకై యిట్టి విభాగము చేయబడినట్లు తోచుచున్నది. మహాపురాణముల కుపపురాణములువలె వేదములకు గూడ నుపవేదములున్నవి కావున, నీయుపగ్రంథముల సాంప్రదాయము మనకు వేదకాలమునుండియు నున్నదని యూహింపవచ్చును. ఋగ్వేదమున కాయుర్వేదమును, యజుర్వేదమునకు ధనుర్వేదమును, సామవేదమునకు గాంధర్వవేదమును, అథర్వవేదమునకు స్థాపత్య వేదము నుపవేదములై యున్నవని "చరణవ్యూహ" మను గ్రంథముచే దెల్లమగుచున్నది. దీనినిబట్టి ఆయా యుపవేదములు ఆయా వేదముల పేర్లతోడనే యుండనక్కఱలేదని స్పష్టమగుచున్నది. అట్లే అష్టాదశ మహాపురాణములును, అష్టాదశోపపురాణములును నామసామ్యములేక భిన్ననామములతో వ్యవహృతములగుట మన మెఱుంగుదుము. భాగవతము, భవిష్యత్తు, వామనము, వరాహము మొదలగునవి మహాపురాణములే. అయినను ఆ పేరులతోనే వాని యుపపురాణములు లేవు. దేవీభాగవతము, వాసిష్ఠము మొదలగున వుపపురాణములు—

పదునెనిమిది మహాపురాణములలో స్కాందపురాణమొకటి. ఈ స్కాందపురాణములు రెండగపడుచున్నవి. అందొకటి మహాపురాణమనియు వేఱొకటి ఉపపురాణమనియు చెప్పుచున్నారు. పరికించి చూచిన రెండును మహాపురాణములే యని కొందఱు భావించినట్లును గనబడుచున్నది. ఈ యంశములను నే నెఱిగినంతవఱకు వ్యాసమున పాఠకుల కెఱింగింప యత్నింతును.

"స్కాందం తు సప్తధా భిన్నం
వేదవ్యాసేన ధీమతా
ఏకాశీతి సహస్రాణి
శతం చైకం తు సంఖ్యయా."

అను స్కాందపురాణ వచనమునుబట్టి యేడు ఖండములు గలిగి ౮౧౧౦౦ శ్లోకములతో నొప్పుచున్న దొక స్కాందపురాణము. అదియే—

"మాహేశ్వరో, వైష్ణవ, బ్రాహ్మకాశ్య
స్త్వవన్తికా నాగర మత్రపష్ఠమ్
ప్రాభాసికో విప్రవరేణ ఖణ్డాః
స్కాందే పురాణే కథితా స్సుపుణ్యాః."

మాహేశ్వరము, వైష్ణవము, బ్రాహ్మము, కాశి, నాగరము, అవంతికా, ప్రభాసము అను నేడు ఖండములతో నొప్పునది. ఇదియే మహాపురాణములలోని స్కాందమని దానిని ముద్రించి ప్రకటించిన బొంబాయిలోని "వేంకటేశ్వర స్టీం" ముద్రాలయాధిపతి ఖేమరాజశ్రీ కృష్ణదాస పండితుడు తత్పీఠికలో నుడివియున్నాడు. పై శ్లోకములో నిది మహాపురాణమని గాని ఉపపురాణమని గాని లేదు.

మఱొక స్కాందపురాణమును గూర్చి తదంతర్గతమగు సనత్కుమార సంహితలోని కాళికా ఖండ ప్రథమాధ్యాయమును బట్టి యిట్లు తెలియుచున్నది.

"పురాసంశయ మాపన్నః కృష్ణద్వైపాయనో మునిః
ప్రణిపత్య సకైలాసే కుమారం భవవల్లభం
స్కాందం పురాణం సంప్రాప పంచాశత్ఖండమండితం,
షడ్విధం సంహితా భేదైః శివసర్వ మహార్ణవమ్.
సనత్కుమారః శ్రుతవాన్విస్తరాత్తన్ముఖోదితమ్
సనత్కుమార శిష్యేణ మమ వ్యాసేన దర్శితమ్,
తద్వదామ్యానుపూర్వేణ శ్రుణ్వన్తు పరమర్షయః.

పై శ్లోకములనుబట్టి శివప్రియుడగు కుమారస్వామివలన సనత్కుమారుడీ పురాణమును శివ

ధర్మములతో నిండినదానిని బొందినా డనియును, ఆ సనత్కుమారునివలన వ్యాసుడు వినినా డనియు దెలియుచున్నది. ఈ స్కాందపురాణ మాఱు సంహితలుగా విభజింపబడి యేబది ఖండములతో నొప్పు చున్నది. అందు మొదటిది సనత్కుమార సంహిత. ఇం దిరువదియైదు ఖండములు నేబది వేల శ్లోకములును గలవు.

"ఆద్యా సనత్కుమారీ యా సంహితాఽస్మిన్ పురాణకే
సా పంచాశత్సహస్రేణ కథితా విస్తరాద్ద్విజాః
పంచవింశతి ఖండైశ్చ ఖండితా శ్రుతిసమ్మితా
క్షేత్రఖండః ప్రథమతో ద్వితీయ స్తీర్థఖండకః
వర్షేఽస్మిన్ భారతేయాని తీర్థక్షేత్రాణి సత్తమాః
శైవాని వైష్ణవా న్యేవ కథితాని సువిస్తరాత్
కాశీఖండ, స్తృతీయస్తు ఖండస్సహ్యాద్రి సంజ్ఞకః,
హిమాచలాఖ్య ఖండస్తు, మలయా చలఖండకః,
వింధ్యాద్రిఖండో, మేరాఖ్యః ప్రభాసః, పుష్కర స్తథా
నాగరాఖ్య స్తతః ఖండో, నర్మదాఖండ ఏవచ,
శ్రీశైల ఖండో విఖ్యాతో, హ్యవంతీ ఖండ ఏవచ,
గౌరీ ఖండ స్తతో విప్రాః, కురుక్షేత్రాఖ్య ఖండకః
కేదార ఖండ స్తస్య పరో, హరిద్వారాఖ్య ఖండకః
సేతుమాహాత్మ్య ఖండాఖ్యః, కాళికా ఖండ ఏవచ,
తతో వ్యాఖ్యాన ఖండశ్చ, నదీఖండ స్తథైవచ,
ధర్మఖండో, దేశఖండో, వర్షఖండ స్తథైవచ,
ఏతే సనత్కుమారీయ సంహితాయాం ప్రకీర్తితాః"

తక్కిన యైదు సంహితలును క్రమముగా ౧ సూతసంహిత, ౨ వైష్ణవసంహిత, ౩ బ్రాహ్మసంహిత, ౪ శాంకరసంహిత, ౫ సౌరసంహిత అనునవి.

"ద్వితీయా సూతసంజ్ఞాహి సంహితా పరికీర్తితా
చతుర్ధా ఖండితా సాపి పవిత్రా వేదసమ్మితా.
శివమాహాత్మ్య ఖండాఖ్యః ప్రథమ స్తత్ర కీర్తితః
ద్వితీయో జ్ఞానయోగాఖ్యః, తృతీయో ముక్తి ఖండకః,
చతుర్థ స్తత్ర విఖ్యాతో యజ్ఞవైభవ ఖండకః,
బ్రహ్మగీతా, సూతగీతా, ద్వితీయం తత్ర కీర్తితం
సప్తషష్టిభిరధ్యాయైః కీర్తితాః ఖండికాః పునః
..........................
నాగరాఖ్యో హి ఖండస్తు,
ప్రాయశ్చిత్తాఖ్య ఖండకః,
సూతాఖ్యాయాం తు శాంకర్యాం
ఖండా స్తే పంచ వింశకాః
ప్రోక్తాః షట్త్రింశ సాహస్రై
స్సంఖ్యయా మునిసత్తమాః
ద్విసహస్ర వరాధ్యాయై
స్స్కాందేవై సంహితా ద్వయం
వైష్ణవీ దశ సాహస్రా
సంహితేయం ప్రకీర్తితా,
విష్ణు ధర్మప్రశంసా చ
కీర్తితా సా శతత్రయైః
అధ్యాయై ర్ద్వ్యనయ స్తత్ర
బ్రాహ్మీ తు త్రి సహస్రికా
తత్రత్ త్రిరో మహాన్ ఖండ
స్స బ్రహ్మోత్తర సంజ్ఞకః
సౌరీతు సంహితా షష్టి
సహస్ర శ్లోక సంయుతా
స్కాంద మేతల్లక్ష మానం
స్కందో యత్కథయత్ పురా.
సనత్కుమార మునయే
తస్మాచ్ఛ్రావ మే సురః
తేన సంశ్రుత మే తద్ధి
తద్వ క్ష్యామి సత్తమాః
ఖండస్తు కాళికాఖ్యోఽయం
ధర్మసార మహోదయః.
"నాథ క్తాయా వినీతాయ
ప్రదేయోఽయం విశేషతః
ఇతి శ్రీమత్ స్కాంద ఉపపురాణే సనత్కుమార సంహితాయాం కాళికాఖండే ప్రథమోఽధ్యాయః"

పైవాక్యములను బట్టి ఆఱు సంహితలు గలిగియే బది ఖండముల నొప్పుచులక్ష శ్లోక పరిమితమగు నీ స్కాంద ముపపురాణమని తెలియుచున్నది. మాహేశ్వరాది ప్రభాసాంతములగు సప్తఖండములతో నొప్పునట్టిది మహాపురాణ మనుచున్నారు. కాని యీ వాదమునకు కొన్ని విప్రతిపత్తులున్నవి.

శ్రీనాథ మహాకవి తెనిగించిన కాశీఖండమును బట్టియు, తుర్కాపాజ కవి—అయ్యంకి బాలసరస్వతులు తెలిగించిన నాగర ఖండమును బట్టియు నీస్కాందపురాణవిషయము కొంత తెలియు

చున్నది. శ్రీనాథుడు ఆదిపురాణములను, ఉపపురాణములను ప్రశంసించి తన కాశీఖండమునకు మూలమైనది మహాస్కాందమే యనుచున్నాడు. రెండవస్కాందమునుగూర్చి యాతడేమియును ప్రశంసింపలేదు. శ్రీనాథుడు కాశీఖండాదిని పురాణ ప్రశంసచేయుచు నిట్లు వ్రాసినాడు—

కవిసార్వభౌముడగు శ్రీనాథుడు తెలుగుచేసిన కాశీఖండము మహాస్కాందపురాణము లోనిదే. శ్రీనాథుడు కథాప్రారంభమున పురాణ ప్రశంస చేయుచు నిట్లను—

"పద్మాదికంబులు పదియు నెనిమిదియు
 నాది పురాణంబు లా పురాణ
జాతంబు నాల్గులక్షల సంఖ్య గలయది
 యుపపురాణంబులం దుద్భవించెఁ
బదునొకండవదియై బహు సంహితలతోడ
 బహు ముఖంబులతోడ బహు విచిత్ర
కథలతో నేక లక్ష గ్రంథ పరిమాణ
 కలితమై శ్రీ మహా స్కాందమొప్పు
నమ్మహా స్కాందమునకు సారాంశమనఁగ
నాల్గు పురుషార్థములకుఁ బ్రాపక మనంగ
బ్రహ్మవిద్యకు నాది కారణ మనంగ
నఖిల ఖండంబులందుఁ బ్రఖ్యాతి కడచె."

అనియును—

ఉ॥ స్కాందపురాణ సంహితకు ఖండము లేబది, అనియును జెప్పి "యిమ్మహా స్కాందమ్మునకు నవయవంబు లాఱు సంహిత లవి క్రమంబున సనత్కుమార సంహిత పంచ పంచాశత్సహస్రిక, సూత సంహిత షట్సహస్రిక, శాంకరసంహిత త్రింశత్సహస్రిక, వైష్ణవసంహిత పంచసహస్రిక, బ్రహ్మసంహిత త్రిసహస్రిక, సౌర సంహిత ఏకసహస్రిక యీ ఖండంబులందు బంచనాగరఖండంబు, కమలాలయ ఖండంబు, రేవాఖండంబు, నేకవీర ఖండంబు, మైలారఖండంబు, గోదావరీఖండంబు లివియాదిగాగల పంచాశత్ఖండంబులందు"ను కాశీఖండము ప్రసిద్ధమని ప్రరోచన గావించెను.

పైని జూపిన కాళీకాఖండవాక్యములకును శ్రీనాథకృత కాశీఖండములోని వాక్యములకును సంహితలు - ఖండముల విషయములో సామ్య మగపడుచున్నది. కాని శ్రీనాథమహాకవి యేబది ఖండముల స్కాందమును మహా పురాణముగా చెప్పుచున్నాడు—"పదునొకండవదియై బహు సంహితల తోడ బహు ఖండములతోడ బహు విచిత్ర కథలతో...." అని. మఱియును శ్లోకసంఖ్యలు గూడ శ్రీనాథుడు చెప్పినవియు కాళీకాఖండములోనివియు కొంచెము భేదించుచున్నవి. శ్రీనాథకృతమైన మఱియొక కృతి భీమేశ్వరపురాణమునకును ఇమ్మహాస్కాందమే మూలము. అందాతడు:—

"బంధుర సపాదలక్ష
గ్రంథంబై యైదు పదులు ఖండంబులతో
సంధిల్లు స్కాందంబన
సింధువునకుఁ గాల్వలమరిచినచందమునన్."

"అరవిందాప్తకృత ప్రతిష్ఠమగు ద
 క్షారామ భీమేశ్వ రే
శ్వరు మాహాత్మ్యముతోడఁ గూడి భువన
 శ్లాఘాస్పదంబై యథం
గురమై స్కాందపురాణ సారమగు శ్రీ
 గోదావరీ ఖండమున్
బరిపాటిన్ రచియింపు మంధ్ర జగతీ
 భాషా ప్రబంధంబుగన్."

వ. సర్గప్రతి సర్గవంశ మన్వంతర వంశాను చరితంబులను పంచలక్షణంబులతోడం గూడి సపాద లక్ష గ్రంథ సంఖ్యాసమన్వితంబై పంచాశత్ఖండ మండితంబై బహు సంహితా సమాకీర్ణంబై శ్రీ మహా స్కాందం బను నాదిపురాణంబునందు గోదావరీఖండంబు శ్రీమద్దాక్షారామ భీమేశ్వరమాహాత్మ్య సంయుతం బగుటంజేసి భీమేశ్వర పురాణం బనం బరగునది యాంధ్రభాషా ప్రబంధంబుగ జెప్పం దొడంగితి..." అని చెప్పినాడు. దీనింబట్టి ఈ యేబదిఖండముల స్కాంద ముపపురాణము కాదనియు ఆదిపురాణములలో నొక్కటగు మహాపురాణమే యనియును సుస్పష్టమగుచున్నది. శ్రీనాథుడు మహాపురాణములు పదునెనిమిదింటిని ఆది పురాణములనియు జెప్పెను. భీమఖండవాక్యములో "శ్రీ మహాస్కాందంబను నాదిపురాణంబునందు" అని 'ఆది—మహా' శబ్దములు రెంటి నుపయోగించి పాఠకుల సందేహమునుగూడ దీర్చెను.

స్కాందపురాణములలో మొట్టమొదటి ఖండ

మను నాగరఖండమును తెనుగు చేసిన "తుర్కా రాజ కవి, అయ్యంకి బాలసరస్వతి, అను కవులిరువురు గూడ నిది మహా పురాణమనియే చెప్పిరి:—

"పారాశర్య ప్రోక్తంబులైన పదునెనిమిది పురాణంబులయందు మహా స్కాందంబు శత సహస్ర గ్రంథ బంధురంబయ్యె. నందు సౌరసంహిత వేయి. శాంకర సంహిత ముప్పది వేలు. వైష్ణవసంహిత యైదు వేలు. బ్రాహ్మసంహిత మూడు వేలు. సూతసంహిత యాఱువేలు. సనత్కుమార సంహిత యేఁబదియైదు వేలు. ఈ సంహితలందు నాగరఖండంబును, బ్రహ్మోత్తర ఖండంబును, కేదార ఖండంబును, శ్రీశైలఖండంబును, హైలావర ఖండంబును,... గాయత్రీ ఖండంబును మొదలుగాగల యేఁబది ఖండంబులు మించు నందు—

"ధరలోనఁ దశమాష్ట నామము ప్రసి
ద్ధప్రక్రియం బొల్చుచుఁ
స్థిరమైయొప్పు పురాణముల్వరబుధ
శ్రేణుల్ ప్రమోదించి చూ
తురు విభ్రాజిత విశ్వకర్మ మహిమా
స్తోకంబులై యొప్పు నా
గర ఖండంబు దనర్చు ఖండములలో
స్కాందాగ్ర భాగంబునన్."

కాశికాఖండము స్కాందమునకు మొదటి ఖండము క్షేత్రఖండమని నుడువుచున్నది. శ్రీనాథుడు నాగర ఖండమని చెప్పినాడు. నాగరఖండమును దెనిగించిన పై కవిద్వయము స్కాందములో మొట్టమొదటిది నాగరఖండమని సుస్పష్టము చేసినారు. ఆయా సంహితలలోని శ్లోక సంఖ్య శ్రీనాథుడు చెప్పినదియు నాగరఖండకవులు చెప్పినదియును సరిసమముగనే యున్నది.

దీనిం బట్టిమాఁడ యేఁబదిఖండముల స్కాందమే యాదిపురాణమగు మహా స్కాందమనియు, ఏడు ఖండములది యుపపురాణమగు స్కాందమనియు దోఁచుచున్నది. ఇందు కీ యాంధ్ర మహాకవుల సాక్ష్యమే బలవత్తరమైనది. కాశికాఖండవాక్యములు ప్రక్షిప్తములేమో యనిపించెడిని. ఇట్టి ప్రక్షిప్తములు-నూతన సృష్టులు మన పురాణాదులలో వేనవేలున్నట్లు మనము గుర్తింపగలము. కాశికాఖండ వాక్యములు ప్రక్షిప్తములు కావన్నచో మహాకవియగు శ్రీనాథుడును, అయ్యంకి బాలసరస్వత్యాదులును పొరపాటుపడి రనవలయును. కాని మహా పురాణజ్ఞాన ఖనియగు శ్రీనాథుని కీ ప్రమాదము నంటగట్టుట యెంతవఱకు సమంజసము?

స్కాంద పురాణము ననుసరించి వ్రాయబడిన మఱియొక సుప్రసిద్ధ కావ్యము 'పాండురంగ మహాత్మ్యము' అందు తెనాలి రామకృష్ణకవి—

"స్కాందపురాణ నీరనిధి
కౌస్తుభమై ప్రథవించు దేవకీ
నందను సత్కథోద్యమము
నవ్య కవిత్వ కళాకలాపమున్
కుందనమున్ ఘటించి కడుఁ
గ్రొత్తగ సొమ్మొనరించి విష్ణుసే
వం దిలకించు సత్పరమ
వైష్ణవకోటి నలంకరింపుఁడా!"

అని వ్రాసినాడు. దీనింబట్టి యిది యే స్కాందము లోనిదో తెలియుటలేదు. ఆ యుభయపురాణములను బరిశీలించి దీని నిదమిత్థమని తెల్పవలయును. మఱియు కాశికాఖండము సూతసంహితలోను, సనత్కుమార సంహితలోను గూడ నాగరఖండ మున్నట్లు చెప్పుచున్నది. అనగా ఒకే స్కాందములో రెండు నాగర ఖండము లన్నమాట. ఇది యొక యనుపపత్తియై కాశికా ఖండవాక్యములు ప్రక్షిప్తము లనుటను బలపఱచుచున్నది. ఏడు ఖండములుగల కాశీఖండములో గూడ నొక నాగరఖండ మున్నది. పై యంశములను విజ్ఞులింకను ఆలోచించి చూతురుగాక.

ఆంధ్ర నాగరఖండము స్కాందములో దరిదాపు ముప్పది ఖండములను నామతః నిర్దేశించుచున్నది. కాశికా ఖండమే బది ఖండములను పేర్కొనుచున్నది. ఆ ఖండముల పేరులనుబట్టి చూచినచో నీ స్కాందపురాణములో భారతీయచరిత్ర మత్యద్భుతముగా వర్ణింపబడినట్లు తెలియుచున్నది. తెలుగు మొగము చూచిన ఖండములు కాశీ, నాగరఖండములు రెండే. తక్కిన ఖండములలోని చరిత్ర యాంధ్రభాష కనవగతము. ఈ నాడు సమగ్రముగ నీ స్కాంద పురాణము దొరకి యన్ని ఖండము లాంధ్రీకరింప బడు నెడల చాల మేలు గలుగగలదనియు, భారతదేశపు ప్రాచీన చరిత్రము చాలవఱకు వ్యక్తము కాగలదనియు తోఁచుచున్నది. ఆధునిక కాలమున పురాణములపట్ల వైముఖ్యమున్నను, వలసినంతవఱకేని మంచిని గ్రహించుట దేశమునకు మేలని చెప్పవచ్చును; అది గుణ గ్రహణ పారీణుల లక్షణముగూడనగు.

# మహోదయము

శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి




అవిట నాదికాలమున నాదిమదైవతియా విధాత యా
హ్లాదము తోడ నెల్లప్రజలన్ సృజియింపగఁబూని, నేరమిన్
ఖేదమునొంది, డెందమును గ్రిందును మీదొనరింప గొందలం,
బేదియు బాలుపోక, పొనరించె దుదిం దపమున్ మహోగ్రమున్.

ఫలము లొసంగి సాధుల తపమ్ముల నెల్ల సుసార్థకమ్ములం
జలుపు తపోమయుండు హరి, దయ్యవవానికి సుప్రసన్నుడై,
వలయు నభీప్సితార్థమును వారక కూరుతు గోరుకొమ్మనన్,
బలుక నమస్కరించి యిల వాల్గకిరీటము లంట, నిట్లనున్.

దేవ! మహానుభావ! ప్రకటిదీపిత దివ్యతరస్వభావ! సం
జీవిత సర్వజీవ! పదసేవకబృంద విమోహబంధము
ద్రోవ, స్వభక్తమానవ వినోదము గావ, భవాంబు రాశికిన్
నావ, మునాది సర్వసుమనస్సుల గూరిమిఁ బ్రోవ, నీవనా.

గుణములు లేనివాడ, వతిగూఢుడ, వాద్యుడ, వయ్యు, బూనితై
గుణములు మూడుమన్, భువనకోటుల నెల్ల సృజించి, పెంచి, యుం
డణువు మిగుల్పబోక లయమందగఁ జేయుచు నుందువీ, వహో!
గుణములకున్ గుణత్వ మెనగూడెను నీవలనన్, గుణాత్మకా!

నీయానం దిల దాల్చి యెల్లప్రజలన్ నిర్మింపగా బూని, నీ
మాయాదానుర జిక్కి, లోపకెదియున్, మాధ్యంబు గైకొంటి; నో
మాయాతీత! యమేయవైభవ! చిదాత్మజ్యోతి! వేవేగ మే
పాయం ద్రోసి మదీయ జాడ్యమును, గాపాడంగదే కేశవా!

ఏ సంభారమొ? ఏ మషీరసమొ? ఏ కుంచె? ఏ చిత్రమో?
ఏ సంపారమొ? ఏ ప్రరంబొ? ఎది ఏదేచోటనో? ఎట్టులో?
వీసంబేనియు గోచరింపదు మనోవీధిం; బ్రయావీథియున్,
దోసం బేదిరొ, సంస్ఫురింపదు, పదుదోగ్యగంబునన్ స్తబ్ధనై.

మూలము గానరాక సలుమాలల నేకమహార్ణవంబుగా
వేలలు దాటి పొలుచు గభీరతరంబగు వారి రాశిలో,
గాలికి నిల్పి తమ్మివిరికాడ యొకండు, సృజించినాడ వా
కాలమునందు నన్ను; గలకాలము నట్టులె బమ్మ కేనిదే?

తమ మర్యాదలతో, స్వసేతువులతో, ధాత్రీధరద్వీప సిం
ధు మహారణ్య పురవ్రజాదికములం దోడ్తో బ్రకల్పించి, భ

వ్య మనోజ్ఞాకృతు లొప్ప, దేహులను గూర్పఁగ నేర్తునే నేను ? శ్య
ర్థముగాకుండ ద్వదీయశాసనము, మార్గంబుఁగ దయంజూపుమా.

అని వనజాసనుండు వినయంబున వేడుకొనం, బయోజ లో
చనుడు, నిజాస్యదంతవిలస ద్రుచిమండల రాజబింబ మా
గని చిఱునవ్వువెన్నెలలు గాయ, గనుంగొనె శ్రీముఖాంబుజం
బును, రసశోభనంబయి విమోహనమైన యపాంగదృష్టితోఁ.

ఆ తరుణంబునందు నజుఁ డబ్బురమొందగ నుద్భవించె, ల
క్ష్మీతరుణీమణీ మృదుల మృష్ట తనూలతనుండి, బంగరుం
బోతమెఱుంగు పొంగెసగ, మోహనమోహనమైన యద్భుత
జ్యోతియొకం, డపూర్వ మహిమోజ్జ్వల దివ్యమనోజ్ఞమూర్తితోఁ

ఆ మహితోదయక్షణ మహామహిమంబొ, రమామనోహరో
ద్దామ విశేషణస్మిత విధాన విసారి రసప్రభావమో,
యేమి విశేషమో ! ప్రకృతియెల్ల ప్రఫుల్లలతాంతమంజరీ
దామపరీమలంబుల దళంబయి, రాగమితంబుగా దగెఁ.

భూతము లైదునయ్యెడల, బూతములై, యమితంబులై, మిథః
స్ఫీతములై, జగజ్జనన జీవన హేతువులయ్యె ; నమ్మహా
జ్యోతి సముద్భవించి యటు లొప్పెసలారుడు, లోకబాంధవ
ఖ్యాతి గడింప నేర్చి రమ్యతాంశుఖరాంశులు ప్రేమమూర్తులై.

అమృతమయాత్ములైన కమలాచ్యుత దేవుల యాత్మనుండి య
ట్లమృతము జాలువాఱి వరమై రసనిర్భరమై చెలంగ, స
ర్వము ప్రణయామృతామృత తరంగతరంగితమై యమోఘ రా
గమయ మహాసుఖాబ్ధిరతి గైకొని తేలఁదొడంగ నత్తఱిఁ.

కోమల కోమల ప్రసవ కుట్మల మంజుల మోహనాంగక
స్తోమముతోడ, దివ్యమయితోచు శరీరముతోడ, బూరుషుం
డై మెఱుగొందు జ్యోతియది ; అంత, రమాపతియుఁ, ముదంబుతో
నామము పెట్టి మన్మథుఁడనంగ, మనోజుఁడనంగ, వానికిఁ.

ఉభయ సంధ్యలలోన సుబుకెత్తు రాగంబు
భువన మోహనమంత్రముగ నయించి,
ప్రతి పర్వమున సుధారసము చిందులువోందు
విమలేక్షు దండంబు విల్లుజేసి,
వలపు సౌరభముల బదనువాఱిన విరి
పూవు సుత్తుల బాణముల నమర్చి
ప్రకృతి శృంగార గాయక సుమంధయరాజ
కులముల యలెత్రాడు లలవరించి,
తగ ప్రయోగంబు దెలిపి, రొమసగి, మనఃకు
హర శరవ్య శరాదు శేఖరుని జేసి,

విస్తృత ప్రేమమయ జగద్విరచనమున
సుధగు నవ్వాని సుఖరతికారు జేసె.

నిజమృదుపదార విందవినిర్గత శుభ
గాంగతోయంబున నభిషేకంబు జరపి,
ప్రణయ సామ్రాజ్య సార్వభౌముని బొనర్చె
భావజుని వాని శ్రీరమావల్లభుండు.

అట్టుల నవ్విక చారవిందాక్షుండు
సెనరున స్రష్టకు ననిరొమి నిట్లు :
చతురాననా ! కంటె ? చతురు డన్నిట, ఘను
డివ్వాని మహిమ కెంతేని గలదు ;
సర్వకామమయుండు, సర్వశక్తిపరుండు,
సర్వమోహనమూర్తి, సర్వకర్త ;
చెలగు నీతినియందు సృష్టిబీజములెల్ల ;
సూత్రించి మాపున జూపగలడు ;
కుసుమ శరు డయ్యు, నిత డనితుంతవీర్య
శౌర్య సముద్రుడు, డత్యంత సాహసికుడు ;
నాకసంవాసులేని గిల్లాకుబంటు
లగుచు, దలదాల్తు రీఘను నాన విడక.

కాని చనుము పీని కలన, నీకానిన సృష్టి
సాగు ; నెలమి నీ భువన సంస్థాన మొప్పు ;
సాక్షిమాత్రుడవయి రెల్ల జగములకును,
పరమ శాంతిని గొను మీవు పద్మభవుడ !

అనుచు ననుగ్రహింప గమలాలయ నెయ్యుడు, వాని శ్రీతిపై
గొని చని స్వీయధామమునకుం, గమలాసను, డెల్లకర్త మా
నవభిలు కౌనిపై నిడి, ఘనంబుగ నిర్వృతినొందె ; నాడుగా
నొకరి లేదానతిన్ జరుగుచున్నది లెస్సగ సృష్టియంతయున్.

ఆవిరివిల్తు డీవగదవయ్య రమాసుకుమార ! కల్వపూ
దీవ మెలుంగుబోసి తరితీపుల చెల్వుడవై, దయార్ద్రుడై,
దైవతపంక్తికిం దన సుధామయ దేహము విందుచెట్టుచుం
బావనమూర్తియౌ విష్ణుడు, వానిని నీకు నసుంగుమామయా.

చిలుక హుమాయి తోడుపు, విచిత్రము నీదు చరిత్రమెల్ల ; నీ
బలముల నంగవించి నిలువంగల జోదెవడేని యేపాలం
బుల నెపుడేని గానబడబోడన సందియమా ? ఉరమ్ముగన్
నిలుపుకొనంగ జేసితివి నెచ్చెలినిన్ హరియంత వానినిన్ !

అరయంబో కరమేన మున్న గిరికన్యారత్నమున్, గాటమా
నరితిం బర్విడిదాని, వేడుకొని, మాయా మోహినిం, దన్కృపా

పరిరంభంబున వ్యగ్రు జేసితివి మున్, బాలేందుమౌళిన్ ; సుదు
స్తర సంకల్ప బలప్రమేయుడవు కందర్పుండ! నీ వంతయున్.

విరసములైనవాని సరవిన్ సరసంబుల జేసి, వానితో
సరగ ప్రసక్తినొంది, సరసంబుల మాన వినోదకంబు న
బ్బురముగ నాడ్చి పుచ్చి, కడు ప్రోపున నేపున ప్రజ్వలింతు, వీ
నరయగ బాహ్యకాధిక మహాద్భుత తేజుడవోయి భావజా!

అలరుల కెంపుమావి యిపురాకుల జంకెనతోడ, గండుకో
యిలల కుహూకుహూ కులుకు పిల్పులతోడ నదల్చి, రువ్వి క్రొ
వ్వలపుల దువ్వరల్, విరుల బాణము వేసి, జతంగదించి, యి
మ్ముల, సరసప్రపంచముల పూవుల పూజలు గొందువో స్మరా!

ఓ రతిరాజ! నీదు మహిమోన్నతి సన్నుతిసేయ నేర్చు వా
రేరి? జగత్త్రియంబు, భవదీయ దయాభ్యుదయాను మంగళాం
గార సుధారసస్రుతి, ని గారముతో ప్రసరింపకున్నచో,
నీరసమై, విజీవమయి, నిష్కళమై, విరమించి పోవదే?

విరసంబైన భవావనీజము, భవద్వీక్షా సుధాసిక్తమై,
సరసంబై విలసిల్లి, కాయు మృదులాచ్ఛచ్ఛాయలన్ ; స్వైరసుం
దర కాంతా కమనీయ వీక్షణ తనుండా! పుష్పబాణుండ! నీ
కర కోదండ గుణధ్వనుల్ తనుపు మా కల్యాణ గీతంబులై.

పవిధారాహతి కేని, తాపస జన త్వంకార హుంకార కో
పవికారమ్మునకేని రోడవు భవద్బాణంబు ; లీరెల్ల నీ
యువదానంబున లెస్స నిల్చు ; భవభావాభావ భావంబు లు
ద్భవమొందుం జుమ్ము నీదు పేరిమి ; మహాదర్పుండ! కందర్పుడా!

నీ కూర్మిన్ నిఖిల ప్రపంచములు నిర్నిద్రప్రభామంగళ
శ్రీ కల్యాణ గుణాల వాలుములుగా జెన్నారుటన్ ; నిండి, సర్వ
ల్లోకాధీశుడు సాంద్ర ముత్పులకముల్ పొంగారి మీఱన్, శచీ
రాకాచంద్రముఖీ పృథు స్తన పరీరంభంబునం గల్గుటన్.



# ఎస్టేటుపన్ను విధానము



శ్రీ చావలి వెంకటహనుమంతరావు

వివిధ రాష్ట్రములలో అభివృద్ధి ప్రణాళికలను ఆచరణలోనికి తెచ్చుటకై కావలసిన ధనము సేకరించుట ఆయా రాష్ట్ర ప్రభుత్వముల యొక్కయు కేంద్రప్రభుత్వము యొక్కయు బాధ్యతయైయున్నది. దీనికై క్రొత్తపన్నులు విధించుట ఒక ముఖ్యమార్గమని ప్లానింగ్ కమీషన్ వారు తమ నివేదికలో వ్రాసియున్నారు. పన్నులు విధించవలసి వచ్చిన ఏయే పన్నులు విధించుటయా, యని ఆలోచన వచ్చినప్పుడు ఎస్టేట్ డ్యూటీ అన్నివిధముల తగియున్నదని చెప్పవలసియున్నది. పన్నుల విధానమునకు సంబంధించిన సూత్రములనుబట్టి చూచిన ఈ పన్ను విధించుట న్యాయముగాను, సమంజసముగాను కన్పట్టును. పెద్ద భూకామందులు, ఇతర ధనవంతులు చనిపోయినప్పుడు వారు సంపాదించి నిల్వచేసిన ఆస్తులపై ఈ పన్ను విధించబడును. అట్టి ఆస్తుల విలువనుబట్టి, అవి సంక్రమించే వారికి, ఆస్తి సమకూర్చిన వారికి గల సంబంధ బాంధవ్యములను బట్టి పన్ను రేటు నిర్ణయింపబడుటచే, దానివలన ఎవ్వరును ప్రత్యేక భారము మోయుట కవసరముండదు. ఆదాయపు పన్ను తరువాత, ఈ పన్నంత ప్రభుత్వాదాయము హెచ్చుటకు తోడ్పడునట్టి పన్ను ఇంకొకటి లేదని చెప్పవచ్చును. అదీకాక ఆస్తి కలవారి పైననూ, అది భరించుటకు శక్తి కలవారి పైననే అది విధింపబడుటచే న్యాయ దృక్పథమునుండి కూడ అది అసమంజసమైనదని చెప్ప వీలులేదు. ఈ కారణములను బట్టియే అనేక దేశములలో "ఎస్టేటు పన్ను" లేక "మరణానంతర సుంకము" ఆచరణలో పెట్టబడినది. ప్రజలలో ఆర్థిక భేదములను, తారతమ్యములను తగ్గించుటకు, దేశాభ్యుదయమునకు అవసరమైన ధనము సంపాదించుటకు ఆదాయపు పన్నునకిది తోడ్పడుననుటకు సందేహము లేదు.

ఈ పన్నును మన దేశములో విధించుట మంచిదా కాదా యను విషయములో అభిప్రాయ భేదములు లేవని చెప్ప వీలులేదు. కాని దానికి సంబంధించిన వివిధ కష్టనిష్ఠురముల నాలోచించిన, మొత్తముమీద దాని కనుకూలముగ అభిప్రాయమే ప్రబలముగ నున్నట్లు తెలియగలదు. మన దేశపు ఆర్థిక వ్యవస్థ సరిగా లేదనియు, దానిని పెంపొందించుట అత్యంతావసరమనియు, దానికై ధనము అవసరమనియు ఎల్లరంగీకరించినదే. ధన సేకరణకై ఇతర విధములైన పన్నులన్నియు ఇదివరకే ఏదో ఒక రూపకముగ, కేంద్ర ప్రభుత్వము వారో, రాష్ట్రప్రభుత్వములో విధించుచున్నారు. బీద జనులపైనను, మధ్య తరగతివారిపైనను ఇంక ఎక్కువ పన్నుల భారము విధించిన వారి ఆర్థికస్థితి ఇప్పటికంటె అధ్వాన్నమగు ననుటలో సందేహము లేదు. ఇప్పుడు కాని, ఇకముందుకాని ఏ పన్నులు విధించినను, అవి ధనవంతులు, వాటిని భరించకల్గిన వారిపైన మాత్రమే విధించుట న్యాయముగ నుండును. ఇప్పుడు ధనవంతులపై పన్నుల భారము తక్కువగా నున్నదని కాదు; కాని బీద జనులకంటె వారు కొంతవరకు ఎక్కువ భారము మోయగలరనియు, దేశాభ్యుదయమునకై మరికొంత త్యాగము అవసరమైన దానిని వారుమాత్రమే చేయగలరనియు అంగీకరింపక తప్పదు. ఇట్టి త్యాగము చేయుటకు వారుకూడ సంసిద్ధులై యుందురు. ఎస్టేటు పన్ను అట్టి త్యాగము చేయుటకు శక్తి కల్గియున్న వారిపైననే విధింపబడు పన్ను కాబట్టి అది సమంజసమైనట్టియు, న్యాయమైనట్టియు పన్నని అంగీకరింప వలసియున్నది.

ఎస్టేటు పన్నులు లేక "మరణ సుంకములు," "అప్పుడప్పుడు విధింపబడే ఆస్తిపై పన్నుల"ని ఆర్థిక శాస్త్రజ్ఞులు నిర్వచించియున్నారు. ఈ విధమైన పన్నుల ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్స్ మొదలగు దేశములలో కొన్ని సంవత్సరము ండి విధింపబడుచున్నవి. వాటిని గురించిన విధానము నిర్ణయించు

టలో గమనించవలసిన విషయములు రెండు మూడు కలవు. మొదటిది: ఈ పన్ను ఎవరిపై పడును, అనగా దానిని భరించువా రెవరు? రెండవది: ఒక కుటుంబములో వారసులు త్వరత్వరగా మరణించినచో, ఒక్కొక్క ఆస్తిదారుడు మరణించి నప్పుడెల్లా ఈ పన్ను వసూలుచేయబడిన, దాని భారమువలన ఆ కుటుంబపు ఆస్తి త్వరలో క్షీణించునా లేదా? మూడవది: ఈ పన్ను సాధారణముగ ఆస్తుల విలువపై విధింపబడు నదగుటచే, చిన్న ఆస్తులపై కొద్ది పన్ను. పెద్ద ఆస్తులపై హెచ్చు పన్ను విధించుటవలన, పెద్ద ఆస్తులను సంపాదించుటను ఎంతవరకు ఇది నిరుత్సాహపరచును?

ఈ విషయములను జాగ్రత్తగ పరిశీలించియే ఎస్టేటు పన్ను విధానము నిర్ణయించుట ముఖ్యము. దానిని విధించుటవలన తెలివితేటలు, బుద్ధికుశలత నుపయోగించి వ్యక్తులు పెద్ద ఆస్తులను గడించుటకు ప్రయత్నము చేయుట కడ్డురాకుండునట్లు చూచుట అవసరము. అటుపైన, దగ్గర వారసులకు సంక్రమించే ఆస్తి భాగములపై తక్కువ రేట్లు ప్రకారము, దూరపు వారసులకు సంక్రమించే భాగములపై హెచ్చు రేట్ల ప్రకారము విధించుట న్యాయబద్ధముగ నుండును. ఆదాయపు పన్నువలెనే ఎస్టేటు పన్నుకూడ ప్రత్యేకవ్యక్తులపై విధింపబడే పన్ను కావ, వీటి రెండింటిని ఒకేవ్యక్తి భరించుట దుర్భరము కాకుండ చూడవలసి యుండును. ఇట్టి మూటిపన్నుల భారమువలన దేశముయొక్క ఆర్థికాభివృద్ధికి, పారిశ్రామికాభివృద్ధికి కావలసిన పెట్టుబడి ధనమును వ్యక్తి పెట్టుబడిదారుల ద్వారా సమకూర్చుటకు ఎంతవరకు అభ్యంతరము లుండునని కూడ ఆలోచించుట అవసరము. అదేవిధముగ, వ్యవసాయపు ఎస్టేట్లపై మరణసుంకములు విధించుటకు నిర్ణయింపబడిన, వ్యవసాయాభివృద్ధికి, భూమి అభివృద్ధికి అవసరమగు పెట్టుబడి ధనము దానివలన సంకుచితమగునా యనునది గమనించ దగ్గది. పెద్ద పరిశ్రమల స్థాపనకై పెట్టుబడి ధనము సమకూడుట ఇప్పుడే చాల కష్టముగ నున్నప్పుడు, ఎస్టేటు డ్యూటీ విధానమువలన, దానికి మరొక క్రొత్త అడ్డు ఏర్పడకుండ చూడవలసి యున్నది.

దీనికై, ఆదాయపుపన్ను విధించుటలో కొంత కనీస ఆదాయముపై పన్ను ఏ విధముగ విధించుట లేదో, అదేవిధముగా, కొంత కనీస విలువగల ఆస్తులపై ఎస్టేటుపన్ను విధించకుండుట కూడ సమంజసము. ఎస్టేటు విలువ ఎక్కువగానున్న కొద్దీ ఎక్కువ రేటు పన్ను విధించుట పన్నుల సూత్రములకు అనుకూలముగ నుండును. ఇంగ్లండులో, పన్ను విధింపకుండా ఉండే కనీస మొత్తము తక్కువగాను, క్రమేపి పన్ను రేటు హెచ్చుగా నుండుటయు ఆచరణలో నున్నది. అమెరికాలో పన్నులు వేయకుండా ఉండే కనీసపు మొత్తము హెచ్చుగా నుండుటయు, ఆస్తుల విలువ ఎక్కువయిన కొలదీ పన్నుకూడ హెచ్చురేట్ల ప్రకారము విధించుటయు ఆచరణలో నున్నవి. ఇంగ్లండులో ఎస్టేటుపన్ను ఒకవ్యక్తి తన జీవితకాలములో సంపాదించిన, నిలువచేసిన అన్ని రకముల ఆస్తిపైనను విధింపబడుట ఆచారముగా నున్నది. దాని మూలముగ వచ్చు ఆదాయములో కొంత భాగము స్థానిక సంస్థలకును, కొంత రాష్ట్ర, జిల్లా అధికార సంస్థలకును పంచిపెట్టబడును. మొత్తముమీద దానివల్ల రాబడి స్థానిక అవసరములకే ఖర్చు చేయబడుట ప్రతి దేశములోను ఆచరణలోనున్న పద్ధతియని చెప్పవచ్చును.

మన దేశములో ఎస్టేటుపన్ను విధించుటను గురించి కొన్ని సంవత్సరములనుండి ఆలోచనలు జరుగుచున్నవి. పన్నుల విచారణసంఘము రిపోర్టులో ఈ పన్నును విధించుటను గురించి సహేతుకముగ అనుకూలాభిప్రాయము వెలిబుచ్చ బడినది. 1935 సం|| ఇండియా ప్రభుత్వ రాజ్యాంగ చట్టము ప్రకారము ఎస్టేటు పన్నులను విధించు అధికారము కేంద్రప్రభుత్వమునకు మొదట స్పష్టముగ ఈయబడి యుండలేదు; వ్యవసాయ పరిశ్రమనుండి వచ్చు ఆదాయము, వ్యవసాయపు ఎస్టేట్లపై పన్నులు రాష్ట్రప్రభుత్వముల అధికారము క్రిందనుండు నట్లేర్పాటు చేయబడినది. 1945 సం|| లో, సర్ జెరెమీ రైస్‌మన్ ఆర్థిక సభ్యుడుగా నున్నప్పుడు ఎస్టేట్ పన్ను విధించుటకు ఇండియా ప్రభుత్వమువా రాలోచించు చున్నారని ఆయన తన బడ్జెట్ ప్రసంగములో సూచించియుండెను. దానిపై ఫెడరల్ కోర్టులో అట్టి అధికారము కేంద్రప్రభుత్వమునకున్నదా లేదా యను విషయము

నిర్ధారణ చేయుటకై దావా వేయగా, ఫెడరల్ కోర్టు వారు లేదని తీర్పు చెప్పుటచే, పార్లమెంటులో రాజ్యాంగచట్టమునకు ప్రత్యేక సవరణ ప్రవేశ పెట్టబడి, కేంద్ర శాసనసభకు పన్ను విధించుటకు అధికార మీయబడెను. దానిని పురస్కరించుకొని ఇండియాప్రభుత్వము ఎస్టేటుపన్ను బిల్లు నొక దానిని తయారు చేయుటకూడ జరిగినది. దాన్ని కేంద్ర శాసన సభలో ప్రవేశ పెట్టుటతో సూత్రప్రాయముగ ఎస్టేటుపన్ను విధానమునకు ప్రభుత్వము అంగీకరించినట్లు స్పష్టమగుచున్నది. ఆ బిల్లు సెలెక్టు కమిటీకి పంపబడుటయు, సెలెక్టు కమిటీవారు దానిలో కొన్ని మార్పులు చేయుటయుకూడ జరిగినది.

అప్పటిలో ఆ బిల్లు ఆమోదింపబడుటకు, పన్ను విధించుటకు ఏర్పడిన కొన్ని ప్రతికూల పరిస్థితులలో, ముఖ్యమైనది అప్పటి రాజ్యాంగ చట్టము ప్రకారము స్వదేశ సంస్థానములు ఇండియా ప్రభుత్వ అధికారముక్రింద లేకపోవుటచే, ఇండియాలో పన్ను విధించిన, ఇక్కడ సంపాదించిన ఆస్తులను ఆస్తిదారులు స్వదేశ సంస్థానములకు మార్చుటకు, ఆ విధముగ పన్ను చెల్లించకుండుటకు సులభ మార్గ మేర్పడుటయు నైయుండెను. ప్రభుత్వాదాయమును ఎక్కువ చేయుటకు గాను ముఖ్యముగా తల పెట్టిన పన్ను ఈ విధముగ వక్రము చేయబడుటకు, సదుపాయములున్న దానిని విధించి లాభములేదు. అదీ కాక ఇండియాలో ఒక భాగములో నివాసము లేర్పరుచుకొన్నవారిపై, ఇట్టి పన్ను భారము పడుటయు, వేరొక భాగములో నున్నవారికి దానివలన ఎట్టి బాధయు లేకుండుటయు న్యాయ విరుద్ధముగ కూడ కన్పట్టును. ఇక రెండవ అభ్యంతర మేమన: భూమి, వ్యవసాయపరిశ్రమవలన వచ్చే రాబడిపై ఆస్తులపై పన్నులను విధించు అధికారము రాష్ట్రప్రభుత్వముల కుండుటవలనను, ఇతర ఆదాయము, ఆస్తులపై పన్ను విధించుట కధికారము కేంద్రమున కున్నందునను, వివిధ ఆస్తులపై భారములు భేదముగా నుండుట లటస్థించును. పన్నురేట్లలోను, పన్నుల భారము భరించుటలోను, వీలైనంతవరకు దేశమందంతట ఒకే పద్ధతిపై ఏర్పాటైన విధానము అమలులోనుండు నట్లు చూచుట అవసరమని వేరుగ చెప్పనక్కరలేదు. ౧౯౪౭ లో వచ్చిన రాజకీయమార్పులలో పైన సూచింపబడిన రెండు అభ్యంతరములు తొలగుట కనుకూల పరిస్థితు లేర్పడినవి. స్వదేశ సంస్థానము లన్నియు భారత కేంద్ర ప్రభుత్వ అధికారమునకు లోబడి, ఆ ప్రభుత్వ ఆదేశముల ప్రకారము పరిపాలింప బడుచున్నవి. దానివలన ఇదివరకువలె ఇండియానుండి స్వదేశ సంస్థానములకు ఆస్తులను మార్చుటకు అవకాశములు, అట్లు చేయుటవలన లాభమునూ పోయినవి. ఈ మార్పులవలన, అంతకంటె ఎక్కువ రాజ్యాంగచట్టము అమలులోకి వచ్చిన తరువాత, కేంద్రప్రభుత్వము సమానత్వ సిద్ధాంతము ననుసరించి దేశ మందంతట ఒకే విధమైన పన్నుల విధానము అమలులోనికి తెచ్చుటకు బాధ్యత, అధికారముకూడ కల్గియున్నది. కాన పన్నురేట్లు దేశమందంతట ఒకే విధముగ నుండునట్లు, పన్నును విధించే విధానముకూడ దేశము మొత్తముమీద ఒకేవిధముగ ఉండునట్లు ఏర్పాటు చేయుట కిప్పు డెట్టి కష్టము లేదు.

పైన సూచించబడిన అభ్యంతరములు కాక వేరొక విషయముకూడ ఎస్టేటు పన్నునుగురించి తుది నిర్ణయము జరుగకముందు పరిష్కారము చేయబడుట అవసరము. క్రొత్త పన్ను ఏదైనను విధించునప్పుడు, దానినుండి తగినంత ఆదాయము వచ్చునను నిశ్చయమున్నప్పుడే దానిని విధించుట సమంజసమగు పద్ధతి. ఎస్టేటు పన్ను విధించుటకు ముందు హిందూలా బిల్లు చట్టమయి, దాని ఫలితముగ హిందూ సంఘపు వారసత్వపు విధానములో అవసరమైన మార్పులు చేయబడినప్పుడే మన దేశమందీ పన్నువలన చెప్పతగినంత ఆదాయము వచ్చుట కవకాశము లుండును. సమష్టి కుటుంబపద్ధతి ఆచరణలో నున్నంతకాలము, హిందూ మతమునకు చెందినవారు సంపాదించి నిలువ వేసే ఆస్తులు పెద్దవిగ నుండుటకు వీలుండదు. అట్లు నిలువ వేయువారి సంఖ్యకూడ మితముగానే యుండును. అదీకాక, ఇదివరకే ఆదాయపుపన్ను విధానముక్రింద వ్యక్తుల సంపాదనలో అందులోను పెద్ద ఆదాయములను కల్గియున్నవారి విషయములో ముఖ్యముగ కొంతభాగము ఆదాయపుపన్ను, సూపర్ టాక్సుల రూపకముగ తిరిగి ప్రభుత్వమునకు సంక్రమించుచున్నది. కాన ఎస్టేటు పన్ను విధించుట వలన అట్టి ఆదాయములను కలవారిపై అదనపు భారము మోపుటయే యగును. ఒకప్రక్క ఇట్టి సంకోచమునకు తావుండగా, వేరొకప్రక్క వివిధరాష్ట్ర

ముల్లలో జమీందారీవిధానము రద్దుకాబడి, జమీందారులకు నష్టపరిహారము డబ్బురూపకముగ ఈయబడుచుండుటచే, వారిదగ్గర నిలవ రొక్కములుండుట కవకాశము ఏర్పడినది. ఎస్టేటు డ్యూటీచట్టము ఆమోదింపబడి ఇట్టి ఆస్తులపై ఆ పన్ను విధించబడిన కొంతకాలమువరకైన దానినుండి మంచి ఆదాయ రావచ్చును. ఎస్టేటు పన్ను చట్టము జీవితము మొదట ఐదుసంవత్సరములు మాత్రమే యుండునట్లు నిర్ణయించుట ఈ సందర్భములో సమంజసముగ నుండును. ఈ పన్నువలన వచ్చే రాబడి రాష్ట్రప్రభుత్వములకు పంచిపెట్టుటకు నిర్ణయించుటకూడ అవసరమే. ఈ సూత్రము ఇదివరకే అంగీకరింప బడినది.

దేశమంతటను ఒకే పద్ధతిని ఎస్టేటుపన్ను విధింపబడుటకు వీలుండుటకే మద్రాస్ ప్రభుత్వ రెవిన్యూ మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు, ఇతరఆస్తులతోబాటు, వ్యవసాయపు ఆస్తులపై కూడ ఆ పన్నును విధించుటకు పార్లమెంటుకు అధికారము నిచ్చుచు, శాసనసభ ఆమోదము తెల్పుటకు తీర్మానమును ప్రవేశపెట్టిరి. ఆ తీర్మానము కౌన్సిల్‌లో తీవ్ర విమర్శకులోను కాగా, దానిని అసెంబ్లీలో ప్రవేశపెట్టకయే ఉపసంహరించుకొనుటకు ప్రభుత్వమువారు నిశ్చయించిరి. దానికి కారణములేవో రెవిన్యూ మంత్రి స్పష్టీకరించి యుండలేదు. బొంబాయిరాష్ట్ర శాసనసభలో ఇట్టి తీర్మానమే ప్రవేశపెట్టబడి ఆమోదింపబడినది. మద్రాస్ ప్రభుత్వము తీర్మానము నుపసంహరించుకొటవలన తేలిన పర్యవసానము ప్రస్తుతము ఎస్టేట్ పన్ను విధింపుకు ఆ ప్రభుత్వము వారనుకూలురుగా లేరని. ఎస్టేట్ల పన్ను బిల్లు ఇప్పుడు జరుగుచున్న పార్లమెంట్ సమావేశములో ఎట్లునూ ఆలోచనకు రాదుకదా, దానిని గురించి ఇప్పుడే ఇక్కడ తీర్మానము ఆమోదించుట ఎందులకు? దానివలన లాభము లేకపోగా, ఎన్నికల సమయములో అది కాంగ్రెస్ ప్రతికూల పక్షములకు కాంగ్రెస్‌పై వ్యతిరేక ప్రచారము చేయుటకు సహాయము చేసి నట్లగునని, మద్రాస్ ప్రభుత్వము వారాలోచించి యుండవచ్చును.

ఇప్పట్లో ఈ పన్ను విధించుటకు అవసరమగు చట్టము పార్లమెంటులో అంగీకరింపబడకపోయినప్పటికీ, ఎస్టేటుపన్ను విధించు ఉద్దేశ్యము విరమింపబడునని తలంచుట పొరబాటు. వివిధ అభివృద్ధి కార్యక్రమములను ఆచరణలోనికి తెచ్చుటకు డబ్బు కావలసియుండుగా, ఎవరికిని ఎక్కువబాధకరము కాకుండ డబ్బు సంపాదించుటకు వీలగునట్టి పన్నును ప్రభుత్వము విడనాడుట జరుగనిపని. అందుచే పన్నును వీలైనంతవరకు ప్రజాభిప్రాయమున కనుకూలముగ నుండునట్లు సవరించి విధించుట లాభకరముగనుండును. ఈ సందర్భములో ఎస్టేట్లపన్ను మొదట ఐదు సంవత్సరములపాటుమాత్రము ఆచరణయందుండునట్లు చూచుట, పైన వ్రాసినట్లుగా, సమంజసముగ నుండును. అదీకాక, ఈపన్నువలన ఇప్పటి పరిస్థితులలో ఎంత ఆదాయము వచ్చును? చిన్న ఆస్తులపై పన్ను విధింపకుండుటవలన ఆ ఆదాయము ఎంతవరకు తగ్గును? ఏరేటు ప్రకారము పన్ను, విధించుట మంచిది? ఈ పన్ను విధించుటవలన పారిశ్రామికాభివృద్ధికి, వ్యవసాయాభివృద్ధికి, ప్లానింగ్ కమీషన్‌వారు తయారు చేసిన ప్రణాళిక నమలులో నుంచుటకై ధనసేకరణకు ఏమైన అడ్డు ఏర్పడునా? అను ప్రశ్నలకు సరియైన జవాబుల నిచ్చుటకై కావలసిన దర్యాప్తులు చేయుట మంచిది.



# ఓయి ప్రభూ!



శ్రీ సామవేదం జానకిరామశర్మ

ఓయి ప్రభూ! సమస్త మిదియూహకు రాక అయోమయమ్ముగా
నాయె; సమస్త మీజగమునందొక లేశముగూడఁ ద్వత్ప్రతిభా
వాయత మూర్జితమ్ముగద! ఐనను ధీపరిణద్ధ మూర్తులై
చేయరి దేమయా తమరు చెప్పిన కార్యములందు నొక్కఁడున్!

అసలు రహస్యమేమగునో? అందఱ్పైనను పెత్తనమ్మునీ
కొసఁగినఁగూడ వారలటులే చరియింపఁగ నేల? మానవుల్
పసరములట్లు, రక్కసుల పద్ధతి నిట్లు విశృంఖలమ్ముగా
దోసఁగు లొనర్ప నీప్రభుతతోఁ గల లాభమ దేమయా ప్రభూ !

ఆకటిచిచ్చు పెల్లుబుక నాపశుపక్షులు ప్రాణిహింసకున్
మేకొనుఁగాక! మానవతనీ యొనరించుచు జాతిభేదమున్
సాకునఁ దోడివారలను జంపఁగఁ జూచుచుఁ జూడనట్లుగా
నీకరణిన్ నటించు నిను నేమన నేర్తుమయా కృపానిధీ!

ఉపనిషదంత రార్థముల నూహకుఁ దెచ్చిన పండితుల్ మహా
నిపుణమతుల్, చరాచరము నీవయటందు రిదేమిసామి యీ
కపటమెఱుంగఁ జాల మెటుగామతి మానవులందుఁ గ్రూరతల్
గృపణతలీర్ష్యలేర్పడె నొకింత రహస్యమెఱుంగఁ జెప్పవే!

నీవూ నేనను భేదభావము " లే నేలేవటం చాత్మలో
భావింపంగల జ్ఞానలేశమును సంపాదింపఁగా జేసి, నీ
ప్రావీణ్యమ్మును జూపు మీవిధముగాఁ బ్రాల్మాలికల్ బూనుచో
దేవా! దోసము నీదె! కాదనిన నేదీ దిద్దు మవ్వారలన్.

నీవున్నావని యెంచు మానవులకే నిక్కమ్ముపెన్ బాములౌ;
నీవాల్లభ్యము గోరువారలకె తండ్రీ నారకప్రక్రియల్;
ఈవేదాంతపుమాయ మమ్మిటుల నూహింపంగ లేనట్లుగా
నేవో సుళ్లుగఁ జుట్టుచున్నది. ప్రభూ! నీలీలలాశ్చర్యముల్

మంచిదొ చెడ్డదో భరతమాత ద్విధాకృతయయ్యె నింకరా
వంచనుఁ గష్టముల్ హృదయమందున నూరటఁ బొందఁ జూడనో
క్కించుక శాంతిలేక తపియింపఁగనాయె, నిదేమి సామినీ
వంచనయౌనొ? ఐనఁదలవంపులు నీకొనగూర్చదే ప్రభూ!

తలచినయంత గుండియలు దద్దరిలున్; మగవాని చెంతనే
కులసతి భంగపాటునుఁగుఁ గుట్టని చిత్రవధమ్ము, ప్రాయపుం
జెలియలి దొంగిలింత! ఇఁక చెప్పెడిదేమి మహేశ! యేమొ! యీ
విలయముఁ జూడనీకుఁ గనువిందొనగూర్చెనొ కో పరాత్పరా!

నీవిటులూరకున్న జననిందకుఁ బాత్రుఁడవౌదు; మాదెసన్
నీవయి చూపుదోసము. గణింపుము వారి యకృత్యముల్-సరే
యీవిలయమ్ము కాక మఱి యిప్పుడుమాపయిఁ గత్తికట్టుటల్
నీవును వింటివీ తగవు నీవయి తీర్పఁగదే జగత్ప్రభూ!



# ప్రయాణం






శ్రీ అంగర వెంకటకృష్ణారావు

హౌరా ప్లాట్‌ఫారం మీద జనసమూహాన్ని తోసుకొంటూ యే పెట్టెలో దూరడమా అని ఆతృతగా తిరుగుతున్నాను. మెయిలు షెడ్డులోంచే పొరుగూరునుంచి వచ్చినట్టు నిండుగా వచ్చి ఆగింది.

నా బుజంమీంచి యెవరో సూటుకేసు పెట్టడానికి ప్రయత్నిస్తూ చెయ్యి పీకట్టిందికాబోలు నా తల మీదే దానిని ఆనించి, విశ్రాంతి తీసుకుంటున్నారు. 'ఇదేమిటయ్యా' అని నేను అతని వేపు తిరగబోతే, ఆ బరువుకు మెడనరం కలుక్కుమంది.

ఈలోగా వొక అరవసోదరి విరుగు విసనకర్రలు కట్టిన పెద్దసజ్జ అంతకుముందే పెట్టెలో ప్రవేశించిన ఆసామీ (భర్తగావును) కి అందిస్తూ విసనకర్ర కాడతో నా చెంప రక్కి అదిచాలదనుకుందేమో నా జోడుమీద యెత్తుమడమల జోడుతో నొక్కుతూంది.

నా పరిస్థితి యేమీ బాగులేదు. అటు కదిలితే సూటుకేసు మళ్లీ తలమీద పడుతుంది. ఇటు కదిలితే విసనకర్ర కాడ కంట్లో గుచ్చుకుంటుంది.

ఈ ప్రాణాంతిక సమయంలో వొక బలమైన చెయ్యి నా భుజాన్ని పట్టి వూపింది. నా కళ్లు మండి తలపైకెత్తి తిరుగుతూ చూసేను. వాడు మా కామేశ్వరి. సముద్రపు హోరువంటి జనసముద్రపుహోరులో వాడేమంటూన్నదీ వినిపించడం లేదు. కాని అలా చూస్తూనే వున్నాను. అరవసోదరి అరవంలో తిడుతూ అవతలకు తుళ్లింది. సూటుకేసు ఆసామీ 'వాట్ వాట్' అంటూ అటువెంపు యింగ్లీ కొట్టేడు. కిటికీద్వారా నేనూ, నా హోల్డాలు, ట్రంకు పెట్టె కంపార్టుమెంటులో ప్రవేశించాం. ప్రవేశించామేమిటి, కామేశ్వరిలాగే కాదు. అలా వేయడంలో వాడికి, నాకూ హోల్డాలుకూ యేమీ వ్యత్యాసంవున్నట్టు గోచరించలేదు.

మొత్తానికి ప్రవేశించవలసినవారంతా పెట్టెలో ప్రవేశించారు. మెయిలు, కదిలింది.

'ఏమిరా రాజా, నీ మిలిటరీ డాబంతా యింతేనా? అలా చూస్తూ నుంచుంటావేం?'

'అబ్బే, రావటం లేటయింది. అప్పటికే జనం తోసుకుంటున్నారు'

మూరెడుపొడుగు చుట్ట నోట్లోంచి తీసి నవ్వుతూ వాడేదో తిట్టేడు. వాడిసంగతి తెలుసును గనక తిట్టేడని గ్రహించేను. బండీ అప్పుడే యేదో చిన్న వంతెనమీంచి పరుగెడుతూ పెడుతూన్న బొబ్బలలో యితర శబ్దం వినిపించడం లేదు.

ఆ మసక వెలుతురులో దట్టమైన యింజను పొగ వెనకనుంచి యీతచెట్లు తలలు విరబోసుకున్న దయ్యాల్లా అగుపిస్తున్నాయి.

'రాజా. నాటికి నేడే నీదర్శనం. ఎక్కడెక్కడ తిరిగావురా యిన్నాళ్లూ? ఎంతమందిని చంపావు?'

'ఎవర్ని చంపడం? ఎందుకు?'

వాడు నవ్వి నా భుజంమీద మామూలుగా తట్టేడు. ఆ అదురుకు అంతవరకూ బాధిస్తూన్న తల నొప్పి సర్దుకుంది. అదీ వొక మంచికే అనిపించింది.

'కాదురా మరి, నువ్వు యోధుడివికదూ. అన్నట్టు మరిచిపోయేను...చుట్ట కాలుస్తావా... మంచిదే... స్పెషలు...పోనీ... సారీ...యెప్పుడు చేరేవు?'

'నలక్షైలో'

'మరి యీ యేడేళ్లూ యేంచేస్తున్నావురా. నువ్వు జమాయిస్తావనుకున్నాను. అలాగే వున్నావు.'

మెయిలు లాకదగ్గర విధిలేక ఆగింది. ఈలోగా మావాడా చుట్ట పారేసి మరొక మూరెడు చుట్ట వెలిగించేడు. నే నీ యేడేళ్లలోనూ ఆరేళ్లు ఖైదీగా జీవించిన సంగతి తెలిసి విచారించేడు.

'మన విశ్వం యెక్కడున్నాడురా ?'

'ఎవడు ... వాడా పొట్టివాడు ... ఫ్రెంచి కటింగు......ఏం మనిషిరా...ఇప్పుడా....బరంపురంలో వున్నాడులా వుంది. వాళ్ల తల్లివాళ్లది బరంపురమేగా.'

'కామేశ్వరీ, వాడిని చూడాలని కళ్లు కాయలు కాసిపోయేయిరా. ఎన్నో వుత్తరాలు వ్రాశాను. జపానీవాళ్లు సరిగ్గానే పంపేవారట. తెల్లవాళ్లే చింపి పారేసేవారట.'

కాదు గానీ, ఆవిశ్వం నలభైయైదులో కలకత్తా వచ్చేడురా. అప్పుడే ఇంగ్లండునుంచి ప్రొఫెషనల్ ఫుట్‌బాలర్స్ వచ్చారు. ఆఆటలు చూడడానికి వచ్చాడు చూడ్డానికి వచ్చినవాడు మెల్లిగా బాగా సంపాదించి, వాళ్లతో ఆడేడు సుమీ. ఒరేయ్! ఇంతుండే వాడా...బంతికన్న చుప్పున దుల్లేవాడురా!

'వాడి యెద్రసు తెలుసునా...నిజం నమ్మవిూ. ఖైదులో వున్నప్పుడు మా అన్నయ్య కూడా జ్ఞప్తికి రాలేదు కాని వాడే తరుచు జ్ఞాపకానికివచ్చి బాధించేవాడు...'

'వాడి యడ్రసుకేం గాని...'

'ఏం గాని కాదు తెలిస్తే చెప్పరా...'

'తెలీదురా నీ... కాని వాడి ఫ్రెంచికటింగూ ...నవ్వే నోరూ...ఎప్పుడూ చిదానందమేరా వాడి తప్పా...!

పెదవిమీద రాతుసిబొగ్గరవ్వ ఫెడీమని తగిలింది.

'ఆ యేడే వాళ్ళనాన్న పోయేడుసుమీ'

'ఆఁ!!'

'పాపం యేదో ఆ ముసలాయనుంటే పింఛను వచ్చేది. ఇక వీడున్నాడా...ఎవడు...మన విశ్వం... ప్రతీ యేడాదీ ప్రోగ్రెసే...

మళ్ళీ మరొక రవ్వ కంటిమీద తగిలింది.

'రెండేసి రెండేసి...బ్రతికినవాళ్ళు బ్రతికేవారు, లేనివాళ్లు లేరు. నలభైమూడులో ఫుట్బాల్ కోసం వచ్చినప్పుడు వాళ్లనాన్న పోయి రెండు నెలలయింది. పోయేడని నవ్వుతూ చెప్పేడు. అంటే నవ్వుతున్నాడని మరోలా కాదు. అదే ... తండ్రి పోయిన సమాచారం చెప్తూన్నప్పుడు కూడా నవ్వే...

చుట్ట జారిపోయిందీమాటు నోటిలోంచి. మళ్లీ చుట్ట తగిలించి ఫుదికుటికి నవ్వుకున్నాడు. 'వాడూ వాడి ఫ్రెంచికటింగూ...యింత పిసరు మనిషీ.... చిదానందం...కాని యేం సిగరెట్లు కాల్చడం. తెగ కాల్చేవాడు. కాల్చడం దగ్గరం...బాగా జ్ఞాపకం చేశావు...విశ్వం గాడు...'

ఖరగ్ పూరు దీపాలగుపిస్తున్నాయి.

'అన్నట్టు కామేశ్వరీ ... అసలసం మరిచిపోయాను...'

'నే నేం చేస్తున్నానంటేనా ... ఖరగ్ పూరులో సినిమా థియేటరు నడిపిస్తున్నా. ఇవాళ డిస్ట్రిబ్యూటర్లను కలుసుకుందికి కలకత్తా వచ్చా. ఉంటేరాదూ రెండురోజులపాటు నా దగ్గర.

రైలాగింది. కామేశ్వరి ఆ చుట్ట రైలుపట్టాల మీద విసరి మరో మారెకు చుట్ట ముట్టించి 'గుడ్ బై బ్రదర్' అని వెళిపోయేడు.

కామేశ్వరి వచ్చి నా గాయాన్ని కదిపేడు. ఈ యేడేళ్ల ప్రవాసంలో మానవప్రకృతి పొలిమేరలు గడిచిపోయిన నాలో బాధని తిరిగి రగిల్చేడు. ఈ యేడేళ్లలో మా జానకి రెండో మూడో సారులు జ్ఞాపకానికి వచ్చింది. ఎప్పుడో వొకమాటు కామేసు మా రఘు ఈపాటికి వచ్చుంటాడనుకొన్నాను.

ఖరగ్ పూర్ ప్లాట్ ఫారం కేసి చూస్తూంటే నా జీవిత పుస్తకపు పుటలు రెపరెప వెనక్కు తిరుగుతున్నాయి. ఈ వూరికీ నాకూ చాలా సంబంధం వుంది. ఈ కార్మికాలయంలో కొంత కాలం వెళ్లబుచ్చేను. ఉద్యోగం లేని వొకానొక దుష్టకాలంలో యిక్కడి బ్రహ్మాండమైన కర్మాగారపు పొగగొట్టాలలోంచి ఆవిరిరూపం ధరించివచ్చే శ్రమజీవుల నెత్తురు మేఘాలతో మేలమాడుతూంటే, ఆశగా కళ్ళప్పగెప్పి చూసేను. స్వార్థం, లంచం అనే భయంకర నాటకంలో బాధితుడిపాత్ర ధరించి కార్చిన కన్నీటి కాల్వలింకా యింకనట్టు తోచడానికి కారణం నావంటి యెంతోమంది నేటికీ కన్నీళ్లు కారుస్తూండడంలా తోచింది. ఆకలికి నకనకలాడిన యెన్నో దినాలు ఈ కార్ఖానా కెదురుగా వున్న

రైల్వే వంతెన కావాలని అంటుకుపోయే రొంకప్పుడు.

ఈ ఆలోచనలలో యాదాలాపంగా నాదృష్టి ఎదురుగావున్న మిఠాయిదుకాణంమీద పడింది కాని అక్కడ సామగ్రి యేదీ అగుపించడం లేదు. అప్పుడప్పుడు రొత్త ఝుడిమెలపాదాలు, అర్గండీ చీరలు, హావావా సూటులూ ఆదుకాణందగ్గరకు వచ్చి పోతూన్నది స్వాప్నిక వృత్తాంతంలా మాయ మాయగా గోచరిస్తూంది.

ఆమె మాటలు నాకు వినిపించడంలేదు. పొగ మంచువెనక కొండలా ఆమెఆకృతి చీకిరి బాకిరిగా వుంది. ఆమె చెయ్యి వూపి పిలుస్తూంది.

ఎవరూ ?

'ఏమండీ రాజారావుగారూ! ఎంత పిలిచినా పలుకరు. సమాధిలో వున్నారా'

'ఓహో, లక్ష్మీ...క్షమించు...ఏదో ఆలోచిస్తున్నా.'

'యుద్ధంలోకి వెళ్లి వచ్చినా మీ ఆలోచనలింకా ముగియలేదు. మని పాకవగ్గరా, మనసాక దగ్గరా...మీరింకా అలానే వున్నారు.'

'ఏం లక్ష్మీ......ఎక్కడికైనా వెడుతున్నావా ?'

'లేదండీ. మాతమ్ముడిక్కడే వున్నాడిప్పుడు. లోకో షెడ్డులో ఫోర్‌మన్. దిగండి, రెండురోజులుండి వెడుదురుగాని'

'అలాగే, దానికేంలేగాని, ఆరు సంవత్సరాలు పైగా ప్రవాసం తరవాత యిదే బైటకి రావడం. మనవాళ్లందర్నీ చూడాల్నివుంది. మళ్లీ వస్తాగా...'

'అలాగా, అయితే నేను పరాయిదాననా, ఇప్పుడు దిగకపోతే సంజీవితో చెప్పి మీ మీద దావా వేయిస్తాను. వాడి భార్యని మెయిలుకు దిగబెట్టడానికి వచ్చేను. పురిటికి విశాఖపట్టణం వెడుతూంది. వాళ్ల తమ్ముడు తీసుకెడుతున్నాడు.

'సంజీవి రాలేదా?'

'తీరిక లేదు. కాని మీరింకా అలాగే మాట్లాడుతున్నారే. దిగండి' ఇంజనప్పుడే కదిలింది.

బలవంతాన దింపేసింది లక్ష్మీ. నేనూ లక్ష్మీ సామానుతో టాంగాలో నయాకాలనీకి బయలుదేరేం.

లక్ష్మీ! బాగా ఎదిగిపోయింది. సన్నగా విల్లులా వంగిన ఆ కనుబొమ లిప్పుడు ముడిపడడం లేదు. విశాలమైన ఆ తళుకు నేత్రాలలో నిరాశ చిహ్నా లిప్పుడు వుండుండి పొడకట్టడం లేదు. ఆమె పెదవు లిప్పుడు రూపుదేరి బిగుసెక్కేయి. మాటి మాటికీ బరువుగా లేచిపడే ఆమెవక్షంలో నేడు శాంతి కాపురం పెట్టినట్టుంది.

'సీతారాం! బాబుగారికి వేడినీళ్లు కాచు' అని హిందూస్తానీ కుఱ్ఱవాడితో చెప్పి ఆమె వంటలోకి జారబడింది.

సంజీవి యింటిలో వాడు స్వంతంగా తయారు చేసిన వస్తువులు చాలా అగుపిస్తున్నాయి. వాడు పనివాడు, కార్ఖానాలో ఆఫీసరు. ఇల్లు చాలా అందంగా, యిమ్ముగా వుంది. గదుల గుమ్మాలకీ, కిటికీలకీ తెరలున్నాయి. టేబిల్సు, రకరకాల కుర్చీలు వున్నాయి. ఇంత సరంజాంవున్నా యిల్లు నిరాడంబరంగా వుంది.

ఉదయం యేడుగంటలకు సంజీవి వచ్చేడు. అంతకుముందే నేను కాఫీ త్రాగి తీరికగా కూచున్నాను. లక్ష్మీ సీతారాంను బజారుకు పంపింది. సంజీవి నన్ను చూసి నమ్మలేకపోయేడు. వాడిని నేను వెంటనే పోల్చలేకపోయేను. ఈ ఆరేళ్లలోనూ యేనుగంత యేడు. తొడుక్కున్న మకిలి 'డాంగరీ' చేతులనిండా మసి, యినుపజోళ్లు, చెదిరిపోయిన వుంగరాల జుత్తు—వా డొక మరమనిషిలా వున్నాడు.

'ఏంరోయ్ రాజా! హటాత్తుగా దిగబడ్డావే!'

'ఔనురా. నిన్న లక్ష్మి స్టేషనుకు వచ్చింది మీ ఆవిడను దిగబెట్టడానికి—నన్ను బలవంతాన దింపేసింది కాని యీ అవతారమేమిటి—నీ బి. ఎస్ సి కాలినట్టే వుంది. కలం పట్టుకుంటా వనుకొన్నాను, మసి పట్టుకున్నావు.'

'రాత్రి డ్యూటీరా. నా కెప్పుడూ అంతే. అప్రెంటిసు ముగించి రెండేళ్లయింది కదూ మరి.'

'సరేలే వెళ్ళి మనిషిలా తయారవ్వూ.'

'సీతారాం!'

'బజారు కెళ్లేను తమ్ముడూ. రా, నీళ్లు సిద్ధంగా వున్నాయి.'

వాడు వెడుతూ అన్నాడు 'రాజా కేదయినా దానా పడేశావా?' అని.

భోజనాలు చేస్తున్నంతసేపూ సంజీవి రేవో కబుర్లు చెపుతూనే వున్నాడు. అప్పటికీ యిప్పటికీ వాడిది వొకటే వాగుడు. అప్రెంటిసుగా చేరిన, కొత్తలో పదిహేను పౌనుల సుత్తితో మోదిమోది అరిచేతులు కాయలు కాసి పోతూంటే వాడు నిభాయించుకోలే డనుకునేవా రంతా. బలిష్ఠమైన శరీర మైనా అంత సున్నితంగా వుండేవాడు. ఇప్పుడొక యినపమనిషిలా తయారయేడు.

'అన్నట్టు సంజీవి, మన విశ్వం యెక్కడున్నాడురా?'

చేయి వడ్డిస్తూన్న లక్ష్మి చెయ్యి వణికి, మిల్లి గరిటె నా విస్తరిలో జారిపోయింది. 'అయ్యో' అని ఆమెవేపు చూసేను. ఆమె కళ్లు రక్తముదేరి, ముఖం అదోలా మారి 'అయ్యో' అంది. కాని మిల్లి గరిటె జారిపోయినట్లు తెలియడానికి కామెకు మరి రెండు మూడు సెకండ్లు పట్టివుంటుంది.

'ఆ పసువుగురించి నన్నడక్కమీ. వాడట్టి ఫూలం.'

'సరే దానికేం లే. ప్రస్తుతం వాడెక్కడున్నాడని నా ప్రశ్న' అంటూ అన్నంలో పడిన గరిటెని ప్రక్కగా విస్తరి బైట పెట్టేను.

'సంవత్సరం క్రిందటే బరంపురం వచ్చేడని తెలిసింది. ఉద్యోగానికి శెలవు పొడిగిస్తున్నాట్ట. అధికారుల కిష్టం లేదట. వాడికి ఖాతరే లేనట్టుంది'

'ఉత్తరాలు రాస్తాడా'

'అమస్యవరకూ వ్రాసేవాడు. పోయిన డిశంబరులో వాడికి జబ్బుచేసిందంటే వాళ్లమ్మ వచ్చింది. వాడు తేరుకున్నాడు కాని వాళ్లమ్మ పోయింది.'

'ఆఁ!'

'చూట్టానికి వెళ్లేను. అత్తవారింటిలో వుండగా యిలాంటిది జరిగింది కదా అని కించలేదు. తల్లికి కర్మచేస్తూన్నాను కదా అని చూటలేదు. తన ఆరోగ్యం బాగులేదు కదా అని బెంగలేదు. వాడూ, ఫ్రెంచికటింగు మీసాలు, నవ్వుమొహం, నోట్లో హమేషా సిగరెట్టు.'

'అయితే వాడి ఆరోగ్యం బాగులేదా?'

'బాగేమిటి వోగేమిటి, అలాగే చింత కాయలా వున్నాడు. కాని ఆ వెధవ సిగరెట్లు కాల్చడం మాత్రం మానడు. పోయినవాళ్లు పోగా నలుగురు పిల్లలున్నారు. భార్య మళ్లీ సిద్ధంగా వుంది.'

'వాడికోసం కళ్లు కాయలు కాసిపోతున్నాయిరా. ఈపాళంగా వెడితే వాళ్లత్తవారింట్లో వుంటాడంటావా?'

'ఎవడి కెరుక భాయీ వాడు నాయుద్దేశం ప్రకారం యెలాంటివాడంటే, వాడితో స్నేహం కట్టినవాళ్లందరినీ బెంగలో పడేసి, వాడు మాత్రం చుట్టుప్రక్కల పరిస్థితులు మరిచిపోయి చిదానందంగా వుంటాడు.'

'అలా అనకురా. వాడు చాలా మంచివాడు. వాడి కర్మ అలా వుంది.'

'వాడి కర్మేమిటి! చూడు యీ మనిషిని' అని లక్ష్మివేపు చూపించేడు.

లక్ష్మి చరచర వచ్చి పెరుగు వడ్డించి 'తమ్ముడూ, నీకు నో రెగుస్తూందే—పెద్దా పిన్నా లేకుండా...' అని గద్దించింది.

'పెద్దవాడే అక్కయ్యా. వాడిమీద నాకు భక్తి వుంది. కాని గౌరవం లేదు.'

నాకు పకాలున నవ్వు వచ్చింది.

'భక్తి వుంది గౌరవం లేదు. ఎంత తమాషాగా అన్నావు. నువ్వింకా కుర్రాడివే. మనుష్యుల్ని నువ్వేమిటి అర్థం చేసుకోగలవు. అందరూ అనుపించినట్లు వుండరు. నీకు అనుభవం తక్కువ. మాతో బంతిఆటలు ఆడుతూ, చదువుకుంటున్న రోజులలోనే చుట్టలు కాలుస్తూండేవాడు. కామేశ్వరి జ్ఞాపకం వుందా...

'ఆ ... ప్రిన్సిపాల్ గారి అమ్మాయితో కొన్నాళ్లు...

'ఆ వాడే వాడే...వాడు నిన్న రైలులో కలిసేడు. కామేశ్వరికూడా నాకుమల్లే విశ్వానికి మంచి స్నేహితుడు. వాడూ నీలాగే విశ్వం పూచీ పేచీ లేని నిశ్చింత మనిషి అంటాడు.

'ఓహో వాడా...మా వూళ్లో సినిమా ప్రొప్రయిటరు...' అంటూ లేచాడు సంజీవి.

'బ్రదర్ నువ్వు తాపీగా కూచో. నాకు నిద్ర ముంచుకొస్తూంది. రాత్రి మళ్లీ డ్యూటీ కదూ.

సంజీవి వెళ్లిపోయేడు కాని అంతవరకూ యేదో మాటాడుతున్న లక్ష్మి సుమారుగా మౌనం దాల్చింది. నే నా విషయం కనిపెట్టినప్పటికీ, తెలియనట్టే వూరుకున్నాను.

గతాన్ని బట్టి లక్ష్మికి యిష్టంలేని విషయాన్ని ప్రస్తావించాం అనుకున్నాను. ప్రతి విషయాన్నీ 'అతి' గా వూహించే తత్వంగలవాడి నవటంచేత, యీ ప్రస్తావన లక్ష్మి హృదయసాగరంలో నిద్రించివున్న హాలా హాలాన్ని మథించి తీసిందేమో, దానిని ఆమె శంకరుడివలె కంఠంలోనే అదిమిపెట్టి వుంచిందేమో అనిపించింది.

భోజనానంతరం నేను కొంచెం విశ్రాంతి తీసుకున్నాను. సంజీవి కుంభకర్ణుడిలా నిద్రపోయి మూడుగంటలకు లేచి 'టీ' త్రాగి మళ్లీ పడుకున్నాడు. నాలుగింటికి లక్ష్మి పూరీ బంగాళా దుంపలకూర ఫలహారం చేసి నాకు పెట్టింది.

సుమా రారుగంటలకు సంజీవి లేచి, వేడినీళ్లస్నానంచేసి భోంచేసేడు. మకిలిడాంగరీ వేసుకుని, దానిమీద దర్జాఅయిన సూటు బనాయించేడు. పని స్థలం చేరగానే పై డాబు తీసి పారేస్తాడన్న మాట.

'రాజా, నేను వెడుతున్నా నువ్వు భోజనానికి తాపీగా కూచో. రాత్రి యేమీ ప్రోగ్రాం లేదా.'

'ప్రోగ్రాము కేముంది. నువంటేనే యేదైనా.'

'అక్కయ్యా, దేశీ సినిమాకి వెడదా మనుకుంటున్నావు. రాజా నువ్వు పత్యం డివాళ.' లక్ష్మి అలాగే అంది. కాని నేనే అన్నాను 'రేపు నీకు శెలవేకదా. అంతా కలిసిపోదాం' అని.

'రేపు 'షాజహాన్' దూర్దామోయ్. నాకీ తెలుగు సినిమాలంటే తలనొప్పి. లక్ష్మికి పద్యాలంటే సరదా. ఇటీవల సినిమాలలోంచి పద్యాలకు వుద్వాసన చెప్పేరటగా.'

నాకు పకాలున నవ్వు వచ్చింది. లక్ష్మికూడా నవ్వింది మందంగా.

'లక్ష్మి విశ్వంపద్యాలు చదవడం యెలా పాగిడేదో జ్ఞాపకం వచ్చిందా ?'

నే నేదో ఆలోచిస్తున్నదానికి అంతరాయం కలిగింది. నిజానికి అది కారణం కాదు. వాడికి తెలుగు సినిమాలంటే తలనొప్పి. నాకు ఇండియన్ సినిమా లంటేనే రోత !

మరి నాతోబాటు లక్ష్మి యెందుకు నవ్విందో అది నేటికీ రహస్యమే. స్త్రీహృదయ మంత లోతైన మహాసముద్రం లేదు. దాని అట్టడుగున పుట్టిన చలనకారణంగా యే కెరటం యెప్పుడు పై కుబ్బుతుందో యెవడికెరుక !

కాని లక్ష్మి 'అలాగే' అంది. ఆమెకు ఆశాభంగం కలిగించరాదని సినిమాకు వెళ్లడానికి నిశ్చయించేను. సంజీవి వెళ్ళిపోయేడు.

నాతోబాటు లక్ష్మిని భోజనానికి కూచోమన్నాను. కాని ఆమె వినలేదు. నేను భోంచేస్తున్నంతసేపూ ఆమె నిలబడేవుంది. నిగనిగ మెరుస్తూన్న ఆమె కళ్లలో సాధారణంగా యౌవనులకుండే 'జిజ్ఞాస' లేదు. సౌందర్యం తిరిగి విజృంభించిన ఆమెలో 'ముందుకు ముందుకు' అనిపించే వుద్రేకం లేదు. విశ్వం అనేవాడు. స్త్రీ తను తనుగా జీవించగలదు. తను తనుగా జీవించకుండా వుండగలదు. తను రెండు విధాలా వొకే సమయంలో జీవించగలదు. అనవసరంగా నాలో సమస్యలు పుట్టి నన్ను బాధిస్తున్నాయి. నే నేమిటో అనుకుంటున్నాను గాని ఆమెమనసులో యే ఆలోచనలు పరుగెడుతున్నాయి ?

మేం బయలుదేరి వెడుతూంటే బహుళ తృతీయచంద్రుడు వుదయిస్తున్నాడు. టాంగాలో త్రోవ పొడుగునా లక్ష్మి నాసైనిక జీవితవిశేషాలు అడిగింది. నేనెంతో ధైర్యవంతుడినని ప్రశంసించింది. జానకిని, పసికందు రఘుని విడిచి యిన్నాళ్లూ యెలా వున్నానో అని ఆశ్చర్యం వెలిబుచ్చింది. తనను గురించి ప్రశ్నించడానికి ఆమె అవకాశం యివ్వలేదు. నాకు ధైర్యం కలగనూ లేదు.

సినిమానుండి యింటికి వచ్చేసరికి వొంటిగంటయింది. ఇంటిముందు ఆరామంలో మంచుతో తడిసిన చెట్లఆకులమీద చందమామ స్వర్ణకాంతులు మెరుస్తున్నాయి. ఆ కాంతులు ఆకుల్ని వుద్రేకపరచ

ప్రయత్నిస్తాంటే అవి మరింత కన్నీళ్లు విడుస్తున్నాయిగాని హృదయాంతర్గతమైన ఆవేదనని వ్యక్తీకరించలేకపోతున్నాయి.

నేను మంచాన్ని నడివాకిలిలో కీడ్చుకున్నాను.

'నీకు మంచుపడుతుందా ?'

'నాకు మంచు యెంతైనా పడుతుంది. తూర్పు బెంగాలులో, డిశంబరు నెలలో ఆరుబైట పడుకునే వాడిని'

ఆమె నడివాకిలిలోకి కాళ్లు పెట్టి వరండాలో కూచుంది. వరండాలోకి చంద్రకిరణాలు సూటిగా పడక ఆమె ముఖం నాకు స్ఫుటంగా కనిపించడంలేదు.

'లక్ష్మీ, నిద్ర రాలేదా'

'తేలిపోయింది'

ఆమె స్వవిషయం పూర్వ భోగట్టాలు తెలుసుకోవాలని చాలా కుతూహలంగా వుంది. కాని యెలా ప్రస్తావించాలో తెలియడంలేదు. సూటిగా అడిగితే యేమనుకుంటుందో అని భయం. కాని ధైర్యం చేసేను.

'లక్ష్మీ, నీ ఆరోగ్యం యీ రోజులలో చాలా బాగున్నట్టుంది. ఐనక ఆరేళ్ల క్రితం పూచిక పుల్లలా వుండే దానివి.' ఆమె తెమ్మకోలు నవ్వునవ్వి నేల కేసి చూస్తూ అర నిమిషం గడిచేకా అంది.—'బాధ పడడం పడకపోవడం మన మనస్తత్వంపైన ఆధారపడి వుంటుంది. మనస్సు చేత వొప్పిస్తే బాధ కూడా రుచిగానే మారుతుంది."

ఆమె శాస్త్రంలోకి దిగిపోతూంది. విషయం తెలుసుకుందికి వుబలాటపడుతూన్న నాకు శాస్త్ర చర్చ యిష్టంలేదు. ఇంకొకప్పుడైతే నే నీశాస్త్ర విషయమై ఆమె కొక వుపన్యాసం యిచ్చేవాడిని.

'నేనడిగిన దది కాదు. నీలో యీ మార్పెలా వచ్చిందా అని, నీ బ్రహ్మచారిణీజీవితం ముగియలేదని తెలుస్తూంది. ఐనకటి నీ దుర్భరావస్థ తెలిసిన వాడిని కనక, ప్రస్తుతపు నీ శాంతియుత జీవితానికి కారణం కనిపెట్టలేక పోతున్నాను.'

'నా బ్రహ్మచారిణీ జీవితం ముగియడమేమిటి? నాజీవితాన్ని బ్రహ్మచారిణిగానే ముగిస్తాను. పువ్వులా కమిలిపోయే మానవహృదయాలున్నంతకాలం ప్రక్కనే పాషాణ కర్కశమైన మానవహృదయాలు కూడా వుంటాయి.'

'పొరబడ్డావు. విశ్వాన్ని తప్పుగా అర్థం చేసుకొన్నవాళ్లలో నువ్వూ చేరావు.'

ఆమె హృదయంలోని ఆవేశం కంఠంవరకూ వచ్చి ఆగిపోయి నట్టయింది.

'తప్పుగా అర్థం చేసుకొన్నానా? మీరు ఆరోపించిన నింద యెవరిపట్ల నిజమౌతుందో వారు త్రొక్కే మార్గంకూడా తప్పు దవుతుంది కదా నిజంగా.'

'అంతవరకూ నీవంటివారి చరిత్ర నిర్మల గంగా ప్రవంతి అంత పూతమైనది. కాని ప్రతీదానిని మానవత్వపు కొలబద్దతో కొలిచి పరిమితి నిర్ణయించడం సరికాదు. విశ్వం నిన్నే కాదు. నీవంటి యెంతో మంది సాధారణులని యిట్టే ఆకర్షించేను. నీకు ఆశాభంగం కలిగించినదీ వాడు కాదు. పెద్దల నిర్ణయం ప్రకారం చివరి కౌ భార్యమెడలో మూడుముళ్లూ వేసిందీ వాడు కాదు. వాడి పాట, ఆట నిన్నాకర్షించి వెంటనే వాడిని నీ హక్కు చేసుకుందికి ప్రోత్సహించేయిగాని వాడిలోని లోకాతీతత గ్రహించ నిచ్చేయి కావు.'

ఆమె రెండు నిమిషాలు మాట్లాడలేదు. కాని ఆ కాలంలో యేం వూహించుకుంటోందో చెప్పలేను. నేను తిరిగి ఆరంభించేను.

'వాడొక్కొక్కప్పుడు నీకూ నాకూ వొంటరిగా వున్నట్టుండేవాడు. కాని నిజానికి కా సమయంలో ప్రఖ్యాత అమెరికన్ నటుడు 'రొనాల్డ్ కాల్మన్'తో సిగరెట్టు కాలుస్తూ కబుర్లాడుతూండేవాడేమో, లేకపోతే శ్రీశ్రీ తో గరం గరం సంఘర్షణ చేస్తూండేవాడో'

'ఆమె మనస్తరంగం కదనుతొక్కడం కూడా మాని జనకకు పిల్లడుగులు వేస్తూన్నట్టనిపించింది. ఆమె తలెత్తి జాలిగా చూస్తూ అంది. 'నిష్కల్మషంగా ధర్మపద్ధతిలో మనసు చెప్పినట్టు చెయ్యగలను గాని, మీ విపరీత తర్కం నాకు అర్థం కాదు ఆ హృదయ దౌర్బల్యంతో బాధపడిన రోజులు జబ్బు దినాలుగా గ్రహించి, యిటీవల మనసు మార్చుకొన్నాను. ఆత్మశాంతి, యింట్లో శాంతి బలిపెట్టిన

రోజులు తిరిగి రాకుండా కట్టుదిట్టం చేసుకున్నాను. అందుకే నా ఆరోగ్యం తిరిగి తలెత్తింది.'

ఆమె యీ మాట అంటూంది గాని, గొంతు బొంగురు పోతూంది. సంగతి యితివారివందుకు విచారించినా, ఆమె పొరబాటు, ముఖ్యంగా అది విశ్వానికి సంబంధించింది కనక, ఆమెకు తెలియజేయాల్లని నిశ్చయించేను.

'అయితే లక్ష్మీ విశ్వం నీ కిప్పుడు శత్రువన్న మాట.'

ఈ ప్రశ్నకి ఆమె యేడు సంవత్సరాల విస్మృతి పొరలు చీలిపోయేలా దీర్ఘనిశ్వాసం తీసింది. ఏడుపు గొంతుతో 'శత్రువూ కాదు, యెవరూ కాదు' అంది.

'ఇది మరొక అసత్యం. కాకపోతే అతని పై పూర్తిగా విముఖత అభ్యసించిన నువ్వు, యెవరికోసం, యెందుకోసం బ్రహ్మచర్యం పాటిస్తున్నావు? అతనొక్కడే మోసగాడా, లేక పురుష జాతి అంతా మోసకారేనా?'

ఈ ప్రశ్నకి ఆమె తట్టుకోలేక పోయింది పొంగి పొంగి వచ్చేదుఃఖంచేత ఆమె ముఖం రెండు బాహువులతోనూ దాచుకుని వెక్కి వెక్కి కుమిలింది. బంధులు తెగుతూ, అలలు లేగి మహా వేగంతో పరుగెత్తి వచ్చే సరిత్ప్రవాహంవంటి ఆవేశానికి ఆగలేక, కంటికీ మంటికీ యేకధారగా హోరని యేడ్చింది.

నే నామెను ఓదార్చేను. విస్మరించి శరీరాన్ని సుఖపెట్టేకన్న, స్మరించి కన్నీరు కార్చడంలోనే నిజమైన ఆనందం కలదని ఆమెకు నచ్చచెప్పేను. సరిగా అదే సమయానికి చంద్రకాంతి ఆమె వున్న వరండాలోకి ప్రవేశించింది. ఈ స్త్రీ హృదయాన్ని యింత చమత్కారమైన మోసంలో వుంచిన విశ్వాన్ని చూడడానికి నా హృదయం మరీ ఆత్రుత పడింది. ఆరు నూరైనా ఆ మరునాడే బరంపురంలో పడి విశ్వాన్ని తనివితీరా కౌగిలించుకోవాలని నిశ్చయించేను.

ఉదయాన ఐదుగంటల బండీలో నే వెడిపోతా నంటే సంజీవి వస్తే గాని వెళ్లడానికి వీల్లేదని లక్ష్మి పట్టు పట్టింది.

ఆ మరునా డాదివారం. సంజీవికి శెలవురోజు. వాడూ నేనూ యెన్నో కబుర్లు చెప్పుకొన్నాం. లక్ష్మిలో యూచాయిగా అగుపిస్తూన్న మార్పును సంజీవి గమనించేడు. వాడితో నేను గతరాత్రి జరిగిన విషయం సవిస్తరంగా చెప్పేను.

నన్ను మెయిలుకు దిగబెట్టడానికి వాళ్లిద్దరూ వచ్చేరు. సంజీవి వటవట అడే వాగుతున్నాడు. లక్ష్మి మౌనంగానే వుంది.

మెయిలు వచ్చింది. పెట్టెలో నా సామానులు సర్దటం అయింది. లక్ష్మి చేతి సంచీలోంచి వొక డబ్బా తీసి నా ముందు బల్లమీద వుంచింది.

'ఇదేమిటి?'

'మన్నీలాల్ రసగుల్లా'

'లక్ష్మి నాకు తీపి సయించదని నీకు తెలుసుగా'

సంజీవి తల బుకింగుఆఫీసు వేపు తిప్పుకున్నాడు. లక్ష్మి అనుగు చెదరిపంటితో నొక్కుతూ కొద్దిసేపు నేలకేసి చూసి గండువీరాలవంటి నేత్రాలు క్రమంగా కిటికీగుండా మిలమిల మెరిసే కోటితారకలుగల ఆకాశం వేపు మళ్లించింది. తుమ్మెదరెక్కలవంటి ఆమె రెప్పలవంటి కన్నీటిముత్యాలు మెరిసేయి. ఆమె నాతో యేదో చెప్పినట్టయి 'అలాగే' అన్నాను.

రైలు కదిలింది. తిరిగి నా ఆలోచనలు రైలులా పరుగెత్తుతున్నాయి. లక్ష్మిజీవితసాగరం మథిస్తే పుట్టిన హాలాహలం యీ రసగుల్లా. దానిని ధరించ గలిగిన వాడొక్క విశ్వనాథుడే. నాకు వెళ్ళిపోయిన రోజులు జ్ఞాపకాని కొస్తున్నాయి.

మేము నాటకాలు వేసే రోజులలో సంజీవి తండ్రి వాల్తేరుస్టేషను చిన్నమాస్టరు. ప్రతి రాత్రీ రిహార్సల్సుకు వాళ్లింటికి వెళుతూండేవాళ్లం. విశ్వం మా అందరికీ పెద్ద. వాడు పద్యాలు విప్లవగీతాలు చదువుతూంటే గుండెలు దద్దరిల్లేవి. లక్ష్మికి వాడి మీద ప్రేమ అనాడు మొలకలెత్తింది.

రైలు చీకటిని చీల్చుకుని పుష్పకంలా పోతూంది. అర్ధరాత్రి దాటింది. చిన్న తుషార వర్షం పడుతూంది. ప్రకృతి చెమ్మగా వుంది. చందమామ వజ్జగా మేఘాలమాటునుంచి ప్రయాణిస్తూ వుండుండి అగుపిస్తున్నాడు.

ఖుర్దారోడ్డు స్టేషనుకు మైలివతల రైలు హటాత్తుగా ఆగిపోయింది. ఎవరో స్త్రీ ఆత్మహత్య చేసు

ఉంది. స్టేషనునుంచి రైల్వే అధికారులు చాలామంది వచ్చేరు. ఆ నిర్భాగ్యజీవి నిర్భిన్న శరీరాన్ని చూడ డానికి యెందరో ప్రయాణీకులు దిగేరు. నేనూ దిగి తిరిగి పెట్టెలో ప్రవేశించి, ద్వారంవద్ద నిలబడి చూస్తూన్నాను. క్రిందనుంచి వొక స్త్రీ కంఠం నన్ను పిలుస్తూంది.

'రాజారావుగారూ, దయచేసి కొంచెం చెయ్యి ఆసరా యివ్వండి.'

నేనాశ్చర్యపోయేను. ఎవరీమె! అక్కడ నేల చాలా దిగువగా వుంది. పైగా యినపతీగెలు మెట్లంగి రాళ్లూ వున్నాయి. ఎవరో స్త్రీ బండీ యెక్కలేక పోతూంది కాబోలు. కాని ఆమెకు నా పేరెలా తెలుసు!'

నా చెయ్యి ఆసరామీద ఆమె లోనికి వచ్చి నా ముందు నిలబడి నమస్కారం చేసింది.

'మరిచిపోయేరా?'

'ఎవరు...నువ్వు...వసుంధరవి కదూ...'

'హమ్మయ్య' అయితే మరిచిపోలేదు. ఏకో ఆలోచిస్తున్నారు. మీ ఆలోచన లింకా అలాగే వున్నాయా బాబూ?'

'ఎక్కడుంటున్నావు వసుంధరా?'

'ఖురదాలో. మిమ్మల్ని చూస్తే నాకెంతో ఆనందంగా వుంది. మీ రెక్కడికి వెడుతున్నా ఖురదాలో మాత్రం యిప్పుడు దిగితీరాలి' నే నాలోచిస్తూన్నట్టు గ్రహించింది.

'నాయింట్లో దిగమనడానికి ధైర్యం లేదు బాబూ. మన సూర్యనారాయణగారు ఖురదా స్టేషనులో టిక్కట్లబాబు. వారింట్లో దిగండి. వారిప్పుడు డ్యూటీమీదే వుంటారు.'

'వసుంధరా, నన్నిప్పుడు బలవంతం చెయ్యకు. నేనొక అవసరమైన పనిమీద బరంపురం వెడుతున్నా. ఈ మాటు వస్తా'

'అమ్మో! ఇప్పుడు మిమ్మల్ని వదిలేస్తే, ఆ చచ్చిపోయిన మనిషిలా పట్టాలమీద తల పగలేసుకోనా. మీరు దిగకపోతే నేను చచ్చిపోయినంత వొట్టు. నన్ను మీరు క్షమా చేసుకు తిన్నట్టే'

నాకు పకాలున నవ్వు వచ్చింది. 'నీ తురక మాట లింకా పోలేదు'

'బాగా చెప్పేరు. మీరు కాబట్టి అని వూరుకున్నారు. ఆ విశ్వంబాబైతేనా, చుట్టుముని వేసే వారే.!

నాకు మరీ నవ్వు వచ్చింది.

తెల్లవారుఝామున ఐదుగంటలకు రైలు ఖురదారోడ్డు స్టేషను చేరింది. నే నెంత వద్దంటున్నా వసుంధర తిన్నగా బుకింగుఆఫీసుకు పరుగుతీసి సూర్యంతో చెప్పింది. వాడప్పుడే డ్యూటీనుంచి విడుదలయ్యేడు. ఎగకట్టిన పంచె, నోట్లో అరంగుళం చుట్టతో నే నున్న పెట్టెవద్దకు వచ్చి నన్ను అమాంతంగా కావలించుకున్నాడు.

'పిరహామ్మక్, పిరహామ్మక్, ఒరే సాయిబూ' అని కేక వేసేడు. కలాసీ రాగానే 'ఏ బాబూ కా సామాన్ ఘర్ పహుంచాదో ఔర్ అమ్మాసే కహో కె యేక్ మెహమాన్ ఆం యేహై' అని అరిచేడు.

మరి నామాట వినలేదు. వాడంతే. అట్లాగులాగ ఆరున్న రడుగుల మనిషి. అరిస్తే యెదుటివాడి గుండె లదురుతాయి.

ఆ సమయంలో వుదయించ నున్న సూర్యుడి లేలేత వెలుగులకు చీకటివలె, వసుంధర అదృశ్యమై పోయింది. నేనూ సూర్యం వాడిల్లు చేరుకున్నాం.

సూర్యం నోరు కిట్టుగానుగ. పైగా వాడు సకల గుణాభిరాముడు. కాని పెద్దమనిషి. మా నాట కాలలో రాక్షస పాత్రలు, త్రాగినవాడి పాత్రలు, హాస్యపాత్రలు ధరించేవాడు. కవి వొకలా వ్రాస్తే వాడు మరొకలా అనేవాడు.

వాడు పెళ్లిచేసుకుంటాడని కాని, సంసారం సరిగా చేస్తాడని కాని యెన్నడూ వూహించనైనా లేదు. మాతో నాటకాలలో నటించడానికి ధైర్యం చేసి వచ్చిన స్త్రీలు వీడి వాలకం చూసి పారిపోయే వారు. వాడి హావభావ చేష్టల చూసినవా రెవ్వరూ వాడిని పెద్దమనిషి అనుకోరు. అందులో స్త్రీలు మరీని.

ఒకమారొక అమ్మాయి వచ్చింది. చిన్నది. అనుభవం తక్కువది. అప్పుడు రాత్రి పదిగంట లౌతుంది. అంతా ఆమెను పాటలు పాడమంటున్నారు శారీరం యెలా వుంటుందో చూదామని. ఏ పాట పురమాయించినా రాదని చెపుతూంది. ఐదు

నిమిషాలు పోయేకా సూర్యం పడుకున్నవాడు వుథ్థేస్తుగా లేచి 'నీకొచ్చినపాట యేమున్నా' అని వురిమేడు. అపిల్ల వెక్కి వెక్కి యేడవ నారంభించింది. విశ్వం సూర్యాన్ని పసితిట్టి ఆ పిల్లను బుజ్జగించేడు. దగ్గరకు వెళ్లి, గడ్డంపట్టుకుని 'అమ్మడూ భయపడకు, మావాడి తీరే అంతే' అన్నాటే ఆమె కొంచెం స్థిమితపడబోయింది. మళ్లీ సూర్యం 'అమ్మా, కూడమ్మా నిన్ను మింగినా, పాడు తల్లీ' అని గడ్డం పట్టుకోబోతే, అపిల్ల గోరువంకలా వణికి విశ్వం వెనక నక్కింది. మర్నాడా పిల్ల ఫికరులేదు. విశ్వం సూర్యాన్ని తిట్టినతిట్లు యిక్కడ వ్రాయలేను.

ఆ వేళ సూర్యం పనిలోకి వెళ్లవలసిన అవసరం లేకుండా యేర్పాటు చేసుకున్నాడు. సాయంత్రం యేడుగంటలకు భోంచేసేం.

'రాజా! నీ దగ్గరున్న మంచి డ్రెస్ వేసుకో. ఇవాళ వొక ప్రత్యేకమైన స్థలానికి వెడుతున్నాం.'

'ఎక్కడికో.'

'నీకా పోటు కాలమే పోయింది కాదు. శుభం అని బయలుదేరుతూంటే యేమిటా అపశ్రుతి ప్రశ్న."

వాడు తెల్లమజిలి గ్లాస్కో పంచ ధరించేడు. గ్లాస్కో కల్లీలాల్చీ తొడిగేడు. క్రీమిన్లు బొత్తాములు, జేబులో బొకెస్టా నోట్లు. ఉల్లిపొరలాంటి అకుతోడు. సెంటుపూసుకున్నాడు. వాడు అద్భుతమైన రంగేళీ ఆంధ్రుడిలా తయారైతే, నేను అప్పుడే ఓడ దిగిన పీను దొరలా తయారయేను. వాడి షోకుక్కు చూస్తే అపశ్రంగా బనారస్ 'షఫ్ఫక్ మాకీ' దగ్గరకు కూడా వెళ్లడానికి తగినట్టున్నాడు.

ఆకాశం నిర్మలంగా వుంది. చుక్కలు తళతళలాడిపోతున్నాయి. రివలగాలి వుల్లాసకరంగా వుంది. సందులు గొందులన్నీ తిరిగి వొకయింట్లో దూరేం. గుమ్మంలోనూ, మేడ మెట్లమీదా చీకటిగా వుంది. మేడమీదకు వెళ్లేవదగ్గరనుండీ వాతావరణం మారిపోయింది. మందమైన దీపకాంతి గల మూడు వరసగదులు; గుమ్మాలకు కిటికీలకు సిల్కు తెరలు. వరండామీద వొక ముసిలాడు పడుకున్నాడు.

'సలామ్ సాబ్'

'కులాసాగా వున్నావా పుర్‌షాన్, ఇదా' అని సూర్యం డబ్బులిచ్చేడు. తెర తొలగించుకుని ముందు గదిలో ప్రవేశించగానే సూర్యం 'ఉర్వాశ్, వీధి తలుపు బంద్ చెయ్యి' అన్నాడు.

ఆగది చాలా విశాలంగా వుంది. ఎదురుగోడకు వొకవేపు పెద్ద పందిరిమంచం, పాలతెలుపు పరుపు తలగడాలు, బాలీసులు. కుడివేపు రెండు సోఫాలు, కుర్చీలు. మంచానికెదురు గోడదగ్గరగా చిన్న టేబిలు నాలుగుకుర్చీలు. అది వొక జమీందారు యొక్క గాని, పెద్ద వరవిలాసినియొక్క గాని శయనాగారంలా వుంది. నేను సోఫాలో కూచున్నాను. సూర్యం స్వంతయిల్లులా పచారు చేస్తున్నాడు చుట్ట కాలుస్తూ.

ఐదు నిముషాలు గడిచాకా ఊర్వశి తలలోంచి జారిపడిన సంపెంగపువ్వులా వాలిపడింది మా ముందు. నా వేపుచూసి బుగ్గమీద కుడిచేతి చూపుడువ్రేలు పెట్టుకుని, కళ్లు వయ్యారంగా తిప్పుతూ 'ఎవరు గెల్చారు' అంది. మరు నిముషంలో ఆమె వినయ పూర్వకంగా 'బాబూ మీరిలా రావడం, మా వూళ్లో దిగకుండా వుండడం నా' అంది.

'కబుర్లు చెప్పడమేనా మా గొంతులలో యింత వేడి వేడిగా పొయ్యడమేముందా' అన్నాడు సూర్యం.

'ఎందుకురా, ట్రోవలో నేగా టీ తాగాం.'

'టీ! పెథవ టీ యెవడికి కావాలి, పాలోయ్, పాలు' 'బోను రాజారావు బాబూ, సూర్యంగారికి పాలు కావాలి. చంటిపిల్లలు మరి.'

'అబద్ధం కాదు. నీవంటి సౌరజాణదగ్గర యెంతవాడైనా, యెప్పుడైనా చంటిపిల్లలే. ఏం రాజా!'

నాకు నోట మాట రావడంలేదు. వసుంధరను నే నిదివరలో చూసినప్పుడు గులాబీ మొగ్గ. నేడో! రేకులు విచ్చుకున్న పువ్వు! ఆమె నవ్వితే గదిలో వెలుతురు రెక్కువైపోతూంది. నే నిలా ఆలోచిస్తూంటే వాళ్లిద్దరూ యేమిటో కళ్లతోటే మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు. నేను తెలివితెచ్చుకుని 'ఏమిటి' అన్నాను.'

'ఆ యేమీ లేదు. నీకు మతిపోయినట్టుంది. ఏదైనా మందు పొయ్యమని వసుతో చెపుతున్నాను.'

వసుంధర కళ్లింతలుచేసి వుదాసీనంగా నవ్వుతూ 'నీ మాటసున్నితం యెప్పుడూ వొక్కలాగే వుంది' అంది. ఈ సంభాషణ జరుగుతూంటే

ఉన్నాను, మరొక కుఱ్ఱవాడు వచ్చి, టేబిలు గది మధ్య అమర్చి కుర్చీలు వేసేరు. ఒక కుర్చీమీద కూచుంటూ సూర్యం, 'తప్పేమిటి, రాజా నీకు మతిదివరకే కదా' అన్నాడు. నేను కూడా వొక కుర్చీ మీద కూచున్నాను. వసుంధర కూచుంటూ 'మీ నోటికి కళ్ళెంపులా తాళాల్లు లేవు. విశ్వం బాబుంటే మీ కిప్పుడు బుద్ధి చెప్పి వుండును' అంది.

'వాడి వూసెత్తకుమీ, నాకు వళ్లు మండుతుంది.'

'ఔను కాని సూర్యం, విశ్వ మెక్కడున్నాడురా?'

'నీకూ వాడి బాధే పట్టుకుంది. ఇప్పుడిప్పుడే వాడి సంగతి మరిచి పోగలుగుతున్నాను. మళ్లీ నువ్వు కెకత్తిందవు.'

'నీకు తెలీదురా. వాడిని చూడాలని తహతహలాడిపోతున్నాను. చెప్పరా యెక్కడున్నాడో.'

'ఆ సూర్యుడి వూసెత్తవద్దురా మహాప్రభో, నీకు నమస్కారం!'

'ఏమిటి బాబూ, ఆయనమీా దలా విరుచుకుపడతారు. ఉదయం లేస్తూనే ఆయన్ని తల్చుకుని దండం పెడతాను.'

'హమ్మయ్య' అనుకున్నాను నేను. వాడిని కొంచెం గ్రహించగలిగిన వ్యక్తి దొరికించిందిప్పటికి.

'వసుంధరా, నీకు విశ్వం జ్ఞాపకమున్నాడా?'

'జ్ఞాపకమా, నే నీ రోజున యిలా కలకలలాడుతున్నానంటే ఆయన పెట్టిన భిక్షే.

'బుగ్గలు సాగదీసేవాడుగా' అన్నాడు సూర్యం.

'బుద్ధిచెప్పినవాడు గుద్దితే నేమయా' అన్నారు పెద్దలు. ఆయన చెప్పిన నాలుగుముక్కలే నన్నివాళ హాయిగా బతకనిస్తున్నాయి. నిజానికి ఆయనమీద నామనసు పోయింది. కాని నిప్పులాంటి అమనిషి దగ్గరకు చేరలేకపోయేను. ఒక్క తెలుగుముక్కయినా సరిగా పలకలేని వాచేత కవిత్వం వ్రాయించేరు. సూర్యం బాబిలా తిట్టడాని కాయన దోష మేమిటో తెలీదు.

ఓనాడు రాత్రి పన్నెండింటికి నాచేత నాటకంలో ముక్కలనిపిస్తున్నారు. ఏం బుద్ధి పుట్టిందో నన్ను హటాత్తుగా కావిలించుకుని ముద్దెట్టుకున్నారు. నేను విదిలించుకోలేదు. యీసడించలేదు. కాని వారే మూడు రోజులవరకూ నొచ్చుకున్నారు.'

సూర్యం మధ్యలో ఆమెను గసిరి ఆపేడు 'సరేలే యేదో యేడిసేరు. ఆ సీసా తీసుకురా' అన్నాడు. వసుంధర సీసా తెచ్చింది. సూర్యం ధగధగ మెరిసే వైను మూడు గ్లాసులలో పోసేడు. ముగ్గురం బంగాళా దుంపల పకోడీ, ఆమ్లెట్ ఫలహారం చేస్తూ వైను సేవిస్తున్నాం.

'విశ్వం ఎక్కడున్నాడురా?'

'మూడేళ్లక్రిందటినుంచీ వాడు సరీగా ఆఫీసుకు వెళ్లడం లేదట. ఎప్పుడూ శలవేట. అప్పులపాలయిపోయేట్ట. నీ కెందుకీ విశాఖపట్టణం వుద్యోగం, కలకత్తా ఆఫీసులో నా కొక స్నేహితుడున్నాడు. వాడిద్వారా నీకీ ప్రాంతంలో వుద్యోగం వేయిస్తాను రమ్మంటే వినేమి విన లేదు. నిరుడు బరంపురంలో తల్లిపోయింది. ఏ టన్నిటికీ తోడు ఆరోగ్యం బాగులేనివాడికి కా సిగరెట్లొం! అదే కొల్పసమా!

మూడు నాలుగు నెలల క్రితం లేఖ వ్రాసేడు. బరంపురంలో వాళ్ల త్త వారింట్లోనే వున్నాడు.'

'వాడి ఆరోగ్యం యెలావుంది?'

'ఎలా వుంటుంది? టి బి వచ్చిందిట. కాని సిగరెట్లు మానలేకపోతున్నాడట.'

వసుంధర నేనూ వొకేసారి 'రామ్మరామ' అన్నాం.

'రామరామా లేదు, బొల్లిగడ్డా లేదు. మరి వా డెందుకు పుట్టేడు? మనవంటివాళ్లతో స్నేహం కట్టి మనని చంపుకుతినడానికి. వాడి కే బాధా లేదు. హాయిగా వుంటాడు.'

వసుంధర కళ్ళంట నీళ్లు వస్తున్నాయి. 'ఏం మాటలు బాబూ మీవి. ఇన్నాళ్లా యీ సంగతి చెప్పేరు కారు. ఎలావుందో పాపం. జెడదామా అండీ' అని సూర్యం వేపొకసారి చూసి, వెంటనే నావేపు మళ్ళించింది జాలిగా, ఆర్తతతో కన్నీళ్ళతో.

తరవాత ఐదునిమిషాలసేపు ఎవ్వరం మాట్లాడ లేదు. ఆ వేళ రాత్రి ఒంటిగంటవరకూ కబుర్లు సాగాయి నా మనసక్కడ లేదు. ఒంటిగంటకు నాకు కొంచెం చెరుపు మరుపు అవస్థపడుతూంది. వెళ్ళి పక్కగదిలో పడుకున్నాను.

తెల్లవారుఝామునే లేచి యింటికి మరలేము. సుమ్మంధరకూ దిగబెట్టడానికి వచ్చి వసుంధర విశ్వం భోగట్టా వెంటనే వ్రాయమంది.

ఇంటికి చేరేకా సూర్యం తన భార్యతో బొంకేడు నాటకానికి వెళ్లేమని.

ఖురదారోడ్డునుంచి వెడిపోతున్నప్పుడు ప్లాట్‌ఫారంమీద సూర్యం నా రెండు భుజాలూ పట్టుకుని కళ్లలోకి చూస్తూ యిలా అన్నాడు. 'బ్రదర్ విశ్వంవిషయంలో నీ మనసును నొప్పించేను కామోసు. కాని నా వుద్దేశం అది కాదు. నిజానికి నా వూహాప్రకారం వాడుత్త చాతకానివాడు. ప్రేమించి హృదయం కాళ్లముందు సమర్పించినవారిని ఆదరించలేకపోయాడు. దగ్గర వుంటే పోషిస్తామన్న పెద్దలవద్ద వుండలేకపోయేడు. పిల్చి మంచి వుద్యోగం యిప్పిస్తానని బతిమాలితే రాలేకపోయేడు. సంపాదించినది దాచుకోలేక పోయేడు. ప్రేమికుల, స్నేహితుల, అభినందించిన వారి, ఆదరించినవారి హృదయాలలో ఆరని చిచ్చు పెట్టి, తన సంసారం ధ్వంసంచేసుకున్న బతకలేని వాడు విశ్వం. కానైతే వాడిమీద నాకున్న ప్రేమకు వానకాలంలో పొంగే గోదావరినదే సారూప్యం. నువ్వెంత బాధపడుతున్నావో కూడా నాకు తెలుసు. నీ బాధా నా బాధా వొక్కటే. నన్ను క్షమించు. వాడి కెలా వుందో వ్రాయి.'

వాడి పాషాణహృదయం కూడా కరిగి రెండు కనుకొలకుల్లో మెరిసింది.

రైలు మళ్ళీ కదిలింది. అది పరుగెడుతూంటే ఆశబ్దం నా గుండెల్లో 'బరంపురం బరంపురం' అని ప్రతిధ్వనిస్తూంది. తెల తెలవారుతూంటే మెయిలు బరంపురం చేరింది. అవేళ ప్లాట్‌ఫారం నిర్మానుష్యంగా వుంది. అక్కడక్కడ కాకులు గుంపులుగా చేరి అరుస్తున్నాయి. నేను స్టేషనులోనే స్నానంచేసి 'టీ' త్రాగి బయలుదేరేను. విశ్వం అత్తవారిల్లు కనుక్కుని చేరేసరికి తొమ్మిదైంది.

వీధి వసారలో వొక ముసలాయన కూచున్నాడు. విశ్వం అత్త వారిల్లిదేనా అని ప్రశ్నించేను. అతడే నని తలవూపేడు. 'రాజారావు అనే స్నేహితుడు వచ్చేడని విశ్వంతో చెప్పండి' అన్నాను. అతడు నుదుటిమీద చెయ్యివేసుకుని 'మా అల్లుడికి మీ కబురందజేసే శక్తి మానవులలో లేదు. అతడు పదిరోజుల క్రిందట గోపాలపురంలో శాశ్వతంగా కళ్లు మూసేడు' అన్నాడు.

అప్పుడు నా కనుపిస్తూన్న ప్రతీదీ యీతకొడుతూంది. ప్రపంచం గిరగిర తిరుగుతూంది. ఆ దృశ్యంలో అక్కడ లేని వ్యక్తులూ, వస్తువులూ కూడా తిరుగుతున్నాయి. ఎన్ని హృదయాలలో అన్ని మాటలు.



# గ్రంథ విమర్శనము

## నన్నిచోడకవి చరిత్ర

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి. ఉలవపాడు —వయా, కావలి. వెల : 2-8-0.

నన్నిచోడుని కుమార సంభవము ప్రకటింపబడినప్పటినుంచీ ఈ కవి కాలనిర్ణయంమీద అనేక విధాలయిన వాదోపవాదాలు చెలరేగుతూనే ఉన్నాయి.

మొట్టమొదటగా కుమారసంభవం ప్రకటించిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు నన్నిచోడ కవి కాలము శ్రీ శ ౯౪౦ ప్రాంతమని అన్నారు. ౧౨ వ శతాబ్ది ప్రారంభంలోనివాడని శ్రీ పాద లక్ష్మీపతి శాస్త్రీగారు అభిప్రాయపడ్డారు. అయితే శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు ఇతడు ఇంచుమించుగా నన్నయకు సమకాలీనుడని తమ ఆధారాలనుబట్టి నిర్ణయిస్తున్నారు.

ఇలాగే ఈ కవికాలం తిక్కన తరవాతి కాలం దాకా తీసుకుపోయే చరిత్ర పరిశోధకులు కూడా ఉన్నారు.

ఈ కవికాల నిర్ణయానికి ఆధారమైన-

గురువున కిష్టదైవమునకుం
 బతికిం గృతిచెప్పి పుణ్యమున్
వరమును దేజమున్ బడయవచ్చు
 జగంబుల నిశ్చయంబు, మ
ద్గురువును నిష్టదైవమును
 గూర్చు విజేసుఁడుదాన నాకుగా
నొరునకు నిట్లు సేయకను
 దొక్కట లాభము లెన్ని యన్నియున్.

అనే పద్యంలో 'కూర్చువిజేసుని' గూర్చి వాదోపవాదాలకు అవకాశం ఉన్నది.

ఈ పద్యంలో పేర్కొనబడిన మల్లుడు త్రైలోక్య మల్ల సోమేశ్వరుడని శ్రీ రెడ్డిగారి ఊహ. ఈ ఊహ కాధారంగా వారి గ్రంథంలో కొన్ని ఉపపత్తులు చూపించారు.

ఈ మల్లుడు త్రైలోక్య మల్ల సోమేశ్వరుడే కానక్కరలేదనీ ఇంకా ఇతరమల్లు లొకరున్నాడనీ, శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారి అభిప్రాయము.

ఇక శాసనాలలో నన్నిచోడులు ఇద్దరు కనిపిస్తూండడమువల్ల ఈ వాదం మరింత జటిలంగా మారిపోయింది. అయితే శ్రీ రెడ్డిగారు చిరపరిశ్రమచేసి, కుమార సంభవములో గూఢ వస్తుమయ వ్యంగ్యం ఉన్నదనీ తద్వారా నన్నిచోడ కాలనిర్ణయం సుగమ మౌతున్నదనీ నిరూపిస్తున్నారు. దీనికి ఈ క్రింద నిరూపింపబడిన పద్యాల వంటివి కొన్ని ఉదాహరించి వీటిలో వ్యంగ్యార్థం ఉన్నదనీ, వాదిస్తున్నారు. వీరు ఉదాహరించిన పద్యాలలోని ఒక పద్యం ఈ క్రింద ఉదాహరిస్తున్నాము.

"ద్వాదశ శార్ఙ్గ నయను నా ద్వాదశార్ధ
వదను డొగి జుట్టి నిజభుజద్వాదశమున
ఉదయ దశశర కిరణు డెయ్యుదయనగము
గిట్టి దశశతకరముల జుట్టినట్లు"

ఇది కావ్యంలో కుమారపరమేశ్వరుల సమావేశం వర్ణించే కథా ఘట్టము.

ఈ పద్యంలో సంఖ్యార్థక పదాలవల్ల వచ్చిన సంఖ్యలు ఆధారంగా చేసుకుని శ్రీ రెడ్డిగారు కవికాల నిర్ణయానికి ఉపక్రమిస్తున్నారు.

ఇతరములయిన శాసనాదులవల్ల కవికాల నిర్ణయానికి దృఢమైన ఆధారము దొరికినప్పుడు ఈలాంటి పద్యాలు ఆ నిర్ణయానికి ఆధారభూతంగా ఉదాహరించడం సముచితంగా ఉండగలదేమో! అంతే కాని ఇటువంటి పద్యాల పునాదిమీద నన్నిచోడ కాల నిర్ణయం సాహసమే అవుతుంది. శ్రీ రెడ్డిగారే అంగీకరించినట్లు ఒకవేళ ఈ పద్యాలలో ఇటువంటి కాల నిర్ణయ వ్యంగ్యం లేకపోయినా లేకపోవచ్చును.

ఇప్పటికి నన్నిచోడ కవిని గురించి బయలుదేరిన వాదాలలో శ్రీ రెడ్డిగారి వాదం దృఢమైన వాదాల్లో ఒకటిగా పరిగణించవచ్చును. అంతేగాని శ్రీ రెడ్డిగారి గ్రంథంలో నిరూపించినవాదం సత్యమే అని దృఢంగా నిర్ణయించడానికి తగిన ఆధారా లేవీ ఇంతవరకు లభించలేదు.

నన్నిచోడుని గురించి ఇంకా సువిశేషంగా పరిశోధన జరగవలసి ఉన్నది. బహుశః ఏదైనా ఒక నూతన సాక్ష్యం లభించడంవల్ల నన్నిచోడుని కాల నిర్ణయంసుకరం కావచ్చును.

అయితే రెడ్డిగారి గ్రంథంలో ఇంతకుపూర్వం నన్నిచోడుని విషయంలో బయలుదేరిన చరిత్ర పరిశోధకుల వాదాలన్నీ క్రోడీకరించి సప్రమాణంగా తమ వాదం వివరించారు.

దీనికి పీఠిక వ్రాస్తూ శ్రీ డాక్టరు నేలటూ

వెంకటరమణయ్యగారు కొన్ని విషయాలలోను తాము రెడ్డిగారితో అంగీకరించలేక పోతున్నామనీ, నన్నయకంటె నన్నెచోడుడు ప్రాచీనుడని తాము విశ్వసిస్తున్నామనీ వ్రాశారు.

డాక్టరు వెంకటరమణయ్యగారు పీఠికలో సూచించినట్లు నన్నిచోడ కవికాలసమస్యలు అవగాహన చేసుకొనదలచిన వారి కిది అవశ్యపఠనీయమైన ఉత్తమగ్రంథము.

---

## బిళ్లల మొలత్రాడు

"కరుణ కుమార"

ఆధునిక వాఙ్మయకుటీరము ౨౨, దివాకర్ రామయ్యంగారి వీథి, పరశువాకం, మదరాసు 7. వెల: ఒక రూపాయి.

ఇది రైతు జీవితానికి సంబంధించిన కథ. రామిరెడ్డి అనే రైతు ఇంట్లో యానాది సుబ్బులు చిన్నప్పటినించీ పాలికాపుగా ఉంటాడు. రామిరెడ్డి తల్లి సుబ్బుల్ని పుత్రవాత్సల్యంతో ఆదరిస్తూ ఉంటుంది. ఇల్లాగ ఉండగా కొన్నాళ్ళకు సుబ్బులుకు వివాహం అవుతుంది. ఆ పిల్ల కాపరానికిరాగానే రామిరెడ్డి ఆమెపై కన్నువేసి బలాత్కరించ ప్రయత్నిస్తాడు. క్రమంగా రామిరెడ్డి సుబ్బులుపై బిళ్లల మొలతాడు అపహరించాడనే నేరం మోపి కేసు పెట్టిస్తాడు. కాని రామిరెడ్డి తల్లి ఔదార్యం వల్ల, వాత్సల్యంవల్ల ఈ ఆపత్తు తప్పిపోతుంది. చివరికి రామిరెడ్డి జైలుకు వెడతాడు. దీనితో కథ ముగిసిపోతుంది.

ఈ కథలో శ్రీ కరుణకుమారగారు గ్రామీణ జీవితము, దానిలోని కష్టనిష్ఠూరాలు సహజ వాతావరణంలోనే చిత్రించారు. కాని సాలేరుకోసం తిన కొడుకునే జైలుకు పంపించిన ఆమె చిత్రణం వాస్తవికంగా లేదు. ఇల్లాగే మిగిలిన వ్యక్తుల చిత్రణంలో కొంత అసహజత్వం ప్రవేశించింది.

ఈ రచయిత వాతావరణ చిత్రణంలో తీసుకున్న శ్రద్ధ పాత్రల వ్యక్తీకరణంలో తీసుకున్నట్టు కనబడదు. ఈ పాత్రంలో ఏర్పడిన అసహజత్వం వల్ల మొత్తంమీద కథే కొంతవరకు అభూత కల్పనగా కనిపిస్తున్నది.

అయితే గ్రామీణ జీవితపరిసరచిత్రణంలో రచయిత శక్తి ప్రశంసార్హంగా ఉన్నది.

---

## ప్రాగ్జ్యోతి

[రేడియో నాటికలు]

'హితశ్రీ'

వెల : రూపాయిపావలా.

దీనిలో ౧. ప్రాగ్జ్యోతి ౨. ఎర్రచారలు ౩. చరిత్రకందని కొందరు ౪. అడ్డంతిరిగిన కథ ౫. పరీక్ష ౬. ఎండమావులు అనే శ్రవ్యరూపకాలున్నాయి.

ఇటీవల రేడియోప్రసారం అభివృద్ధిచెందుతున్నప్పటినించీ శ్రవ్యరూపకరచన బాగా వ్యాప్తిలోకి వచ్చింది. అయితే దృశ్య, శ్రవ్య, పాఠ్యరూపకాలలో వాటివాటి ప్రత్యేకతలనుబట్టి రచనా విధానాలలో మార్పు రావాలి. నిజానికి పాఠ్యరూపకాలకు, శ్రవ్యరూపకాలకు అంతగా తేడా అవసరం లేదుగాని మిగిలినవాటి రచనా విధానంలో వైవిధ్యం ఏర్పడి తీరుతుంది.

ఈ రూపకాలలో ఈ ప్రత్యేక రచనా విధానం అనుసరించినట్లు కనిపిస్తున్నది. వీటిలో "ప్రాగ్జ్యోతి"లో మానవుని అంతరాత్మ అడుగడుక్కీ మానవుని ప్రవృత్తులకు అడ్డుతగులుతూ అధిక్షేపిస్తూ ఉంటుంది. చివరికి అహింసే అన్నివిధాలా మానవ సమస్యాసాధనకు ఉపకరింపగలదని సూచింపబడింది.

మొత్తంమీద ఈ రూపకా లన్నిటిలోను, ప్రాగ్జ్యోతి, 'కథ అడ్డంగా తిరిగింది' అనే రూపకాలు రెండూ బాగున్నాయి. మిగిలిన రూపకా లన్నిటిలోను, సంభాషణలు చురుగ్గా నడిచాయి. అయితే వీటిలోని ఇతివృత్తాలలో రూపకరచనకు కావలిసినంత సంపూర్ణత లేదు. ఇవి చాలావరకు కేవలం 'చిత్రణాలే.'

---

## రాణీదుర్గ

బూదూరు రామానుజులురెడ్డి. తెలుగుపండితులు, బోర్డు హైస్కూలు తిరుత్తని, చిత్తూరుజిల్లా.

ఇది రాణీదుర్గావతి చరిత్ర ఆధారంగా తీసుకుని రచించిన గీతపద్యకావ్యము.

రాణీదుర్గ అక్బరు చక్రవర్తితో పోరాడి చివరికి ఆత్మగౌరవ రక్షణార్థమై అసువులుబాసిన వీరవనిత. కవి ఈ వీరవనితచరిత్ర సరళమైన కథనశైలిలో నడిపించుకుపోయారు.

ఈ కావ్యంలో రాణీదుర్గను పట్టుకోవాలని శత్రువులు ప్రయత్నించినప్పుడు రాణీదుర్గ విక్ర

మించిన ఘట్టం ఈ కావ్యంలోని మిగిలిన ఘట్టాల కంటె ఎన్నదగినదిగా ఉన్నది :—

"శాత్రవవీర భయంకర సములొలసి
కలసి యాదేవిరూపంబు గాంచె నవగ
బాణసంధాన విద్యావిధాన గరిమ
మించె మాపలు మిక్కిలి మిణకరింప
అఖిలశాత్రవ యోధ సంహార ఘోర
భీకర కరాళమూర్తియై వీక నరుల
జంపి చెండాడి యాలముల్ సేయు దుర్గ
అద్రిరాట్పుత్రి వీర్యమత్యద్భుతంబు
కదనమున రేగు ధూళి మేఘములుగాగ
మెలత దళతళ మెరసెడు మెరపుగాగ
వారి నినదంబు ఘనగర్జనంబుగాగ
బాణకంకణతతి జడివానగురిసె."

శిష్టమైన భాష. దూరాన్వయ క్లిష్టతలు లేని సరళకథనము ఈ కావ్యంలోని ప్రత్యేక గుణాలు.

పీఠికాకర్తలు శ్రీ వేదము వెంకటకృష్ణ శర్మగారన్నట్టిది పాఠ్యగ్రంథంగా నిర్ణయించడానికి తగిన చక్కని కథా కావ్యము.

---

## ధర్మచక్రం

శ్రీ నందూరి రామకృష్ణమాచార్య. త్రివేణీ పబ్లిషర్సు : మచిలీ పట్టణము. వెల : రెండు రూపాయలు.

ఇది ఉషాసుందరీ బిందుసారుల ప్రణయగాథ ప్రధానేతివృత్తంగాగల చారిత్రక రూపకము. కాని వీరిద్దరి మధ్య ఏర్పడిన ప్రేమకు చాణక్యుని కుతంత్రాలచే విఘాతం కలుగుతుంది. చివరికి ఉషాదేవి బౌద్ధసన్యాసినిగా మారిపోతుంది. రచయిత ఈ కథకు నందినీ మేఘనాథుల అనురాగగాథ ఒక ఉపగాథగా కల్పించారు. అయితే ఈ నందినికూడా మేఘనాథుని మరణంవల్ల విరక్త అయి బౌద్ధసన్యాసినిగా మారిపోతుంది. చివరకి బిందుసారుడు ఉషాసుందరిదగ్గర బౌద్ధదీక్ష స్వీకరించి ధర్మరక్షణ చేస్తానని ప్రతిజ్ఞ తీసుకుంటాడు. అందుచేత ఈ నాటకానికి ధర్మచక్రం అనే పేరు సముచితంగానే ఉన్నది.

ఈ నాటికలో సంభాషణలు సహజంగా చురుకుగా సాగిపోతూ పాఠకునికి ఉత్తేజకరంగా ఉన్నాయి.

అయితే పాత్రపోషణ అంతగా నిశితంగా జరగలేదు. ఉన్నవారిలో గండోదర దండుకేశ్వరులిద్దరు కొంత సజీవంగా కనిపిస్తున్నారు.

ఈ రచయిత రూపకరచనా శక్తికంటె కవితాశక్తి ఎన్నదగినదిగా కనిపిస్తున్నది.

ఈ క్రింద ఉదాహరింపబడిన వృత్తాలనుబట్టి ఈ రచయిత కవన శక్తి గ్రహింపవచ్చును.

"మామిడి తోపులో పొదలమాటున
పికిలపువ్వు వాటికకా
అమరి లేత వెన్నెలలయందు
ఒయారము లొల్కబోయుచుకా
కోమలి చేరరమ్మ! జడకుచ్చులు
పైయెదపై నటింపగా
ప్రేమ రసామృతమ్ము కురియింపుము
నీ చిరునవ్వు చిందులకా"

సరళమైన ఈ ప్రభాతవర్ణన కూడా పరిశీలింపదగినది.

"చల్ల గాలులలోన మెల్లగ తలలెత్తి
పూర్వదిశకు ప్రొద్దు పొడుపు పూలు
కలకలనాదాలు చెలగ పిల్లలు, మేలు
కొన్నవి పిచ్చుక గూళ్ళలోన
ప్రత్యూష కాంతుల పద్మిని పులకించి
చెందను చిన్నారి చిలిపి నవ్వు
చిగురాకు పందుల వగరుగొంటుక నెత్తి
కూయసాగినది పుంస్కోకిలమ్మ

సులకరాశ్లను దొర్లించుకొనుచు కొంత
దాటి వచ్చుచున్నది పెలరేటి జాలు
అరుణ కిరణమ్ము లుదయాద్రి నవతరింప
నవ్యచైతన్యము ప్రకృతి నాట్యమాడె."

ఈ నాటకంలోని పద్యాలేకాక కొన్ని కొన్ని పట్టుల గేయాలుకూడా ప్రత్యేకంగా పేర్కొనదగినవిగా ఉన్నాయి.

---

## రత్నమాణిక్యాలు

(నాటికలు): రచయిత శ్రీ వి. డి. ప్రసాదరావు; సాత్యవతేయ ప్రచురణలు; వెల రు 1-8-0; ప్రతులు దొరికేచోటు: శ్రీ వి. డి. ప్రసాదరావు, 5 వాదమురి వీధి, త్యాగరాయనగరు, మద్రాసు.

ఈ సంపుటిలో సనాతన, అయితే గియితే, రత్నమాణిక్యాలు, పరిపాటి, విలయము అనే అయిదు నాటికలున్నాయి. వీనిని రచయిత రంగప్రదర్శన కోసం కాక శ్రవ్య నాటికలుగా రచించారు. అందువల్ల పాత్రపోషణను, కథా సన్నివేశాలను, విషయ విస్తరణకూ తదనుగుణంగానే నిర్వహించారు. అభినయ ప్రధానమైన రంగప్రదర్శనాలలో కంటె శ్రవ్య నాటికలలో అనుకూల వాతావరణాన్ని సృష్టించేతీరు, పాత్ర శీలాదులను నిరూపించే విధానం భిన్నంగా ఉంటుంది. కథా వస్తువుకు అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించడంలో సముద్రఘోష, గాలిహోరు, వృష్టిపాతం మొదలైనవి అనివార్యమైనవైనప్పటికీ, అవి కృత్రిమాలంబనాలే కాని ప్రధానమైనవి కాజాలవు. శ్రవ్యనాటికలకు ఉచ్చారణ సౌలభ్యం, సంభాషణలే ప్రాణం పొయ్యాలి.

అయిదు నాటికలలో 'సనాతన' కథావస్తువు కరువు కాలంలో అమానుష స్థితిగతులలో ఒక పసిబాలుని మానుష సహజమైన ప్రేమార్ద్రత, త్యాగశీలం నిరూపిస్తుంది. లేమివల్ల బాధపడుతూ భ్రమకులోనైన వ్యక్తి ఎట్టి వెర్రి ఆశలకు లోబడతాడో, తరవాత పేకమేడలు ఎంత శీఘ్రంగా కూలిపోతాయో నిరూపించడానికి "అయితే గియితే" కథావస్తువు తీసుకోబడింది. సంసారంలో కష్టాలను అర్థంచేసుకోకుండా, వేరే ఆధారంలేని తల్లిపట్లగాని, తండ్రిలేని తమ్ముడు చెల్లెళ్ల పట్లకాని శ్రద్ధ, జాలిలేక పడుచువారు ఎంత స్వార్థ బుద్ధితో జీవనాన్ని కష్టమయంచేస్తున్నారో నేటి పరిస్థితులను ప్రతిబింబింపచేయడానికి 'రత్నమాణిక్యాలు' అనే నాటికలో రచయిత యత్నించారు. పరిపాటి అయినందువల్ల నిత్యజీవనంలోని ఆచారాలు, మనస్తత్వాలు వ్యష్టి జీవనాన్ని ఎలా దుఃఖమయం చేస్తున్నాయో, వానిని గమనించి దిద్దుకోవలసిన అగత్యాన్ని తెలియపరుస్తుంది 'పరిపాటి' అనే నాటిక. 'విలయము' అనే నాటికలో కపట సన్యాసులవర్తన, మూఢనమ్మిక గలవారి పాట్లు వివరించబడినాయి.

వీనిలో రచయిత లక్ష్యాలకు అనుగుణమైన కథా సన్నివేశాలను, పాత్రలను ఎంచడంలో చక్కని నేర్పు చూపారుకాని, సంభాషణలలో అవసరమైనంతపట్టు రాలేకపోయిందని చెప్పక తప్పదు. పరిపాటిలో మొదటిరంగంలో నేటి వైద్యుల వ్యవహార విధానం, వైద్యులవల్ల తృప్తిచెందలేని రోగుల గతి, పొట్టకోసం కక్కుర్తి పడివచ్చిన కాంపౌండర్ పట్ల డాక్టర్ భార్య నిరాదరణ, ఆపైన భర్తవద్ద పితూరీ చేసినప్పుడు భార్య వక్రబుద్ధి చక్కగా చిత్రించబడినాయి. కాని ఆ తరవాత వెంటనే వాస్తవ

వాతావరణం అంతర్థానమై పోతుంది. తెలియని తనంవల్ల సంసారంలో చిక్కులు తెచ్చిపెట్టుకున్న డాక్టరుభార్య కళ్ళు తెరిపించడానికి రమ అనే వేశ్యను సృష్టించారు. ప్రేమించదగకపోయినా సుఖపెట్టడం వృత్తిధర్మంగా పరిగణించి చిత్తశుద్ధితో ఆ ధర్మాన్ని నెరవేర్చే వేశ్యలు వాస్తవంగా లోకంలో ఉండకపోయినా, రచయిత తన లక్ష్య నిరూపణకోసం ఇటువంటి చిత్రవ్యక్తిని సృష్టించవచ్చును. డాక్టరుకీ అతని భార్యకీ హృదయ పరివర్తన సహజంగా కనపడదు. ఆ పరివర్తనను నిరూపించడం నాటిక లక్ష్యమైతే, సంభాషణలు కాని సన్నివేశాలు కాని ఆ లక్ష్యాన్ని సాధించలేక పోయినవని చెప్పాలి.

వాస్తవ పరిస్థితులను చక్కగా చిత్రించగల నేర్పు రచయితకున్నదని 'పరిపాటి'లోని మొదటి రంగం నిర్వహణ నిరూపిస్తున్నది కాని ఆ నేర్పు నాటిక లన్నిటిలోనూ వినియోగపడలేదనిపిస్తుంది. 'సనాతన'లోనూ, 'విలయము'లోనూ పాత్ర రచనలో కాని, సంభాషణలో కాని, సన్నివేశంలో కాని తన లక్ష్యాన్ని నిరూపించలేదనిపిస్తుంది. సంభాషణలో ఒక వ్యక్తి చెప్పేమాట కాని రెండో వ్యక్తి చెప్పే సమాధానం కాని కథావస్తువుకి ఆధారభూతం కాలేకపోయినా యనిపిస్తుంది. అయితే మానవ మనస్తత్వాన్ని చక్కగా ప్రతిబింబ చేసినందువల్ల 'విలయము'లో కొంత భాగాన్ని (అనగా ఉప్పెనవచ్చేవరకూ) చకచకా రచయిత చదివింప చేస్తారు.

'రత్న మాణిక్యాలు' అనే నాటికలో పాత్ర పోషణ పుష్టిగా ఉంది. వాస్తవ పరిస్థితులకు, మానవ మనస్తత్వానికి, కథా సంవిధానానికి, సంభాషణకు చక్కని పొందిక కుదిరింది. నాటిక మొదటినుంచి చివర వరకూ ఒకే పట్టులో నడుస్తుంది. చిన్న పిల్లల చిలిపితనంతో తల్లి కష్టాలను జాలిగా జోడించి వ్రాసిన ఈ నాటిక చదివే వారి హృదయాల్ని స్పృశిస్తుంది.

నాటికలలో కథావస్తువు ఏ వాతావరణంలో విస్తృతి చెందినప్పటికీ, అట్టివిస్తృతికి రచయిత మానవ సహజమైన మనస్తత్వాలను చక్కగా గమనించి తదనుకూలమైన సంభాషణలను నిర్వహించారు. 'సనాతని' అనే నాటికను మినహాయించి మిగతా వానిని మాత్రమే ప్రచురించినట్లయితే ఈ సంపుటి పుష్టిగా ఉండేదనిపిస్తుంది.

---

## మంచు తెరలు

[నాటికలు]

రావులపర్తి భద్రిరాజు వెల: 12 అణాలు. చిరునామా లేదు.

ఈ పుస్తకంలో 'మంచుతెరలు' 'డార్లింగ్' అనే రెండు నాటిక లున్నాయి. వీటిలో మొదటి నాటికలో బ్రాహ్మణ కుటుంబాల్లో శాఖా భేదాలవల్ల ఏర్పడే అడ్డంకులు తొలగించడం మంచిదని రచయిత సూచిస్తున్నారు.

రెండవదానిలో పల్లెటూరులోని ఒక భాగ్యవంతుడు పట్టణంవెళ్లి అక్కడ ఒక మోసకత్తెవలలో మోసగింపబడి తిరిగి ఇంటికి చేరుకుంటాడు.

ఈ పుస్తకానికి పీఠిక వ్రాసిన శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు "రసజ్ఞుల శిరఃకంపనకు భాజనమయ్యే అభ్యసనపు రేఖలు ఈ రచనలో కలవు." అని అన్నారు. ఇదే ఈ పుస్తకానికి అన్ని విధాలా సముచితమైన విమర్శన.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty Street, Madras. Edir to: S. Sambhu Prasad